అఖిలమైన జగద్వ్యవహారమునకు
సకలమైన ప్రపంచ విజ్ఞానమునకు
వివిధమైన మనోభావ విసరమునకు
నిరత మాధారమైన దక్షరము కాదె?
ఒక్కటై యొక్కరూపు నొండొంటఁగలసి
వేఱువోలిక నందుచు వివిధగతుల
వలన వివిధాకృతులఁ దాల్చి వఱలుచుండు
నట్టి యక్షర తత్త్వంబు నరయ వశమె?
ధరణిలో నామరూపభేదంబులైన
సకలజీవ భావంబులు సకలలోక
గతులు, సకలేప్సితార్థ సంతతులుఁ దుదకు
నక్షరమునందె సంక్రాంత మగును గాదె?
నిత్యమై, నిర్మలంబయి నిశ్చలమయి
నిఖిలమున కాదిమై వర్ణనీయమైన
ప్రణవ మోంకారరూపశబ్దంబుగూడ
మఱిమఱిం జూడ నక్షరమయమె కాదె?
ప్రకృతి నన్యోన్యవస్తు సంపర్కకలన
నాకృతి గుణంబులకు భేద మైనయట్లు
లీల నన్యోన్యవర్ణసమ్మేళనమున
నర్థఫలసిద్ధులకు భేద మగుచు నుండు.

ప్రకృతి రూపంబుఁ గని పరబ్రహ్మమూర్తి
యఖిలభావంబులకును దా వైనయట్లు
గ్రంథరూపంబుఁ గాంచి యక్షరచయంబు
నఖిలభావంబులకును దా వగుచు నుండు.

ఆకసమునుండిపుట్టిన యట్టిశబ్ద
మాకసమువోలె నీరూప మగుచు నుండు
నక్షరంబునఁ బుట్టిన యట్టిశబ్ద
మక్షరాకృతితో నిత్య మలరుచుండు.

ధారుణి, నదీప్రవాహస్ఫూర్తి సారవంత
మర్థవంతము, ఫలవంత మైనయట్లు
భావమక్షరసంస్ఫూర్తివలన సార
వంత, మర్థవంతము, ఫలవంత మగును.

వికలితనదీతరంగమాలికలలోనఁ
బ్రకటితాక్షరరూపమాలికలలోన
శబ్దములె పుట్టు నైన నక్షరభవంబు
లైనశబ్దంబులేసుమీ సార్థకములు.

వివిధమతములవారిచే వివిధరూప
భావముల బ్రహ్మ మర్చింపఁ బడినయట్లు
వివిధభాషలవారిచే వివిధరూప
భావముల నక్షరము వాడఁబడుచునుండు.

ఆత్మనిర్వృతికో, పరమాత్ము దేవు
నరయుటకో, పరమాత్మ తా నగుటకో యకో
సంతరింపఁగఁదగిన విజ్ఞానమునకు
సాధనంబైన దల్లయక్షరమ కాదె ?
ఒకనిఁ బ్రేమించి తగురీతి నోముటకును
నొకనిఁ గోపించి తగురీతి నొంచుటకును
వలఁతియైయున్న నరపాలవరుని చేతి
కలమునకుఁ గల్గుశక్తి యక్షరమ కాదె ?
జగతిఁ బుట్టింప, రక్షింప సమయఁ జేయఁ
గర్తయై, భర్తయై సమాహర్తయగుచుఁ
గర్తృకర్మక్రియాశూన్యగతి వెలుంగు
పరమ తేజంబు నక్షరవాచ్యమె కద !
ప్రకృతిజీవులలోన నీశ్వరుని వెనుక
నిలువఁబడియున్న మానవకులమునెల్ల
నెలమిఁ బైమెట్టునెక్కింపఁ గలుగుటకును
సాధనంబైన దక్షరజ్ఞానమొకట !
సృష్టికర్తకు నీజగత్సృష్టివేళ
దత్తదుచిత విజ్ఞానంబు దనరఁజేయు
నేమహాశక్తి ? యట్టివాణీమతల్లి
యక్షరాకృతియే గదా యరసిచూడ !

నీలములు, రత్నములు, గుణనియతిఁ జేసి
ప్రబలియును నలంకార మాత్రములె కాని
సార్థకమ్ములు, నుతపరమార్థకములు
నైన యక్షరవర్ణతుల్యంబులగునె ?
అక్షరం బీజగద్వ్యవహారమునకు
నెన్నియొ పదంబులను సృజియించుచుండ
నలపరబ్రహ్మ లోకయాత్రార్థ మనుచుఁ
బ్రాణికోక కొన్ని యొసఁగు నుపాధిఘనత.
విశ్వమెల్లను వార్తచే వెలయుచుండు
వార్త వెలయును పత్రికావ్యాప్తివలన
పత్రికాస్ఫూర్తి యక్షరావాప్తిఁ గలుగుఁ
గాన నక్షరమే జగత్కల్పకంబు.
అక్షరము వాణికాధారమగునొ ? వాణి
యక్షరంబున కాధారమగునొ ? యక్ష
రాకృతియె వాణియొ ? యెఱింగి యానతిండు
సహమ లాక్షరతత్త్వ విజ్ఞానులార !

(20-6-1910.)

# 2 కపోతము.

క. శ్రీమంతంబై విభవో
ద్దామంబై పుణ్యలోకధామం బగుని
త్యామోదస్థానము హ
స్తామలకం బగును సుకృతులగువారలకున్.

---

క. కంటఁ దడి యేల పెట్టెదు?
వింటికి మొగ మెత్త వేమి వెత చేకూరెన్
దంట నెడఁబాసి యేమిటి
కొంటిగ లేమావిగొమ్మ నుంటి? కపోతీ.

క. జలజలఁ గన్నుల నశ్రులఁ
జిలుకుచు మెడఁ గుంచి క్రుంగి చెలువమెడసియీ
మొలఁగొమ్మ నొంటికాలను
నిలిచి తపించెద విదేటినెగులె? కపోతీ.

క. మెత్తని ఱెక్కలు, జిగి దళు
కొత్తెదునునుమేను, మెఱయుచుండెడినెమ్మో
మిత్తఱి నేఁటికి వాడెనో?
చిత్తము మెఱియఁదొడఁగెనాకుఁ జెప్పుము కపోతీ.

క. నిలిచి నిలిచి గురగుర మని
పలికెద వేతెఱఁగు ప్రియుని పజ్జ వసింపం
గలనాఁటిదానివలె నే
దలఁత వొడముచుండె మనమునందుఁ గపోతీ.

క. ఎగురఁగఁ జూచెదం వంతనె
మొగురఁగలే వెంతొ దప్పి నెలసితివేమో !
వగరుచుగతిఁ దోఁచెను మొగ
మొఁగుపక నోరిట్టె తెఱచెదేమొ ? కపోతీ.

క. ముసుఁ జొనిపి ఱెక్క లార్పవు;
చకచక నొడలట్టు నిట్టు సవరింపవు; వా
లికచూపుఁ జూచి కులుకవు;
మొక మింతయు కుందనేమినూఁకెఁ ? గపోతీ !

క. నిలిచినచోటను నిలువక
కలఁతవొడము దానివోలెఁ గదుపవి నేలా
సెలుగొమ్మమూటునకుఁ జని
పులుకుపులుకుమనుచుఁ జూచిపోకైదు? చెపుమా!

క. ముకుపుటముల నాహారము
నొక రొక రందించుకొనుచు నుండెదమునిను నీ
సఖునిఁ గనుచుందు మొప్పెడు
సకటా ! నేఁ డెవరికేఁగె నాతఁడు ? చెపుమా !

క. వగఁ గుర్రింగి సొగసుఁగన్గవ
మొగిడిచి తోనె కనువిచ్చి మూర్ఛిల్లెదు నీ
మగఁడు కలలోన నిన్నుం
దిగవిడిచినయట్లు తోఁచెనే? చెప్పవుగా!

క. వలిగాలి చివురువీవన
లోలయింపఁగఁ బ్రియునిఁ గూడియుండెదనీ కీ
యలజడి యేఁటికిఁ గల్గెనో?
పలుకుము నాతోడ; జాలిఁబడలే నింకన్.

క. ఔక్కొంచి దెసలఁ జూచెద
విక్కడ నిను డించి మేఁత కేఁగినవిభుఁ డే
చిక్కులఁ బడియెనో యనువగఁ
జిక్కి; నినుంగాంచఁ గడుపు చెఱువగుచుండెన్.

క. నోరెఱుఁగనిపక్షికి నీ
కారాటముఁ గూర్ప నక్కటా! నీదుమనో
హారు వలఁ బట్టి యాతనిఁ
గ్రూరుఁ డొకఁడు బుట్టఁ బెట్టికొని పోఁడుగదా!

క. అదిగో! చిక్కనినెత్తురు
కుదులఁగ నెలఁగొమ్మ గ్రుచ్చుకొనియున్నదియా
పదనగుబాణము; నీప్రియు
నెదుటఁబొమ్మన నాఁటి దూసి యేఁగినదేమో!

క. ఇది నిజమే యయ్యయ్యో!
పొదలెడు నీమగనివ్రాదయపుటభేదనమై
ప్రదరాఖ్య సార్థకంబుగఁ
బదనై యమదూతభంగి భయమిడుచుండెన్.

క. పతులు వగఁ బొగుల సతులన్
సతులు వగం బొగులఁ బతులఁ జంపుదురకటా!
మతిహీనులు మృగయులు దు
ర్గతు లున్నవటన్న భయము గలదో? లేదో?

క. కలకలఁ గూయుచు ముద్దులు
గులుకుకపోతములఁ జెంచి కొంచురుగా కి
ట్లలుఁగులపా ల్సేయుదురే?
యలరుం గునపాన గుచ్చిత్తు రటర? కిరాతా!

క. కటికితనంబున కే ము
చ్చటపడియెద వెట్టిపావ జాతివో? పాపిణుల్
కటకటఁబడ నేసెద వ
కట్టా! బిడ్డలఁ గన్నకడుపు గాదే మృగయా!

క. జీవన మీవనసీమల
నీవారము మనుపు; మనుపు నీవనుభావం
బావహిలఁ గూయుపక్షుల
నే వేఁటాడెదు కిరాతు డెంత యదయుఁడో?

క. అలుఁగా! యని వెనుదీయని
బలియురపైఁ జూపు నీదు వాఁడితనం బీ
పులుఁగునునుమేన నటవే!
యెలయునె దయ బోయ నాశ్రయించిననీకున్?

క. మీాయుసురు లపహరించిన
బోయఁడు సుఖ మొక్కప్రాఁటు పొందునొ లేదో?
మీాయుసురు దాఁకి యూతని
వేయుగతులఁ గలఁపకుండ విడదు కపోతీ!

క. అలుఁ గలుకుపైనచోటక
బులుఁగు నిలువదందు రోకపోతి! యిదే లే
చెలువునెడఁబాటు నెమ్మదిఁ
గలఁగింపఁ దెగించి చావఁగాఁ దలఁపవుగా?

క. మెడ వ్రేలవైచి, వడవడ
వడఁకుచుఁ, గన్నుఁగవ దేలవైచి, పదంబుల్
తడఁబడ జెక్కార్చి, భువిం
బెడమోమై పడితి వుసురు విడలేదుగదా!

క. అయ్యో! యిఁక నేమున్నది?
కొయ్యవడె న్మేనుగుండె కొట్టుకొనదు నీ
కయ్యొ నొడలు శ్వాసము రా
దయ్యె నుసురు విడిచి పోయెనా? యకటకటా!

క. పతికిని సతియే సతికిం
బతియే గతి యని తలంచు పక్షివి గానన్
బతి యీలోకము విడువఁగ
నతని ననుసరింప నిట్టులైతె? కపోతీ !

క. జగ మంధకారమయమై
వగపు సముద్రమయి బ్రదుకు భారంబై తోఁ
పఁగ మగనిఁ గోలుపోయిన
వగఁ గూలిననిన్నుఁ జూడ వగ పయ్యెడినే !

క. వలపులఁ గూరిమినెరపెడు
తలఁపుల నొండొరుల మించు దంపతులకు దు
ర్బలవిధిచేత వియోగము
గలిగిన నేకరణి నోర్వఁగావచ్చుఁ? గటా !

క. చెలువలసుఖదుఃఖములకు
చెలువములకుఁ బ్రియములకు జీవమ్ములకున్
చెలువులకలుములె యూఁత
మ్ములనిమెఱింగికొని చేరఁబోయితె ప్రియునిన్ ?

క. చనిపోవుమగని విడి, న
చ్చినవేరొకమగనిఁ గోరి చేరెడుపక్షుల్
నినుఁబోఁటివారు గారే
కనుఁగొన నది నీకుఁ దప్పుగాఁ గనఁబడెనే?

క. ఓ వెఱ్ఱిపులుఁగ ! యేఁటికిఁ
జావవలయు నమ్మ ! నీదుసంతతి బ్రదుకం
గా వెరవుఁగలదె ? విధవలు
జీవించి సతీవ్రతంబుఁ జెల్లింపరఁటే !

క. చెలువల రెండవ పెండ్లికి
బలవంతము చేయుదురటె ! వలదనుచుండం
గులజులు; దూరాలోచన
వలదే ? చాకున్న నీస్వభావము చెడునే ?

క. కులకాంతల నినుఁ బోలం
గలవారలు కోటికొకరు గలరో లేరో ?
కులశీలవ్రతనియమం
బులు నీకే చెల్లెనమ్మ పులుఁగువడంతీ !

క. మన మిచ్చినతని కేమి
చ్చిననైన ఋణంబుఁ దీర్పఁ జెల్ల దనికదా
చనవిచ్చినమగనికినై
తను విచ్చితి వెంతసుగుణ ధన్యవా పతగీ.

క. నిన్నెఱుఁగుదు నీతిన్నని
తెన్నెఱుఁగుదు వంగడంబు తెరఁ గెఱుఁగుదునో
పున్నెపుఁబులుఁగ ! మఱేమను
కొన్నను గొల మూటగట్టుకొనుటవె కాదే!

క. అరుగుము దివ్యపతంగీ!
యరుగు! మరుగు! మమలమై సదానందదమై
శివమై తేజోమయమై
పరగుపదంబునకు విభుని పరిసరమునకున్.

క. అందఱు సదయహృదయులే
యందఱు సమభావయుతులె యందఱమృతులే
యందఱుఁ దృష్ణారహితులె
యం దెందును మృగయ యుండ దరుగుకపోతీ!

(20-5-1910.)

# 3 కల్పలత.

చ. అనఘ! వసంతయామినుల
నాసవపానవిలోలచిత్తులౌ
జనులు, సుమద్రవం బవనిఁ
జాఱఁగఁ దత్ప్రతిబింబితామృతాం
శుని, మధువానుచీమలను
జూచుచుఁ "జీమలు చంద్రబింబముం
బన మొనరించెడిన్" భళిరె!
మాయురె! యంచుఁ దలంత్రు మూఢులై.

ఉ. చెనకినయంతమాత్ర చలి
చీమలచేనహీ సచ్చు నంచుఁ దా
వినినకతాన నై నిలిపి
చెంతగఁ జీమల రాహుభీతి లోఁ
గనుఁగొని చందురుం డటులు
గావునఁ "జీమలు చంద్రబింబముం
బన మొనరించెఁ" జనునె
వానిని మట్టియు నిట్టి యం చనన్.

చ. కనఁ దెలిదమ్మిఱేకుల నొ
కానొకచోఁ దగెఁ గెంపుఁజాయ, మె
త్తనిపవడంబు గన్పడియెఁ
దార్కొని "చీమలు చంద్రబింబముం
బన మొనరించెడిన్" భళిరె !
మాయురె ! దుశ్శకునత్రియంబు శో
భన మిదు నంచు జప్పనము
వచ్చెను నందకుమారు సేవకున్.

---

క. భూతేశుపరమకరుణా ప్రి
"భూతంబై యుదకరూపమున భూమికిఁ దాఁ
దోఁతెంచె ననఁ"గ జాహ్నవి
ఖ్యాతిగఁ గాశీపురంబునం దలరారున్.

క. ఆతతభగవత్కరుణా ప్రి
"భూతంబై యుదకరూపమున భూమికిఁ దాఁ
దోఁతెంచె ననఁ"గ వర్షము
భూతగణాధార మగుచుఁ బొలుపొందు నృపా !

క. ద్యోతల మంతయును ద్రవీ
"భూతంబై యుదకరూపమున భూమికిఁ దాఁ

దోతెంచె ననఁ" గను మహో
త్పాతపువర్షంబు గురిసెఁ బ్రియమునన్నృపా.

—

చ. తెలతెల వేఁగుచుండుటను
దేజము దక్కెను నీమసంపదల్
గొలకొల మంచుఁ బక్షులఁ
గూడెను మామధుపవ్రజంబు నే
నెలనెల వైనఁ గాన నిట
యీవని ;—వారదె! పోవుచుండి రా
" వల వలరాజు రాజుఁ—గలు
వా! కలవా లవలీలతావళుల్ ?"

చ. చెలిమిని బాసి కాలగతి
చేతఁ బరస్పర మేఁగుచుండి రా
" వల వలరాజు రాజుఁ గలు
వా! కలవా లవలీలతావళుల్ ?"
చెలువుఁడు లేఁ డటంచు వగఁ
జెందకు స్వప్రభచేత లేఁతవె
న్నెలలను దోఁపఁ జేయుచును
నీమదికిం బ్రమదంబుఁ గొల్పెడిన్.

చ. చెలియ వియోగతాపమునఁ
జిక్కె నటంచు నిశాతబాణపం
క్తుల నుడుకైన వెన్నెలలఁ
గుప్పుచుఁ గప్పుచు వేచుచుండి రా
“ వల వలరాజు రాజుఁ గలు
వా ! కలవా లవలీలతావళుల్ ”
కొలఁకునఁ ? జేయఁగావలయుఁ
గోమలికిన్ శిశిరోపచారముల్.

[కల్పలతలోని ప్రశ్నల కుత్తరములు : కవిత్రితయము]
(30-12-1903.)

# 4 చాటుపద్యములు.

సంధ్యారాగవర్ణనము.

చ. తనప్రియురాకఁ గోరుచు న
తం డరుదేరఁగ మోము వాంచి సి
గ్గున, మదిలోఁ బెనంగొనెడు
కూరిమిఁ జూ హృదయేశుఁ గౌఁగిటం
జొనిపియుఁ దోడిదిక్సతులు
చూతురొ యేమొ? యటంచు నల్దెస
ల్గనుఁగొను వారుణీసతివి
లాసపుఁజూపులో! సాంధ్యరాగమో!

చ. కువలయ మేలలేమిఁ దన
కున్ మునివృత్తియె యంచుఁ గావిసా
లువులు ధరించి పద్మినిని
లో నొకసారి దలంచి రాగసా
గరము ప్రవృద్ధ మౌటకుఁ గ
రంబును జింతిలి యొప్పెటో తెగం
విడిచె నినుం డనంగ దివి
నిండి వెలింగెడు సాంధ్యరాగముల్.

మ. దినమెల్లం దను నాఁగ మార్గోపసేవమం
దేహాళితోఁ బోరుటం
దనువెల్లన్ రుధిరంబు గ్రిమ్మ నినుఁడ
స్తగ్రావముం జేరి, తెం
పున నాయూవునఁ బశ్చిమాబ్ధి యనుపెం
పుందల్లినిం జేరినం
తన శోకించు నటంచు నాకనది ర
క్తంబుం దొలంగించి తా
జనెఁ గాఁబోలును చూడు మింట వరుణా
శస్థ రక్తకాంతుల్ సఖా!

(కవిత్రితయము—12-8-1904.)

---

నారికేళము.

మ. పునుకం బెం కొనరించి, యందుఁ దనువుం
బొందించి, లోఁ జిన్నిగం
గను హత్తించి, కలంబరాశి జడలం
గావించి, పైఁ జర్మముం
బొనరం జేసి, నతీవియోగమున మున్
ముక్కంటి జన్మించె నీ
కనుపొందన్; భళి! నారికేళము! త్వదీ
యౌన్నత్య మే మందునే!

ఉ. నారికెడంబ! నిన్ను విధి
నారికెడంబుగఁ జేయఁ జింత మైఁ
బారఁగఁ బూచి, కాచి, కడుఁ
బండియు, నెండియు, రాలి, గాస్గునం
దారట మొంది, త్రైలగుణ
మంది, పరీమళవస్తుసంపదం
జేరి తదంగనాలకల
చెల్మిని దొంటికొాదం ద్యజించితే!

మ. నినుఁ బాదంబులఁ దన్ని, పై కెగయుచున్
నీయుత్తమాంగంబునం
దును బండ్లం బగిలించి తద్రసము నెం
తో దావ నేవారికై
నను దాపం బెడలింతు వీవు త్రుటిలో
నన్ నారికేళంబ; చెం
దినకష్టంబుల నెంతురే ఘనతరుల్
దీనాళులం బ్రోచుచోన్.

(కవిత్రితయము—12-8-1904.)

## చంద్రవర్ణనము.

చ. పరుషవచశ్శరంబులను
బాలిశుఁ డెంతగ నొవ్వనాడినన్
సరసునిచిత్త మెల్లపుడుఁ
జల్లనిచూపులె చూచుమాడ్కి ; భా
స్కరుఁడు ఖరాంశుపాళి కడఁ
కం దనపైఁ బ్రసరించుచుండినన్
సురుచిరశీతకాంతుల వ
సుంధరఁ జల్లెడుచంద్రుఁ జూచితే !

చ. తనకడఁ దారకాజనవి
తానము పేరిమిఁ జేరి కొల్వ, మి
న్ననియెడుసింహపీఠమున
యందు సమంచితకాంతివైభవం
బునఁ దనరారుచుండి, కడు
పొంగెడుతెల్విని దిక్పతుల్ నమో
యనఁగను రాజదేకువల
యం బలరారఁగఁ దేజరిల్లెడిన్.

మ. పొలయల్కన్ సతి తన్నుఁ బాసి చనినం
బొప్పేని, కామాగ్నికిన్

లల నింద్రుండు సహింపలేనియెడఁ
జల్లంజేయఁగా, యామినీ
లలనారత్నము మిన్నుపానుపునఁ బూ
లం జల్లి, పూదండలం
దలయుపిం గదియించిన ట్లుడుసుధా
ధామాకృతుల్ దోఁచెడిన్.

(కవితిలకము—13-8-1904.)

---

చాతకము.

మ. ఇరుతీవంచనెలల్ బలే! కుడుపు తే
కేరితి జీవించితే
వరసారంగమ! నేఁడు వారిదుఁడు ద్యో
భాగంబునం దోఁప స
త్వర మేతెంచితి వేడనుండియొ విచి
త్రిం జేర్పడం గుల్కుచుం
గరకంబో? యమృతంపుబిందువొ పరీ
క్షం జేసి భక్షింపుమా!

చ. ఘనుఁడగు జీవనాథ్యుచెలి
కారము పీడిననాఁటఁగోలెఁ దా
ననుపమతాపవేదనల
సందేశునెమ్మిని దేర్పవచ్చి తే

దిట్టుచు నింక వేచికొని
తించురటయ్యా! గృహస్థు లందఱున్?

చ. వెఱవకు నక్కదోస! యపి
వేకమునన్ నినుఁ ద్రెంపినందుకే
శిరమున బుట్టలో నిముడఁ
జేరిచి మోయుచు వాడవాడలం
దిరుగుచు "నక్కదోస!" యని
తేపకుఁ దేపకుఁ గేక వేయుచున్
స్మరణయొనర్చు నిన్నతఁడు
చాలదె నీకిది యెంచిచూడఁగన్.

ఉ. అక్కట! చేతులార జల
మల్లన పోయుచుఁ బెంచినట్టియీ
టక్కరినేద్యగాఁడె యిటు
తారున మాయుచురుల్ హరింపఁగా
నొక్కటఁ దల్లిప్రక్కఁ బడి
యున్న మముం జెఱుపంగఁ దెచ్చె నీ
చక్కకి బుట్టఁ బెట్టె నిది
చాలదె నెత్తికి నెక్క ద్రొక్కఁగన్?

(కవితిలకము—3-9-1904.)

## సూర్యకాంతిపుష్పము.

సీ. తనయభ్యుదయమునఁ దలయెత్తు నొనరించి
యెనలేనికాంతి రేకెత్తఁ జేసి
తనకరస్పర్శను దనువల్లి సలరించి
హృదయసమ్మోదంబుఁ బొదలఁ జేసి
తనమూర్తి తేజంబునను రాగ మొదఁగూర్చి
యనువర్తినిఁగ నన్ను నలరఁ జేసి
తనసత్పథవిహారమున నన్ను భ్రమయించి
యాశలతోడ నల్లాడఁ జేసి
నపరదిక్సతి కనురాగి యగుచు నివ్వ
డన్నియును వీడి యినుఁ డిదే యరిగె ననుచు
సూర్యకాంతమ! తలవాంచి సుక్కిఁబోకు
వారుణీసక్తునకు నెందు వలపుగలదె?

(20-11-1904)

# 5 ఆంధ్రభారతి.



సీ. విబుధులౌ నాంధ్రకవిత్రయంబున చెట్టఁ
బట్టి పారంబును ముట్టినపుడు
నాచెన్కఁ బోతరాజాదులచే నుప
లాలింపఁబడుచు మేల్గాంచినపుడు
నయ్యనంతరమున నలసాని పెద్దనా
దులప్రాపకంబున నలరినపుడు
నామీఁద సూరకవ్యాదులచేఁ దగు
పద్ధతిఁ బోషింపఁబడినయపుడు
నెంతవైభవ మందితో ? యిప్పుడిట్టి
కాలమాసన్నమైన నేగతియు లేక
యెవ్వరెటు లాగినను నటు లేఁగుచుండి
నసిచెడి యున్నైతె! యాంధ్రభాషావధూటి!

సీ. గణయతిప్రాసలక్షణము లేమిటి" కైడి
యూ"కుంటువడిపోవు ననెడివారు
గణముంటదగు; "నైసు"గానుండుఁజదువఁ; ద
క్కినవి "యూస్లె"స్సని కేరలువారు

వ్యాకరణం బేల? పలుకు "మైండుప" కెన్ని
నట్లు వ్రాయవలయు ననెడివారు
కావలె నన్యదేశప్రయోగంబున్నఁ జాలు "న
ష్టై" చేయవగు నని వలుకువారు
నగుచు నుమానుభావులు కవులైరి; నీకుఁ
బ్రాంతములు మీఁదికిని వచ్చెఁ; వచ్చుటవట
విబుధులున్నవా రమృతంబు వేయఁగలరో!
యుటకు చూచుచు నుండెవరో? తెలుంగ!

సీ. పాండురోగము కల వాని దేహముపోలెఁ
బై పూఁత మెఱుగుల పద్యములును
సబలుని యంగంబు లట్లు నీరసములై
వసివాళ్లు వాడెడి వచనములును
పరవి నున్మత్తప్రసంగంబులం బోలి
కడు నసందర్భమగు కల్పనలును
కల్లుఁ ద్రావినవాని కాఱుకూఁతలు పోలె
బడబడలాడెడు పాటవనము
లెన్ని యున్న యవుచు లెక్క యిడఁగ రాక
పెఱుగుచుండె నీనాఁడు; వివేకమును స్వ
భావము ననుమాటమే లేదు పరకవులకు
నకట! యిఁక మీఁద నెట్లొకో నాంధ్రభాష.

సీ. కేవలశ్లేషమ్మే, కావలయును గావ్య
మాధురి కనుబుద్ధి మానుదాఁక
ఘనహారి కేశపాకమున గ్రంథము వ్రాయు
కవి ప్రౌఢుఁడనువాదు కడచుదాఁక
దీర్ఘసమాసముల్ తెగి వ్రాయకుండిన
దేలిక యనువెఱ్ఱి తీఱుదాఁక
నొకశబ్ద మగుపల్కులుండుపద్యంబులే
హృద్యంబులనువాఁడు లేఁగుదాఁకఁ
దలఁచినప్పుడె యెన్నొపద్యములు వ్రాయఁ
దగు ననుకవుల్ జనించుట తగ్గుదాఁక
సంతతపియించినను నీకు నెప్పటివలె
వెలయుభాగ్యంబు గలుగదో తెలుఁగుబాస!

సీ. పరగఁ దత్సమతద్భవవ్యాజమున సంస్కృ
తంబుఁగైకొని వేడ్కఁ దనరలేదె!
దేశభాషలఁ గొన్ని దేశ్యపదంబుల
స్నేహమునఁ జేకొని నెగడలేదె!
తత్తద్విశేషసందర్భంబులం దన్య
భాషాపదముల లోఁబఱుపలేదె!
నిక్కంబుగాఁజూడ నీవొక్క కొన్నిభా
షలలోననుండియే కలుగలేదె!

కొత్తయే యన్యభాష లోఁగొనుట నీకు?
మంచియో చెడ్డయో నాదు మాటవినుము
మంచిభాషల నీపోల్కి మార్చికొనుచు
నిలుపుకొనుమమ్మ! నిను నీవె తెలుగుబాస!

సీ. దేశభాషాభివృద్ధికిఁ బాటుపడుచు స
మాజంబులను గూర్చు మహితులార!
మదిఁ దన్పుగతిమృదు మధురరీతులఁ బ్రబం
ధములువ్రాయుకవిమూర్ధన్యులార!
గురువిమర్శనమున గుణదోషములు నిర్ణ
యింపఁ జాలెడు విబుధేంద్రులార!
శ్రద్ధాళులై యనిశంబు సద్గ్రంథముల్
చదివి యానందించు సరసులార!
పండితోత్తమ మొకట బొటుని వఱకుఁ జమువఁ
దెలియఁగలయట్టి గ్రంథముల్ వెలయువాఁక
నవి స్వభావానువర్తంబులై యలరుదాఁక
నాంధ్రభాషాసమభివృద్ధి యగుటకల్ల.

గీ. కవులకెల్లు వ్రాయఁగ బుద్ధి కలుగుఁగాక!
దీనినే పండితులు సమర్థింతురిగాక!
దినమునకు నొక్కవింతగాఁ దెలుఁగుబాస
దేవదేవునికరుణ వర్ధిల్లుఁగాక!

(6-6-1910.)

# 6 ముద్దరాలు.

"తెల్లనగు వస్త్రములమీఁద నల్లగల్వ
లెవరు చల్లినారే?" యని యెంతొ వింత
ముద్దరా లనుచున్నది ముచ్చటపడి
కలము బావ యటందురా గరితలార!
ముగుద మొగమింత చేసికో నగెద రేల?
బావ యేచెర్వులో దిగఁబడెనొ కాని
మంచిపూవులఁ గోయఁడు కొంచెమైనఁ
గొప్పులోఁ బెట్టుకో రాని కోమలములె?

# 7 గృహలక్ష్మి.

క. రత్నంబుచేత మేల్మియొ
రత్నము మేలిమినో జగతి రాణించుటయున్
బతిచేత సతియొ సతిచేఁ
బతియో వెలయుటయు, నెఱుఁగఁ బడ దెవ్వరికిన్.

ఉ. ఏమొకవాక్య మిందు వచి
యించెద నొప్పిద మంటయే బుధ
గ్రామణులైన వారినుడి
కారము ; సమ్మదసంభ్రమావళో
కామితకౌతుకాభ్యుదయ
మహాగృహిణీరమణీయదర్శనం
బే మహనీయవిత్త మొల
యించునో వానిదె భాగ్యమెన్నఁగన్.

గీ. అవనిలోఁ గల్గుపూజ్యవస్తువులలోనఁ
జెలువ తా నొక్కఁడయి ప్రకాశించుననినఁ
గాంత గేహమ్మునకు నలంకారమనెడి
మేటికవివాక్యరత్న మేమిటికిఁ జాలు ?

చ. నరులపురోభివృద్ధికి స
వాతనకారణశక్తి యై విభా

స్వరగురుగేహరాజ్యవిభ
వంబున కాదిమసన్నిధానమై
పరగెడుమానినీవిమల
పావనచిత్రచరిత్ర మేకవీ
శ్వరుఁడు రచించి తృప్తిఁ
గనఁజాలునొ నిక్కము తెల్పుఁడెల్లరున్.

సీ. తనయయై తనతల్లిదండ్రులమది ముద్దు
పలుకులనాటపాటలను దనిపి
కాంతయై ప్రాణేశు కనుసన్నల మెలంగి
యనుకూలవర్తిని యై చెలంగి
సోదరై గుణముల కుప్పయో యనఁగఁ దా
నత్తమామల కెమరాడకుండి
అత్తయై కోడండ్ర ననుఁగుఁదనూజుల
సమ్మోవిధంబుల నాదరించి
గీ. అఖిలరూపంబులను దాన యగుటకతన
నఖిలరూపంబులకును దా నాథ్యయగుచు
లలితసంసారసామ్రాజ్య లక్ష్మియనఁగ
నిహపరసుఖంబు లిడునది యింతికాదె?

చ. గలగల సందియల్ గదలఁ
గా నెమలై దరహాసయుక్తయై

కలకలలాడునె మ్ముగము
  గప్పడఁ జేసెడు నవ్వు డెంతగాఁ
గలఁగెడుమానసం బయినఁ
  గౌతుక మందఁగఁ జేయుచుండు నా
చెలువల గేహలక్ష్ము లని
  చెప్పుట చాలునొ చాలదో సదా!

గీ. వనిత గృహరాజ్యలక్ష్మియే వాస్తవముగఁ
గానిచోఁ దత్కటాక్షపక్షీనియుక్తి
కలరి సామ్రాజ్యభోగేయుఁ దైనఁగాని
పురుషపోత్తముఁ డెవఁగూర్పఁ బూనువేల?

ఉ. పంటయుఁ బాఁడియున్ బల మ
  పారకళావిభవంబు భాగ్యమున్
దంటతనంబుఁ బౌరుషముఁ
  దాల్చిరసమ్మె నొకయింటివారుగా
నుంటకు మంగళాంగులు న
  మోఘపవిత్రచరిత్ర లైనవా
ల్గంటులసత్సహాయములె
  కావలయుంగద పూరుషాళికిన్.

గీ. పురుషునకు నర్ధదేహమై శరణమునకు
శరణమై ఘనసంసార తరణ మగుచు

సకలసౌభాగ్యములకు సంస్థానమైన
వనిత లేకున్న భవనము వనముగాదె ?

గీ. అలరుమొగమున నిల్లాలు తలుపుచాటు
గాఁగ నిలుచుండి వెన్నెలఁ గాయునొక్క
చిఱునగవుగాని తేనియ చిందునొక్క
చిఱుపలుకుగాని నెఱపి రంజించు విభుని.

ఉ. మేలిమిపైఁడిపూఁతపస
మించుబవంతుల నంగణంబులన్
నీలమణీవితర్ది కల
నిర్మలభవ్య పవిత్రశాలలన్
వేలుపుటింట్లలోననొక
వింతహొయల్ చెలఁగంగఁ గూర్మియి
ల్లాలు మెలంగుచుండిన గృ
హంబెగృహంబుధరాతలంబునన్.

క. జిలిబిలి పలుకుల ముద్దులఁ
జిలుకుకుమారు నొడిలోనఁ జేరిచికొని జో
లలుపాడి నిద్రవుచ్చెడు
జలజేక్షణ కలుగునిల్లు స్వర్గంబుగదా!

గీ. జగతి రెండింటిచేతనే జరగుచుండు
ధనముచేతను సత్కళాధనముచేతఁ

దలఁప నవి రెండు కాంతా నైదైవతములై
సారమతు లిది నిజ మని తీరవలయు.

(8-7-1910.)

---

## 8 ముద్దరాలు.

మనసుబడి పెంచికొనుచున్న మల్లెతీగ
మొగ్గఁ దొడిగిన దని మది ముదము గదురఁ
గులుకునడకల మట్టెయుల్ గులుకరింపఁ
బసిఁడిచిఱుగజ్జియలు తన్నుఁ బలుకరింప,
వలరుమొగమునఁ జెన్నుట చిలుకరింప
సొగసుఁజూపుల దిక్కులు చూచికొనుచు
నుపవనంబునబడి ముద్దులొలుకుచుండఁ
బూఁపజవరాలొకర్తుక పోవుచుండె.
"అలరుఁబ్రాయంపుజవరాండ్ర కందఱకును
వయసునను సామ్యమే కానఁబడుచున్నఁ
బ్రకృతియందు భేదంబె చూపట్టుచుండు
నహహా! విధిసృష్టినైపుణీమహిమ యేమొ?

అలరుదండలకై కొంద ఱాసపడుదు
రాటపాటలకై కొంద ఱనుగమింతు
రలఁతిచెలినవ్వులకె కొంద ఱలరుచుందు
రనుసరించుట కొక కొంద ఱనుమతింత్రు.

ఒకతె యుపవనభవనమం దుండఁ గోరు
నొకతె నెలరాలతిన్నియ నుండఁగోరు
నొకతె పూవుటీరంబుల నుండఁగోరు
నొకతె నిలువుటద్దముచెంత నుండఁగోరు.

వలపునణఁచుసిగ్గున నలరువారు
సిగ్గునణఁచువలపుచేఁ జెలఁగువారు
వలపొ? సిగ్గొ? యెఱుఁగక వఱలువారు
నగపడుచునుందు రిల ముద్దరాండ్రలోన.''

ఆయతివ పోవుమంతఁ "గోకో" యటంచుఁ
గోకిలము మావిచివురు మెక్కుచును గూసె
నపుడె కలకంఠి ప్రియుఁ జేర నరుగుదెంచెఁ
గాంతకన్నులఁ బడె నాపికద్వయంబు.

"పట్టపగలె నాథుఁడు తమ్ము వెట్టఁబిలువ
నారగింపంగ వచ్చెఁ బికాంగనయును
ఔర! మగ లెంతసాహసు లైనఁగాని
మగువ తనసిగ్గు విడనాడఁ దగునె యిట్లు?

ఎవరో చూచెదరనెడి సిగ్గెంతసిగ్గు?
ప్రాణవిభుఁ డెంతచనవరి యైనఁగాని
యప్పు డెంతటియొంటిపా టైనఁగాని
చెలువ తనసిగ్గు తనుదాన చెఱిపికొనునె?
ప్రియునిఁ గన్నెత్తి కేళికా గృహమునందు
నైనఁ, దమిమించుమాపుల నైనఁ, బైఁట
చెఱఁ గొకించుక మాటుగాఁ జేసినైనఁ
దప్పఁ గనంజాల నిల్వుటద్దమునఁదక్క.
నేనొకర్తుక నున్నప్డు నేఁడుప్రియుని
చనవుచం జేరి యలరింతు నని తలంతుఁ
గాని ప్రాణేశ్వరుండు నాకంటఁబడినఁ
గ్రచ్చుకొను నెటనుండియో వచ్చి సిగ్గు."
అనుచుఁ దలయెత్తి చూడక యలరుబోడల
మాటుసం బడి తనపూప మల్లెతీగ
కుదుపుకొనియున్న సురపొన్నగున్నకడను
నాలతాతన్వి యల్లన నరుగుచుండ,
వెనుకఁ దూగాడుచుండిన వెలఁదిపైఁట
తలిరుగొమ్మ నొకించుక తగులుకొనఁగఁ
గాంతుఁ డపుడప్డు పట్టుట గలదుగాన
సిగ్గునం దిగ్గిమాపడు చెలువుఁడనుచు.

చెలువకును గంపమునఁ జిఱుచెమట వొడమె
కమ్మతెమ్మెర లోలసెను గమ్మటంచు
మలయపవమానహతికిఁ గొమ్మయును దూలె
తరుణిపై ఁటయుఁ దూలెఁ జేతనము వోలి.
అంతిప కష్టను మరలఁ "గో"యని వినఁబడి
యనుఁగుఁ జెలికంఠనాదంబు ననుకరించెఁ
దరుణి చెలి వచ్చె నని వెను దిరిగిచూచె
వెనుక నెవ్వరు లేకుంట విశదమయ్యె.
కోమలాంగికి నెమ్మది గుదుటఁ బడియె.
మరలఁ "గోకో" యనుచు వినంబడియె నంత
వనజదళలోచనయును ముందునకుఁ దిరిగి
మల్లెపందిరికడ సఖిమణిని గాంచి.
అలకఁ బ్రియంపుమల్లిక నాత్మసఖియుఁ
దాను దర్శించి మిగుల సంతసము నొంద
నెంచి పరుగున వచ్చుచు నింతలోనె
కొమ్మభవనమ్మునకు గిరుక్కునను మరలె.
'వలదువలదాఁగుమాఁగుమో చెలువ!' యనుచుఁ
"బడఁతి నాతోడుసు మ్మాన యిడితి" ననుచు
నెంతగా బతిమాలిన నింతి వినక
పట్టుకుచ్చులుజడ వెన్ను ప్రాముతోడ.

పంతమాడంగ మొలనూలు వదలి జఘన
సీమ కేఁగంగఁ బయ్యెద చెఱఁగు మరుని
ప్రబలకేతన మనఁ దూలిపడఁగనొక్క
పరుగులోన లతాంగి దృక్పథము దాఁటె.
కారణము లేకపోవ దాఁ గాంతకొఱకుఁ
బ్రాణనాయకుఁ డాపూల పందిరికడ
నడఁగియుండియుఁ దమకించి యంతలోనె
యొక్కపరిఁ దొంగిచూచె నిల్పోపలేక.
మొదలె సిగ్గరికత్తియ ముద్దరాలు
వలపుఁబూఁదోఁటలోపలఁ బట్టపగలు
చెలి కనుంగొనుచుండంగఁ జెలువునెదుట
నిలుచునే సిగ్గు తక్కువే వలపుకంటె?
చెలువ మదినిండి విరిసిన సిగ్గుకంటె
దయితునకును పదింతలు తమకమున్న
నెట్టులగు? నంతయోపిక పట్టవలయు
సిగ్గుపోవునుపాయంబు సేయవలయు.
చతురమతులార! జగతి లజ్జావతులకుఁ
బ్రాణవిభునొంటిపాటె ప్రియంబటంచు
నెఱిఁగి రెండవకంటివారెఱుఁగకుండఁ
నిలువున మనోధనంబుల విలిచికొనుఁడు.

(10-7-1910)

# 9 పంజరకీరము.

క. అలరుంబోణుల మొత్తని
యలరుం గేల్దోయిఁ బెరుఁగు నంతటిపుణ్యం
బలవడియెఁ గాన నిన్నా
యలరు విలుతువాహనంబ వందురుచిలుకా ?

క. రతనపుఁబంజరమున సం
తతమును వసియించి పంచదారయుఁ బండ్లున్
హితమతి భుజియించెదు స
ద్గతి నీవేకాక యెవరు గాంచిరి ? చిలుకా !

క. అంతిపురంబునఁ గలసీ
మంతినులెల్లరును నీదుమాటలు విన నుం
కింతురు సంతసమునఁ బ
ల్కింతురు మోదమున నాలకింతురు చిలుకా !

క. మన్నించుదొరలు నీకుం
గన్నాకై ప్రోచుచుండఁగా నెన్నఁటికిన్
నిన్నుఁ బరులెవ్వరైనం
గన్నెత్తియొకింత చూడఁగలరే చిలుకా !

క. సకలఫలంబులు నీమ
న్కికిఁ జేర్చుటెకాక పల్కు నేరిపి నీప

ల్కొకవేయివరాలుగ నె
న్నికొనెదరేమిటఁ గొఱంత నీ కోచిలుకా!

క. గాటపుఁ గూరిమి నీకుం
బాటలుఁ బద్యములు నేర్పవలసినచోటన్
మాటకుమాటకు లంచము
పూఁటకుఁ బూఁటకు నొసంగి ప్రోతురు చిలుకా!

క. అరమరలు లేక నీవుం
గొరవంకయు నొకరికొకరు కోడిగమాడం
దొరకొనుతఱి మీముద్దుల
గరగరికలు మెచ్చవచ్చుఁ గాదే చిలుకా!

క. కొదువపడకుండ నీకె
య్యెదివలయునొ దానిఁ గూర్చు నేలికలుండన్
సదనమున నుండునీకు
న్నది లే దను చింతవలయునా? రాచిలుకా!

క. ఫలములచేఁ దనుయాత్రిం
జలుపఁగలవు, సంతతైక సన్మార్గరతిన్
మెలఁగెదవు, రామనామముఁ
బలికెదు సత, మింతకంటె భాగ్యముగలదే!

క. చిలుకా! నీపంజరమున
వెలలకుమీ మొఱకుగండుఁబిల్లులు కడు వి

చ్చలవిడిఁ దిరుగుచునున్నవి
బలవంతముగాఁగ నొడిసి పట్టునొ? యేమో?

క. కవకవఁ గూయుచుఁ జదలన్
జివచివఁ జను నడవిజాతి చిలుకలపలుకుల్
చెవియిచ్చి యేల, వినియెద
వవమతి నెగురంగఁ జెక్కలార్చెద వేలో?

క. తెగియించి గుంపుగుంపుగ
గగనంబునఁ దిరుగుచిల్కఁగమిఁ గని యుప్పొం
గఁగఁబోకు మట్టిమార్గము
తగదుసుమీ నీకునిది యథార్థము చిలుకా!

క. ఆయొడిసెలవేఁటులు నా
రాయిడులా చెట్టుచెట్టురాకలు పోకల్
నీయెదఁ దలఁపవె? యేగతిఁ
బోయిబ్రదుకఁగలవు భ్రాంతిఁ బొందకుచిలుకా!

క. బంగరుగజ్జెలు కాళ్ళ నె
సంగ ఫలాహారములు లసన్నీరములున్
జెంగటనుండఁగ నవహ
ర్మ్యాంగణములనుండు టెవరి కబ్బునె చిలుకా!

క. కికురించి పోయినంతనె
ఘుమఘుమఁగాటులు గోళ్ళమొనల పోటులెకానీ

యకట! నిను బ్రిదుకనిత్తురె?
మొకమెఱుఁగనిచోట బ్రదుకు పొందులుగలవే.

క. ఒక్కరు పెట్టిన ఫలములఁ
జక్కఁగ మెక్కితివి చిన్నతనమాదిగ నీ
వెక్కడ? కాననవాటిక
లెక్కడ? నిలువంగనేర్తు వెత్రుటిమైనన్?

క. మనిచెడువారలనే న
వ్వని నైజముగలుగు వక్రిమతివగు నీమే
లునకె నినుఁ బంజరంబున
నునుపవలసెననుచు నెఱిఁగియుండుము చిలుకా!

క. మది వెనుకముందు నరయక
యెది దోఁచిన నదియొచేయు దెఱుఁగవు లాభం
బిది యని నష్టం బిది యని;
వదలి చనినబోఁదఁ గీడు వచ్చును జిలుకా!

క. అవివేకము నైజము నీ
కెవరేఁ దెలుపకయె తెలియ నెఱుఁగవు స్వేచ్ఛం
దవిలి చరియింపఁగానే
రవు వెడలఁగఁబోకు పంజరంబును జిలుకా!

క. సరివారు వారు మిన్నం
దిరి నే నీపంజరమునఁ దిరుగవలసె నం

చోఱలకుము నీకు వారికి
సరిపడ దిటఁగలదు నీకు సౌఖ్యము చిలుకా!

క. ఎగురఁగలే వించుకయును
దగకును నాఁకటికి నింత తాళవు గడియిం
పఁగలేవు మేఁత నిట నిను
దిగవిడిచిన నెట్లుగా బ్రదికెదవు? చిలుకా!

క. దూరాలోచన సేయఁగ
నేరక యడివూన నెదిరి నిన్నెఱుఁగకయే
వారిని వీరినిఁ గనుఁగొని
కోరకు నీతలకుఁ దగనికోరిక చిలుకా!

క. చిలుకా! యీపంజరమున
నిలిచిన నినుఁ బ్రియసఖిగ గణింతురు నీప
ల్కులఁ నాదరింతు రంతటఁ
గలిసి తిరుగు చిలుక కట్టిగౌరవ మున్నే?

క. పొట్టకు జాలక చెట్టుం
జెట్టునకుం దిరుగుమందు చిలుకలవలెనే
నట్టడవులఁ బడి చన నీ
కెట్టులు సౌఖ్య మని తోఁచెనే రాచిలుకా!

క. వరిచేల జొన్నచేలం
బఱిగల నేరికొని తినుచుఁ బైఁబడుదేగం

దెరలింపలేక దిక్కఱి
యఱచుచుఁ దిరుగాడఁ గోరనా నే చిలుకా!

క. పలుగాకితనమునను బా
ముల కోరిచి చెట్లఁబట్టి పోవగఁ జనునే
యల వెఱఁగి బోయ లొగ్గిన
వలలోఁ బడఁ బ్రాణహాని వచ్చునుగాదే.

క. వన మెఱుఁగవు బోయలజీ
వన మెఱుఁగవు నీవు నిక్కువముగ స్వయంజీ
వన మెఱుఁగవు కనిసంభా
వన మెఱుఁగవు భవన మెట్లువదలెదు చిలుకా!

క. ఇది నీకుఁ దగినసదనము
ఇవలకు మిటనుండి తుష్టిఁగాంచుము యిది గా
దది, యదిగా దిది యని నె
మ్మదిఁ దోఁచినరీతిఁ జనకుమా! రాచిలుకా!

క. నీపిట్ట లెపుడో యెట్టులొ
నై పుణ్యముఁ జూపి మెఱఁగినా రను మిథ్యా
వ్యాపనము సుకవికల్పిత
మీపట్టున నమ్మి చెడకుమీ రాచిలుకా!

క. నీనమ్మదికిన్ మాన
ప్రాణములకు నీవె వజ్రపంజర మగుచున్

బూని చరింపఁగ నేర్పరి
వే నీచిత్రవృత్తి నేఁగఁగఁ జిలుకా!

క. పోషింతురు కాంతలు సం
భాషింతురు భాగ్యవతులు పరమార్థవిదుల్
భూషింతు రెల్లరును సం
తోషింతుర నీగుణోన్నతుల్ గని చిలుకా!

(8-8-1910.)

## 10 మల్లెపూవు.

ఫాల్గునముతోడ శిశిరంబు పరువులెత్తె
జైత్రుఁ దరుదెంచెఁ గొమ్మలుత్సవముఁ జెందఁ;
"చెల్లె! నేఁ బెంచికొనుచున్న మల్లెతీవ
మొద్దుఁను మూటఁగట్టుచు మొగ్గఁ దొడిగెఁ
గోయకుము విచ్చుమొగ్గ యొకొక్కండెయుండె"
ననుచుఁ దనచిన్నిసోదరి కనువదించి
చదువుకొనఁ బోయె నంత వసంతసేన;
చేయకు మటన్న పనులనే చేయుచుంటఁ

జిన్ని బిడ్డలసహజంపుఁ జేష్టయొకద!
యనల చిన్నది మెత్తని మనసుగలది
కానిపని యేమి చేసెనో కాని వేగ
మొక్కపర్వునఁ దనతల్లి యొద్ద కరిగి
మనసుచిడిముడిపాటున మసలుచుండె;
చదువుకొనఁ బోయినట్టివసంతసేన
ముచ్చటకుఁ దోఁటదారినే వచ్చెనేమొ;
కన్ను లెఱ్ఱగాఁ జెల్లెలిఁ గాంచి "యేమె!
పూవుఁ గోసితివా?" యన మొగముఁ ద్రిప్పి
"లేదు లే" దని నవ్వెను లేఁతనవ్వు
నవ్వు పువ్వయ్యె నేమొ? వింతగను దావు
లెల్లమెడ నల్లుకొనె; "నిదియే" మటంచుఁ
దల్లి యొడిలోనఁ జేర్చి యంతయును వెదక
ననలయొడిలోననే యుండె నాసుమంబు;
అనల తెలతెల్లఁబోయి యాననము వంచెఁ;
జప్పటలు గొట్టి కేరె వసంతసేన;
"చేసినది యొప్పొ తప్పొ వచింపవలయుఁ
దప్పు దాఁపఁ జెప్పకు మసత్యంబుఁ దల్లి!
పలుకు దాఁచినఁ జేసినపనులు దాఁగ
వమ్మ!" యని మందలించె నయ్యనల జనని.

(7-9-1910.)

# 11 జీవగీతము.

నీ వెవరో? జీవమా! నిన్ను నే నెఱుంగ
నాకు నీకును ననుబంధనంబు కలిగె
నేమియో యెందులకొ యిది యెఱుఁగరాదు
ఇంతకాలంబు గడచిన నేముకాని
యెప్పు డెచ్చట నేరీతి నీవు నేను
గలసికొంటిమొ బోధంబు గాకయుండెఁ
గాని, నీవును నే నెప్పుడే నొకప్పు
డెడసిపో నుంటి మంచు నే నెఱిఁగికొంటి
జీవమా! చాలనాళులు నీవు నేను
కష్టకాలంబునను సుఖకాలమునను
నొక్కమాదిరిగాఁ గూడి యున్నవార
మకట! నిశ్చలమై, సత్యమైన సౌహృ
దంబు గల ప్రియమిత్రు లిద్దఱుఁ బరస్ప
రంబు విడఁబాడి చనుట కష్టంబు గాదె!
విధివిధానంబుచే నొక్కవేళ నట్లు
విడిచిపోవుటయే సంభవించు నేని
వేఁడినిట్టూర్పు నొకసారి విడుచుకంటె
నొక్కయించుక కంటినీ రొడ్చుకంటె

జీవమా! యింక నెవ రేమి సేయఁగలరు?
ప్రాణమిత్రుఁడు! నను విడనాడునపుడు
నే నెఱుఁగకుండ దొంగతనానఁ బొమ్ము!
నా కెప్పుడుఁగూడ నీప్రయాణమును గూర్చి
కొంచెమైనను సూచింప నెంచఁబోకు
నీమనసువచ్చినప్పుడే నీవు పొమ్ము!
సెలవు గైకొనవలదు నా చెంత నీవు
గాని, యింతటికంటె మేలైనదియును,
పావనంబైనదియునైన పదమునందు
దిరిగి యొసఁగుము నాకు నీదరిసెనంబు.

(7-9-1910.)

# 12 కలము.

మ. కలమా! నింపుము సొంపునై; విశదమై కాంత్యుజ్జ్వలంబై, సుధో
పలసంకాశవికాసమై, మహితపత్రాళిమీఁదన్ మషీ
సలిలాంచన్మృదువర్ణమాలికల నీసామర్థ్య మింపొందఁ; గే
వలనీలోత్పలమాలికావళుల తేవన్ దావు లేపారఁగన్.

క. వారియుము నిర్మలభావవి
ధేయమ్ముగ బుధజనాతి ధేయముగ, జగ
ద్గేయమ్ముగ, లలితసుధా
పారియమ్ముగఁ; బారకశ్రివణపేయముగన్.

చ. హృదయమువెంటనే పరువులెత్తుము మేల్రతనాలకోవ నీ
కొదవినయట్టులే; నిలుచుచుండక మేనితళత్తళదుృచుల్
పొదలఁగఁజేయుటే పనిగఁబోవు మనంతలసత్తటిల్లతా

భ్యుదయముఁ గాంచినట్లె విబు
ధోత్సవదాయిని! దివ్యలేఖినీ!

మ. అమితఖ్యాతి వహింపఁ గోరి తలక్రిం
దైనంత నేమాయె? నీ
క్రియ మెవ్వారల కబ్బునే! సుకవిచం
ద్రప్రౌఢహృద్భాసితా
ర్థము లన్వర్థము సేసి కూర్చెదవుగా
దా యున్నతిన్ లేఖనో
ద్యమసంభూతసువర్ణనీలమణిదీ
వ్యన్మాలికా! తూలికా!

గీ. తళతళత్కాంతి పత్త్రిసంతతుల నొలయఁ
గలకలధ్వని గతిభేదములఁ జెలంగ
భవ్యతరమైనయపుర పథమునందుఁ
బూల, ముత్యాలఁ జల్లుచుఁ బొమ్ము కలమ!

గీ. తిరుగు మరుగుఁ జేసి దీనుని ప్రభుఁ జేయఁ
దిప్పితిప్పి ప్రభుని దీనుఁ జేయ
నెవనిహృదయ మరుగు నేరీతి నారీతి
మెలఁగుశక్తి నీకె కలదు కలమ!

క. శ్రీమంతులచేతులలో
సామంతముఁ జూపు దరివ్యసంతతిపోల్కిన్

ధీమంతులచేతులలో
సామంతముఁ జూపి మెలగఁ జాలెద వీవున్.

గీ. నిలిచి తనపని సతము రాణింపకున్న
వన్నెకెక్కఁడుగాదె నేర్పరితనంబు
జగతి విధిసృష్టియెల్లను క్షరమెకాని
కలమ ! నీసృష్టియెల్ల నక్షరముసుమ్ము !

చ. స్థలము సుధానురూపము ; ప్ర
శస్తపథంబు శుభాక్షరంబు ; తా
వలము సుధీహృదంతరవి
భాసితసాధుమహాశయంబు ; ని
స్తులము ప్రభావ ; మేగతిని
జూచిన నీకుఁ గొఱంత లేదు త్రి
ప్పులఁ బడుచుంటివంచుఁదల
పోయకు కష్టమెకా ఫలం బిడున్ !

గీ. అంబునిధిలోన నుప్పుగల్గినఁ గాని
జలకణము శుక్తి ముత్యమై యలరునట్లె
యక్షరకడ గుడ్డిగచ్చకాయయును గాని
నీవు కవిచెంత ముత్యాలకోవ వగుదు.

చ. అరమరలేక నీవు విమ
లాధ్వమునం జనుచుండువేళ నొ

ప్పరయఁగలేక దుష్టమతు
లడ్డము వచ్చిన నీవిలాసభా
సురవిమలాక్షరాకృతులఁ
జూపుచు నాఁపుము; వార లంతకున్
గలుకుగ నున్నఁ దీవ్రపద
ఘట్టన నెట్టన శాస్తి సేయుమీ!
చ. కవు లను పేరివక్రపథ
గాములచేఁ బహు టబ్బెనేని నీ
పరివిమలరీతు లెక్కడివి?
బండతనంబె శరణ్య మచ్చటన్
దవు నది; మేలిబుద్ధి గల
దానవమే నటఁ గొయ్యవారి కుం
టువడుము; పల్లటీ లెగిరి
టాంకు; మదే యుపకార మయ్యెడిన్.
(5-10-1910.)

# 13 రాజభక్తి.



క. శ్రీయాదవకులభూషణుఁ
డై యొప్పెడు కుంతిభోజుఁడను రాజు ప్రభు
త్వాయతమహిమాన్వితసు
శ్రీయుతుఁడై వెలయు సుప్రసిద్ధుం డగుచున్.

గీ. అతని తనుజాత సకలగుణాభ్యుపేత
పృథ యనఁగఁ గుంతి యనఁగను వెలయుచుండు
నాసతీమణి కభ్యాగతార్చనమున
నతిథిగురుపూజలందుఁ బ్రియంబు ఘనము.

క. ఆసాధ్వీరత్నము దు
ర్వాసోముని మంత్రమహిమ భాస్కరుకరుణం
జేసి కనియెఁ గన్యాత్వం
బోసరిలకమున్న తనయు నొక్కని ననఘున్.

గీ. గోలతనమునఁ దానట్లు గోరికొనఁగ
దినమణి యొసంగినట్టినందనునివలన
నాభిజాత్యంబు రూపఱె నంచు వగచు
నామెఁ గని భాస్కరుండు దయాళుఁ డగుచు.

గీ. గన్యకాత్వంబు దూష్యంబు గాకయుండ
వర మొసంగిన, నాఁడుది తరుణియంతఁ

దామరాకుల దొన్నెలోఁ దనయునునిచి
గంగలోపల విడిచె దుఃఖంబుతోడ.

క. ఆవెనుకఁ గొంతకాలము
పోవఁగ నాసాధ్వి పాండుభూపాలునకున్
దేవి యయి కనియెఁ దనయులఁ
బావనులను ధర్మభీమపార్థుల వరుసన్.

గీ. గంగలోనిడ్డ నెత్తురు కందు కొట్టి
కొనుచుఁ బోవంగ సూతుఁడొక్కరుఁడుగాంచె
సహజకుండలు భాసితు మహితతేజుఁ
గనులు మిఱుమిట్లు గొన మది కలుకు మసఁగ.

గీ. పెన్నిధిం గనుఁగొన్నట్టి పేదవోలె
తా నపుత్త్రికుఁ డగుట నాకూననెత్తి
పరుగుపరుగున నింటికి నరిగి తనదు
వనిత కిడి ప్రేమమునఁ బెంచికొనుచునుండె.

గీ. కర్ణుఁ డనుచు నామకరణంబుఁ గావించి
బిడ్డ కాలు క్రిందఁ బెట్టనీక
యలరఁ జేయుచుండఁ దొలిచెక్కు నెలవోలె
దినదినాభివృద్ధిఁ గనియె నతఁడు.

గీ. సూతపుత్త్రుఁ డయ్యు సుక్షత్త్రియకుమార
వరుల నెల్ల మించి వఱలు ననుచు

లలిత కవచకుండలములఁ గన్గొని జను
లబ్బ మొంద నాతఁడలరుచుండు.

గీ. పాండుభూపాలు వెనుక నప్పాండవులను
దనసుతుల నేకరీతిగాఁ బెంచికొనుచుఁ
గురువిభుఁడు వారలకు ధనుర్గురునివలనఁ
జేర్మి ధనురాగమంబు నేర్పించుచుండె.

క. ధృతరాష్ట్రుని తనయుం డు
ద్ధతుఁడగుదుర్యోధనునకు నాకర్ణునకున్
బ్రతికిన బ్రతుకుట, మృతిఁ గన
మృతిఁ జెందుట—యనెడుపాటి మిత్రతగల్గెన్.

గీ. అతఁడు సూతుఁడు నే రాజ ననెడిభేద
మొక్కయింతయు లేక దుర్యోధనుండు
కర్ణుఁగూడ సహాధ్యాయిగా నొనర్చె
ప్రభుఁడు తలఁచినఁ దీరనిపనులు గలవె?

గీ. అన్నదమ్ములకును బిడ్డ లైనయట్టి
పాండవులకుఁ గౌరవులకు బాల్యమాది
నాటలందుసైతము వైరమగుచునుండె
భీమబలుఁడై మెలంగెడు భీమువలన.

క. అట్టియెడ నాంబికేయుని
పట్టికిఁ దాఁజేయుద్రోహ వాద్రోహగుచున్

నెప్పిన విశ్వాసము చూ
పట్టి మెలఁగుఁ గర్ణుఁ డనిక భక్తిపరుండై.

క. విలువిద్య నొండొరులకుం
గలభేదముఁ దెలియఁ బార్థ కర్ణులఁ జేరం
బిలిచి గురుఁడు మీాశక్తుల
వెలయింపుం డనినఁ గసలి భీముం డంతన్.

క. సూతసుతుఁడు సత్కులసం
భూతుం డగు క్షత్త్రియోత్తమునితో నెదురై
పోతరమున సత్త్రకళా
చాతుర్యముఁ జూపు టార్యసమ్మత మగునే?

గీ. అని వచింప దుర్యోధనుఁ డంగరాజ్య
మితని కొసఁగితి రాజయ్యె నింతనుండి
యని కిరీటంబు గొడుగుఁ గర్ణున కొసంగి
పరిభువుమారులలోపలఁ బ్రభునిఁ జేసె.

గీ. అస్త్రవిద్యాప్రదర్శన మందు నాఁడు
కర్ణపార్థు లొండొరులను గడచుకతన
కర్ణసాహాయ్యమే తన కార్యసిద్ధి
నొసఁగు నని నమ్మియుండె దుర్యోధనుండు.

గీ. బాల్యమాది పాండవులతో వైరమగుట
నొక్కసమయంబునందు దుర్యోధనుండు

శకునిధర్మజులకును జూదంబుఁ గూర్చి
యనఘు లగువారి రాజ్యంబు నాక్రమించి.

గీ. వనమునకు నేఁగి ద్వాదశాబ్దములు గడప,
నూఱ నజ్ఞాతవాసంబు నొక్కయేఁడు
గడప వారల నొప్పించి వెడల నడచి
కృత్రిమపథానువర్తి దుష్కీర్తి దాల్చె.

గీ. పాండవులు దాను నేకగర్భస్థులగుట
తెలిసియుండియు వారింప వలఁతియయ్యు
తన్ను మన్నించు నృపతిచిత్తంబురీతి
నంగపతి పోయెఁ గాని వల్దనక యుండె.

క. తమ్మెఱిఁగి ప్రోచునృపుచి
త్తమ్మునకున్ వచ్చి మెలఁగు తఱి తనుకమని
త్తమ్ములఁ, దమ్ములఁ, దమ్ముల
నిమ్ముల విడనాడికొనెద రిద్ధచరితులిల.

క. తఱచివకొలఁదిఁ గర్ణుని
చరితంబున రాజభక్తి సంపన్నతయున్
గురుతరధీబల తేజ
స్స్ఫురణంబును దోఁచుచుండుఁ బూర్ణముగాఁగన్.

గీ. ఘనులు కాననవాసాదికంబుఁ దీర్చి
పాండుసుతులు దుర్యోధనుపాలి కొకట

రాజ్యభాగంబునుం గోరి రాయబార
మల్లవసుదేవనందను నంపినపుడు.

క. సంధి కుదురంగనీక మ
దాంధత దుర్యోధనుండు హరి శ్రీకృష్ణున్
బంధింపం దలంప నాగ
ర్వాంధుని యూనతినె పోవం డాకర్ణుండున్.

క. కౌరవపాండవులకుం గల
వైరము వారింప వలను పడకుండుటచే
శౌరి చనుచుండి కర్ణునిం
జేరి పలికె మృదులమధుర శీతలఫణితిన్.

క. బావా! సూతసుతుండ వని
నీవనుకొనుచుంటి వేమొ నిజముగం గుంతీ
దేవితనయుండవు భారత
భూవరుండవు ధర్మరాజ పూజ్యుండవు సుమీ!

గీ. అగ్రజుండ వౌట నీవు రాజ్యంబు గొనుము
వలచు ద్రౌపది యాఱవ వరుస నిన్ను
నఖిలరాజన్యమణులు నిన్నాశ్రయింతు
రితరులను గొల్చి బ్రదుక నీ కేంటికయ్య?

గీ. మాత్స్యయాదవ పాంచాల మనుజపతులు
నీపనుపు సేయు నిరతంబు నిన్నుం గొలుచు

ధర్మరాజాదులకడఁ బెత్తనముఁ దాల్చి
నీదౌరతనంబు నెమ్మియు నెఱపుమయ్య.

క. అనపుడు శ్రీకృష్ణా ! నా
జననం బెఱుఁగుదును; ధర్మజప్రముఖులు నా
యనుజులగు టెఱుంగుదు ; నై
నను గురుపతి నెట్లు విడుతు నమ్మినప్రభునిన్ ?

క. నన్నెఱుఁగరు కౌంతేయులు ;
కన్నెతనమునందె కుంతిగని విడిచెను న
న్నన్న నగరె ? యేమని మీ
యన్న ననుచుఁ జేరువాఁడ నాపాండవులన్.

క. జననీజనకులకంటెను,
ననుజన్ములకంటె, బాంధవావళికంటెన్,
ననుఁబెద్దఁజేసి దుర్యో
ధనుఁ డింతటివానిఁ జేసె దయ దైవాఱన్.

గీ. అంతియేకాక పార్థునే నొంతుననుచు
నమ్మియున్నాఁడు దుర్యోధనప్రభుండు
అట్టియేలిక విడిచి మీయన్న ననుచుఁ
బాండవులతోడఁ జేరుటేపాటికీర్తి ?

గీ. ధర్మజుఁడు చక్రవర్తి కాఁదగినవాఁడు
అన్నగా నన్నెఱింగిన నట్టిపదవి

నతఁడు గోరఁడు గాన నెట్లయినఁగృష్ణ!
యీరహస్యంబు బయలుగానీకుమయ్య!

క. అని వాసుదేవుతోడన్
వినయము గౌరవము దోఁప విశదపఱచి క్రి
న్నన యనిపెఁ దగినతెఱఁగున
ఘనమతి కర్ణుండు రాజకార్యపరుండై.

క. ఒకనాఁడు కుంతి యొరు లెఱుఁ
గకయుండ రహస్యవృత్తి గంగానదిచెం
తకుఁ జని జపయుక్తునిఁ బు
త్త్రికునిం గని సూర్యజపవిధానాంతమునన్.

క. తనరాకఁ దెలిపి యాతఁడు
తనతనయుం డగుట తొల్లి తపనునివలనన్
జనియించు టాది యాతని
జననకథం దెలిపి నిలుపఁజాలనికరుణన్.

క. పరితాపామోదాశ్రువు
లిరుగన్నుల కొనలనుండి యిరుదెఱఁగులు గా
నొఱలుచు నను(ఁ)గుఁగుమారుని
శిరమున్ దడుపఁ గవుఁగింటఁ జేరిచి పలికెన్.

గీ. అకట! సుకుత్త్రియుండ వీ వయ్యొ సూతుఁ
డితఁ డనెడిపేరు మోయ నీ కేఁటికయ్య?

భారతార్ధరాజ్యభరమానుభవము గలుగ
నితరులం గొల్చి బ్రిమక నీ కేలతండ్రి!

క. ఊరక దాయలపోత్తుం
గోరి దయన్ విడిచి తమ్ముం గుఱ్ఱలతో పన్
వైరముగొని దారుణరణ
ధారుణి నెదిరింప నీకు ధర్మమె చెపుమా!

క. అని వగచే గద్గదని
స్వనము గదురం గరుణ దోంప జనని పలికినన్
విని రాజభక్తిపూరిత
ఘనహృదయుండు ధీరుం డైన కర్ణుం డనియెన్.

గీ. ఎపుడు కన్నీరు విడుచుచు నీవు నన్నుం
గడుభయంబున విడిచితో గంగలోన
నాండె నీకును నాకు ఋణంబు దీఱెం
దనయునింగ నన్ను నీవింకం దలంప కమ్మ.

గీ. ఏను బార్థుని ననిలో జయింతు ననుచు
నమ్మియున్నాండు దుర్యోధనప్రభుండు
కర్ణపార్థులందెవ్వరు ఘనులొ యనుచుం
జూడ నున్నారు తక్కిన జోదులెల్ల.

గీ. తల్లి! మనసిచ్చి యేలినాతనిని ద్రోసి
యెలమిం బెంచినతల్లిదండ్రులను మఱచి

క్షత్రియోచిత మగుపౌరుషంబు విడిచి
యెట్లు వచ్చెద నీబిడ్డ నే నటంచు.

గీ. ఆతని నేనొంప నాతోడ నైదుగురము
నతఁడు నన్నొంప నైదుగు రతనితోడఁ
గాని పార్థకర్ణులు చెల్మిఁగనుట, పుత్త్రి
లార్వు రుండుటయును కల్గదమ్మ యింక!

గీ. పరులఁ జేరితి నని దుఃఖపడకు మమ్మ!
సోదరఘ్నునిఁగా నన్నుఁ జూడ కమ్మ!
ప్రభుబుణముఁ దీర్పఁగా నొక్క పార్థుకంఠ
దొరకినను పెఱతమ్ములఁ దునుమ నమ్మ!

క. అని యనునయమునఁ దల్లిన్
ఘనమతి నూఱార్చి పంపెఁ గాని జననికై
తనరాజభక్తి విడువఁడు
ఘనుఁడగు కర్ణుండు; పొగడఁగలమే యతనిన్.

క. గరువతనంబున సుస్థిర
తరపౌరుషమందు రాజధర్మమున నిజే
శ్వరభక్తియందు సుగుణా
కరుఁడగునంగపతిఁ బోలఁగలరే యితరుల్?

గీ. ఎల్లప్రియవస్తువుల మించు తల్లిప్రేమ
వరబలంబులమించు సోదరులతోడు

అన్నిఁటను మిందు నాభిజాత్యంపుగరిమ
తృణముగా రాజభక్తి కర్పణముఁ జేసె.

గీ. అహితుమార్గంబు ధర్మబాహ్య మని యెఱిఁగి,
యనుఁగుఁదమ్ముల కప్రియంబని యెఱింగి
తనకు గెల్పుట జేకూరదని యెఱింగి
కట్టువడె స్వామిభక్తికిఁ గర్ణుఁ డౌర!

గీ. తన్నుఁ గురువృద్ధుఁ డెంతయర్ధరథుఁ డన్న
చేరి ద్రోణజుఁ డెప్డు దూషించుచున్న
పరుషు సూతజుఁ డని యెంత పలికికొనిన
స్వామిభక్తికై కర్ణుండు సైఁచె నహహా!

గీ. స్యందనము కుంగినను, పార్థుశరచయంబు
ముంచుకొనుచున్న, నుసురు చలించుచున్నఁ
గాని తానెంతధీరుఁడో కర్ణుఁ డట్టి
సమయమునసైన విడువఁడు స్వామిభక్తి!

గీ. తల్లిపైఁ బ్రేమ, తమ్ములందలిప్రియంబు,
కులమునందు గౌరవమును, గోమరులందు
నలరువాత్సల్యమును, ప్రాణమందు నాస
వదలుకొనె నంగపతి రాజభక్తికొఱకు.

(10-12-1910.)

# 14 నాటకములు.

సీ. జనదురాచార హింస్రాజంతుమారణ
క్రీడాసముత్సుకా ఖేటకములు
ధర్మాదిపూరుషార్థచతుష్టయానూచి
కమనీయవిమల శృంగాటకములు
శృంగారహాస్య విశేషరసాపాది
చిత్రవిదూషక చేటకములు
దుర్వాదదుర్మత దుర్నీతిబోధక
విమతసంతానచపేటకములు
ఛాందసాచార దుర్గ్రహోచ్చాటకములు
పాటితాజ్ఞానదుర్విష కీటకములు
అభ్యుపేతసమున్నత హాటకములు
నవనవోద్ఘాటకమ్ములు నాటకములు.

(10-12-1910.)

# 15 యద్దృశ్యం తన్నశ్యమ్.

ముద్దులొలికించు చివురులో మొగ్గవోలెఁ
దావులను జిమ్మెడు గులాబి పూవుపగిది
పగటియందుఁ బ్రభాతసంపత్తి కరణి
నక్షులను దన్ను నుదయారుణార్కునట్లు
పాట పాడుచు నెగిరెడు పక్షిమాద్రి
నల్లనల్లన నీఁదు రాయంచరీతిఁ
దానములఁ బాడు వల్లకీతంత్రిలీల
విశ్వమంతట నలమిన వెలుఁగుపోల్కి
లలితపరిమళ మలయానిలంబులాగు
తొలుకరిందోఁచు శాద్వలతలమువలెను
కడఁగి క్రొత్తగ మొదలిడ్డ కథకయివడి
మలయుమించులఁ దగుమేఘమాలభాతిఁ
బుట్టి, కనువిచ్చి, పురిటింటఁ బొలుపు దెలిపి
చిన్ని నెమ్మోవి నిగ్గులఁ జెంగలించి
ఱెక్క లల్లార్చి, ఊఁ, యని నిక్కినిక్కి,
తప్పటడుగులఁ దారి తాతా యటంచు
ముద్దుమాటలఁ బాటల మురువు సూపి
తరణమున రత్నదీపమై జవ్వనంబుఁ

గాంచి, కులమెల్లఁ దనలోనఁ గలుపుకొనుచు
జీవయాత్రకు నూతన సృష్టిఁ గూర్చి
సంతతులతోడ మెఱయుచు సంతతంబు
మూగి లోకానుభవము తన్మించుకొనఁగ
జగతి నలరారుచుండును జనుఁడుఁగూడఁ:—
గాని, యోచింపఁ బ్రకృతిసంకలనమునను
ఘ్మాత్రలంబునఁ దోఁచునైజంబు గలుగు
సకలమైన చరాచర సంతతికిని
భవము నాశంబుఁ గూడఁ దప్పనివె సుమ్ము!
మొగ్గవిడిపోవును, గులాబిపువ్వు వాడుఁ;
గాంచుచుండఁగనె ప్రభాతకాల మేఁగు;
నరుణబింబంబు పడమట నస్తమించు;
మురియువిహగంబు గిరగిరఁ దిరిగిపడును;
ఈఁదురాయంచ వ్రుతిదరి కేఁగిమూఁగు;
స్వరము లొలయించు తంతువు సాగి తునియు;
వెలుఁగ గగిరిపోవు; బరిమళానిలము నడఁగు
నెండచే లేఁతపచ్చిక యెండిపోవుఁ;
గ్రమముగాఁ దుదముట్టును కథయుఁగూడ;
మాయమగు నంతలో మేఘమాలికయును;
కూరుచుండఁడు మనుజుండుఁగూడఁ జచ్చు.

చావుపుట్టువు లవధులు జీవితమున
కట్టిజీవిత మొకస్వప్న మట్టిదగును ;
జనన మారసిచూడ నిచ్చటికి మొదలు,
చావుఁ దలపోసి తెలియ నచ్చటికి మొదలు ;
భూతపంచకమనియెడి పోగులెల్లఁ
దనవి పురివెట్టి కూర్చిన త్రాడువంటి
దగుజీవంబు; క్రమముగా నట్టి చాఁగి
బిగిసి బిర్రసాఁగి తాఁ దెగును తుదకు.
కానదృష్టంబు నష్టమున్ గణనఁజేసి
కాని యదృష్టంబునే దైవమనిరి బుధులు.

(19-1-1911.)

---

# 16 గురుభక్తి.

క. సూనఫలభరిత తరుయుత
కాననవల్లీమతల్లికావాసకిరా
తానీకనేతయై విన
యానతుఁడు హిరణ్యధన్వుఁ డనునతఁ డొప్పున్.

క. ఆయెఱుకురాజునకు సుగు
ణాయత్తుం డేకలవ్యుఁ డనునతఁడు సుతుం
డై యుద్భవించె ధర్మ మ
మేయస్థితి మూర్తిఁ దాల్చి మెలఁగువిధమునన్.

క. అనుగుణున కస్త్రకళా
వ్యాసంగమునందుఁ గోర్కి యగ్గల మగుటం
జేసి సమర్థుం డగుగురు
నాసించి చరించుచుండె నాయాయెడలన్.

క. ధనురాచార్యుఁడు ద్రోణుఁడు
ఘనమతి రాసుతుల కెల్లఁ గరిపురి నావి
ద్యను నేర్పుచుండె నంచును
విని యాతనికడకుఁ జేరి వినయానతుఁడై.

గీ. హేగురూత్తమ! నేనొక్క యెఱుకువాఁడ,
నస్త్రవిద్యార్థినై భవదంతికమున

కరుగుదెంచితి శిష్యుఁగా నరయుమయ్య!
కరుణ నావిద్య నాకును గఱపుమయ్య!

క. అనవిని ద్రోణాచార్యుం
డనుమానము నొందుచుండ నట రాకొమరుల్
గని శూద్రున కస్త్రాభ్యా
సనియతి యేమిటికి రాజసంతతితోడన్?

క. మరియాద గాదు రాజుల
కెఱుకు సహాధ్యాయి యగుట యెందును గలదే?
సరిసరి లే పదపద మని
పరిహాసము చేసి రంత బాణాసుదుండున్.

క. వారిమన మెఱిఁగి బోయకు
మారునకుం బ్రియము సెప్పి మఱియొక్కెడకుం
జేరుము నీకోరిక చే
కూరకపో దెచట నేని గుఱి గలదేనిన్.

క. అని యాగతి నాతని సాం
త్వనవచనంబులను దనిపి పదమన ననఘా!
పనివినియెద దయ గల్గుం
డని పదములకెఱఁగి యాతఁడరుగుచు మదిలోన్.

క. గుఱియున్న నెల్లవిద్యలు
కరగతమౌ ననుమాట దెల్పఁగాఁ బడెనుగదా!

గురువాక్య మింత యొప్పునె?
గుఱియను రెండక్షరములె గురుమంత్ర మగున్.

క. అని కృతనిశ్చయుఁడై యా
ధను రాచార్యు నెదలోనఁ దలపోయుచు నా
తనిరూపము మృత్తికతో
నొసరించి యనూనభక్తి యుతుఁడై కడఁకన్.

క. ఆవిగ్రహంబె గురువుగ
భావించుచు నస్త్రశాస్త్ర పద్ధతు లెల్లన్
వేవేగమ యభ్యాసము
గావించుచు నుండె నతఁడు గడు నిపుణుండై.

క. అమలధనుర్వేదము సాం
గముగా నేర్చికొనె నతఁడు కలితాభ్యాస
క్రమమున, గుఱి గన్గినచో
విమలమనస్సుల కందరాని విద్యలుగలవే?

ఆ. ద్రోణశిష్యులందు దొడ్డవాఁ డని పేరు
నొందియున్న పార్థుఁ డొక్కనాఁడు
విల్లునమ్ము లూని వేఁటాడ వేడ్క నీ
యెఱుకుసోలము చెంత కేఁగుదెంచి.

ఆ. ఏకలంబు తన్ను నెలయించుకొని రాఁగ
వచ్చివచ్చి యొక్క వాఁడితూపు

వింటఁబూన్చి కూల్చు వెఱపున సేయంగఁ
దప్పిపోయి పంది తాఱుటయును.

ఆ. తఱిమికొనుచుఁ బోవుతఱి నేకలవ్యుండు
దానిఁ గాంచి చేతి ధనువు నెత్తి
మొగమునాటి పుచ్ఛమునఁ దూఱిపోవంగ
నాఱుశరము లొక్క దారినేయ.

గీ. అట్టిశరలాఘవంబున కబ్బురమంది
యిట్టు లేసినధన్వి తా నెవ్వఁడొక్కొ?
యనుచు నెంచుచు నాదారి నల్లనల్ల
నరిగి యందొక్కధారుణిఁ దరముఁ జెంత.

క. ఘనశస్త్రాస్త్రంబులసా
ధనము సలుపు నేకలవ్యుఁదరిఁ జేరి నయం
బున నీ వెవ్వఁడ వని య
ర్జునుఁ డడుగ హిరణ్యధన్వసుతుఁ డిట్లనియెన్.

క. అనఘా! నేద్రోణాచా
ర్యునిశిష్యుఁడ నర్జునకుఁడ నోపికతోడన్
ధనురాచార్యునికనికర
మున ధనురాగమరహస్యముల నేరిచితిన్.

క. అన విని సముచితగతి నా
తని వీడ్కొని యర్జునుండు తనగృహమునకుం

జనువెంచి మది గలంగఁగ
ధనురాచార్యుకడ కేఁగి తనికిననగతోన్.

క. నీయట్టిధన్వి జగమున
నేయెడ లేకుండునట్టు లేఁ జేసెద నం
చోయనఘ! బాసఁ జేసితి,
వాయ మగుని తావకీనవచనం బెప్పుడున్.

క. నేఁటికి విలువిద్యం గడు
మేటిం గనుఁగొంటి నన్ను మించె నొకం డా
పాటిప్రవీణునిఁ జూడము
పోటుమగల మూఁడులోకముల నేయెడలన్.

గీ. అతఁ డెఱుఁగు భవచ్ఛిష్యుఁడఁట! మహాత్మ!
యనుచుఁ దాఁ గన్నయంతవట్టును దెలుపఁగ
ద్రోణుఁ డాశ్చర్యమగ్నుఁడై తొంటివృత్త
మెఱిఁగి పార్థునితో వని కేఁగె నంత.

గీ. ఏకలవ్యుండు గురున కనేకవిధులఁ
బ్రణతు లొనరించి పూజించి భక్తి మించి
హే గురూత్తమ! తావకాహీనకరుణ
వెలయుశిష్యుని నన్ను దీవింపుమయ్య!

క. ఏనును, నాకుఁ బ్రియంబగు
నీనిఖిలాస్త్రములు, ధనము లీవనసీమల్

జనుదెంచి మది గలంగఁగ
ధనురాచార్యకడ కేఁగి తనికినవగతోన్.

క. నీయట్టిధన్వి జగమున
నేయెడ లేకుండునట్లు లేఁ జేసెద నం
చోయనఘ! బాసఁ జేసితి,
వాయ మగునె తావకీనవచనం బెపుడున్.

క. నేఁటికి విలువిద్యం గడు
మేటిం గనుఁగొంటి నన్ను మించె నొకం డా
పాటిప్రవీణునిఁ జూడము
పోటుమగల మూఁడులోకముల నేయెడలన్.

గీ. అతఁ డెటుకు భవచ్ఛిష్యుఁ డఁట! మహాత్మ!
యనుచుఁ దాఁ గన్నయంతవట్టును దెలుపఁగ
ద్రోణుఁ డాశ్చర్యమగ్నుఁడై తొంటివృత్త
మెఱిఁగి పార్థునితో వని కేఁగ నంత.

గీ. ఏకలవ్యుండు గురున కనేకవిధులఁ
బ్రణతు లొనరించి పూజించి భక్తి మించి
హే గురూత్తమ! తావకాహీనకరుణ
వెలయుశిష్యుని నన్ను దీవింపు మయ్య!

క. ఏనును, నాకుఁ బ్రియంబగు
నీనిఖిలాస్త్రములు, ధనము లీవనసీమల్

# 17 చందమామ.

1

పిల్ల లవ్యక్తమధురోక్తిఁ దల్లిచెంతఁ
జందురునిఁ జందమామ యటందు రెపుడు
ముద్దులకు మాట నామాటఁ; బోల్చి మనము
చందమామయె యని పిల్చుచుంద మతని.
కవులు కదియేమి వెఱ్ఱియో కాని, చంద
మామ యనుముద్దుపదమును మాని దాని
కెన్నొ పర్యాయపదముల నిడుచునుందు
రేలొకో దానితోడ దీటైన పదము ?
పాలకడలికి ముద్దులపట్టి యనిన
సిరులనిచ్చెడు చెలువ సోదరుఁ డటన్నఁ
జేతఁ గువలయ మేలు రాజటన్నఁ
జందమామకుఁ బోటురా వందు మేము.
ఉగ్గుపాలను ద్రాగుచు నున్నయపుడె
తల్లిచే విన్న దగుట జాబిల్లిపదము
చందమామకు సరిపడు, నెందు నొకటె
మాకు జాబిల్లి యనఁ జందమామ యనిన.

# 17 చందమామ.

1

పిల్ల లవ్యక్తమధురోక్తిఁ దల్లిచెంతఁ
జందురునిఁ జందమామ యటందు రెప్పుడు
ముద్దులకు మాట నామాటఁ; బోల్చి మనము
చందమామయె యని పిల్చుచుంద మతని.
నేస్తుం కదియేమి వెఱ్ఱియో కాని, చంద
మామ యనుముద్దుపదమును మాని దాని
కెన్నొ పర్యాయపదముల నిడుచునుండు
రెందునే దానితోడ దీటైన పదము?
పాలవెలికి ముద్దులపట్టి యనిన
సిరులనిచ్చెడు చెలువ సోదరుఁ డటన్నఁ
దేవతచేఁ గువలయ మేలు రాజటన్నఁ
జందమామకుఁ దీటురా వందు మేము.
ఉగ్గుపాలను ద్రాగుచు నున్నయపుడె
తల్లిచే విన్న దగుటఁ జాబిల్లిపదము
చందమామకు సరిపడు, నెందు నొకటె
మామకు జాబిల్లియనఁ జందమామ యనిన.

లలితగతి మీఱుకోకిలాలాపములను,
గోరక చరించువార లున్నారె జగతి?
ఆరుబైట వెన్నెలకుప్ప లాడువారు,
కోకిలరుతంబులకు మాఱుకూయువారు,
కల్లపాదులఁ గల్పించి కాయఁజేసి
గుమ్మడులఁ జిక్కుడులఁ జాలఁ గోయువారు;
తత్తరంబున వెన్నెలవత్తి విసరి
తెచ్చియిచ్చిన వారల మెచ్చువారు;
చిట్టిమిరియంబులును, జిప్పచిప్పగోళ్లు
చెమ్మచెక్కలు నాడి హర్షించువారు;
నగుచు బాలిక లావేళ నగుచు నగుచు
నీపుజోడుగ నాటల నాడికొనిరి;
తార యీబాలికలతోడఁ జేరియుండె;
నీమె ముద్దులచెల్లె లై దేండ్ల లలిత
"అక్కనన్నెల గొనిపోవదయ్యొ" యనుచు
వీథిగుమ్మముదాఁక వెన్వెంటఁ దవిలి,
కనుమొఱంగినసోదరిఁ గానలేక,
వెనుదిరిగి, తల్లికడ కేఁగి వెక్కివెక్కి
యెన్ని చెప్పిన వినకుండ నేడ్చుచుండఁ
బోఁపువెట్టినబాలిక బుజ్జగించి

లీల యొక పైడిగిన్నెలోఁ బాలు వోసి
గుజ్జుబువ్వను గలిపి యా కూఁతునెత్తి
చంక నిడికొని వాకిటఁ జందమామఁ
జూపి "మాతల్లి! జాబిల్లిఁ జూచినావె!
అమ్మ బువ్వకుఁ బిలిచిన యంతలోనె
పరుగుపరుగునఁ జెంతకు నరుగుదెంచు!
తగవుఁ బెట్టక బంగారు తండ్రిలాగు
బొజ్జనిండఁగఁ దిని యాడఁబోవునమ్మ!
తల్లితో 'మారము' ను జేయఁ డెల్లవేళ
నల్లరులఁ జేయ కాటల నాడుచుండు,
మంకుపిల్లలఁ గూడఁడు; మంచివాఁడు;
బుద్ధిమంతుండు కొండపైఁ బోవుచుండు;
చల్లఁదన మిచ్చు; వెన్నెలఁ జాల నిచ్చు;
నేఁడు నాతల్లి! నినుఁ జూచినాఁ డితండు.
బువ్వఁ దినకున్న జాబిల్లి నవ్వు" నంచు
వెర వెఱిఁగి లీల లలితకన్విందుఁ జేసి
మఱియు వినవిందుగాఁ జందమామఁ బొగడి
కూఁతు మఱపించి పని చెప్పెఁ జేరె కంత.
లలిత మాటాడుసందడివలనఁ దగిలి
తానమాటను మఱచి తాఁ బోరు మఱచి

పైఁడిగిన్నియఁలో నున్న పాలబువ్వ
నించు కించుకగా నారగించుచుండె.

* * * *

## III

" అమ్మరో! గిన్నెలోనిది యయ్యె; నాదు
కడుపులో నున్ననల్లని కాకిపిల్ల
పొట్ట నిండంగఁ దిని పోయె బువ్వ యెల్ల;
బలుకుచున్నది చల్లఁగాఁ బాలుద్రావి.
నేల నొకచుక్కయైనను రాలకుండఁ
ద్రాగితిని పాలు బంగారుతల్లిలాగు;
తల్లి! జాబిల్లి యల్లరిపిల్లవాఁడు;
బువ్వ నేరీతిగా నొల్కఁబోసికొనెనొ?
వేగ నాబువ్వఁ దిని పొట్ట వేసినాను
చందమామపై; నోయమ్మ! ముందు నాదు
కడుపులోఁ గాకిపిల్లయే గంతువైచె;
కలదుగాఁబోలు నీతనికడుపులోనఁ
జిన్నిదగు కాకిపిల్ల; లేకున్న నతని
మొడలిలో నల్పు గాన్పించుచున్న దేమి?
అమ్మ! యీచిన్నిజాబిల్లి కమ్మ యెవరు?

ఈతనికి బువ్వపెట్టువారెవ్వ రమ్మ!
అక్క నాకుండె నీతని కక్క గలదె?
యితనితో నాడుకొనకుండ నెచటి కేఁగె?
పోరువెట్టఁడె కొండపైఁ బోవలేక!
భయమువేయదె క్రిందికిఁ బడునొ యేమొ?
రాత్రైనను నింటికి రాక బయలఁ
దెల్లవాఱినదాఁకను దిరుగు నేమొ?
ఎవరుపిల్చిన వారితో నేఁగి వారి
తోడఁ గూర్చుండి యెంగిలికూడు దినునె?"
అనుచు నవ్యక్తమధురోక్తు లాడుచుండ
జనని ప్రియమంది లలిత నక్కునఁ గదించి
చల్లఁగా నుత్తరంబు లొసంగుచుండ
నాడఁబోయినతారయు నరుగుదెంచె.
తారహృదయంబు మెత్తన; తార కెప్డుఁ
జందమామను జూచుట చాలఁ బ్రీతి;
పగలు జాబిల్లి రాక యేమగునొ కాని
తారయును మింటిపైఁ జూడ్కిఁ జేరనీదు.
ఎపుడు సూర్యుఁడు గ్రుంకునో, యెపుడు గోవు
లిండ్లకయి వచ్చుచుండునో, యెపుడు పక్షు
లెల్ల గూండ్లకుఁ జేరునో, యెపుడు మింట

నెట్టుగాఁ దోఁచుచుండునో, యెపుడు రేయి
యరుగుదెంచునో, తారయు నప్పు డపుడె
చందమామను జూచెడు సంభ్రమమున
నింగి నిరువంకలను దొంగితొంగి చూచు;
వెన్నెలబయళ్లలో నాటలన్న నామె
కెంతయో ప్రీతి గావున నెపుడు చంద
మామ రాకయె కోరు నెమ్మనమునందుఁ
గోరి తనయీడువారితోఁ జేరి తార
యాడుకొనుఁ జందమామ యున్నన్నినాళ్లు.
సంజచీకటిరాత్రులఁ జందమామ
రాకఁ గోరుచు నామె తదేకదృష్టిఁ
గాచికొని యున్న నిద్దుర కన్నుఁగప్పి
నందులకుఁ దార నెవ్వ రేమందు రపుడు?
పోరువెట్టెడిబిడ్డల నూఱడింపఁ
జిన్నపిల్లల కాటలఁ జెలిమి నింప,
యువజనంబుల కానంద ముద్ధరింప
మంచిమందుగదా చందమామవిందు.
అరసిచూడంగ నీడుజోడైన వగుచు
భువి మనోజ్ఞంబులైన వస్తువులు రెండె
వలపుఁజిలికెడు ప్రియురాలివదన మొకటి

పదిఁగరంచు పున్నమచందమామ యొకటి.
అల్లదిగో! కన్ను మలపి మీ రరయుఁ డిపుడు.
మినుకుమినుకను చుక్కల మెఱయుచుండు
రమ్యతరమైన నీలాంబరంబునందు
చల్లఁగాఁ గూరుచున్నాఁడు చందమామ.
పొడుపునెలనాఁ డొసంగిన పోగులెల్ల
నెత్తికొని వెండిపూఁతఁ బూయించె నేమొ
చందమామకు నునువెండిజాల రుండె
సఖు లరమోడ్చి కనుఁగొనుఁ డల్లయదిగో!
బాలికామణుల్ వెన్నెలవత్తు లనియుఁ
బ్రౌఢలగు సుందరులు నెలవంక లనియు
వనితలందఱుఁ జందురువంకలనియు
ననెద రవి చందమామఁ బుట్టినవికావె?
సరిగఁ బదియేనుదినములు చందమామ
క్రమముగా సంజకే వచ్చుఁ గాని, వెనుక
నొకట నాలస్యముగ వచ్చుచుండియుండి
యేము నిద్రించుదాఁక రాఁడేమొ తుదకు?
ఆఁడుబిడ్డ లొప్పులకుప్ప లాడువేళ
గల్లుగల్లను నద్దాల గాజులందు
నిలిచి కన్నుల మిఱుమిట్లు గొలుపుచుండు

చందమామకు నదియేమి సంబరంబొ ?
ఆటసందడిలో నున్నయట్టివేళ
చెట్లకొమ్మలసందులచెంతఁ జేరి
యూరినచిగుళ్లలో మంచునీరు వోసి
యెన్నియో ముత్తియములఁ గాపించుచుండు.
ఆటలో నోడిపోయిన యట్టివారిఁ
దెల్లఁబోయినవారంచు జెప్పఁబోవ
చిన్ని వెన్నెల నెల్లరఁ జిన్నబుచ్చి
తెల్లఁబోయినవారలఁ దెలియనీఁడు.
కొండపై నెన్నిచుక్కలో నిండియుండ
దినమునకు నొక్కచుక్కతోఁ దిరుగుఁగాని
"యాడుకొనరార ! జాబిల్లి !" యనుచుఁ బిల్ల
లెంత పిలిచిన దిగిరాఁడ దేమి భయమొ ?
సరిగ లేఁజిగురాకుల సందులందు
నెన్నియో వెండిపూలఁ జేయించుచుండఁ
గనుమలపి చూడ మింటికిఁ గంటి కొకటు
వెండితీఁగ లెన్నెన్నొ కల్పించుచుండు.
అంటఁగా ముట్టఁగా రానియట్టిచోట
నిలిచి దాఁగిలిమూఁతల నెఱపుఁగాని
యీడుజోడైనవారితో నాడుకొనఁగ

జతలుగూడఁ డిదేమొకో చందమామ!
ఒక్కమాటుగఁ దెరచాటునుండివచ్చు
భామవేషంబువలె మబ్బుప్రక్కనుండి
చటుకుమని వచ్చుచుండు నీచందమామ
యీతనికి నింతయొయ్యార మెందుకొఱకొ?
చందమామ యదేమొ కాసారవారి
పూరములలోన మాటికిఁ దూరుచుండు?
మఱచితిమి కవితావేశపరవశతను
గలదుగా యట వలపించు కలువకన్నె!
తుమ్మెదలఁ గాంచి గీతమాధుర్య మెంచు
మల్లెపూవులఁ గలపరిమళముఁ గాంచు
వాయునందనుతోఁ జేయిచేయి గలపు
సరససుకుమారబలుఁడు మాచందమామ!
నిండుగా నొక్కనాఁడు గాన్పించినంత
నెవరిదృష్టులు తాఁకునో యేమొకాని
నాఁడునాఁటికిఁ గృశియించి పోఁడి దక్కి
తిరిగి నెలనాళ్లదాఁకను దేఱుకొనఁడు.
ఎలమి నంతఃపురంబుల కెగయఁ బ్రాకి
ముంగిటి గవాక్షములఁ దొంగితొంగి చూచుఁ
దేఱి చూచిన మిన్నెక్కి కూరుచుండుఁ

దుందుడుకుబాలకుఁడు గాఁడె చందమామ?
లతిశసితకిరణముల జాలంబు లల్లుఁ
దోయనిధిపేచికలలోనఁ దూఁగియాడు
మబ్బుటోడలపై నెక్కి మాయ మగును
జాలరుల చెల్మిఁ గనె నేమొ చందమామ!
చందమామను గను టెంతసంబరంబొ!
సలిలకలశంబు చెప్పఁగాఁ జాలకున్నఁ
బొడఁగనినమాత్ర నుప్పొంగి పోవుచున్న
కలశవారాశిఁ గనియైనఁ దెలిసికొనుఁడు.
తెల్లనగుకాగితముమీఁదఁ దిరిగితిరిగి
కలము గంతులువేయంగఁ గలదుగాని
నల్లనగునింగి నల్లన నడచుచున్న
చందమామను వ్రాసి మెప్పొందఁగలదె?

(18-2-1911.)

# 18 వసంతకో...

క. లలితకుహూకలరవమా !
యల వనరమయింటి విందవగుకనివరమా !
యలరువసంతునిరాకం
దలఁచించెడు నీకు స్వాగతము కోకిలమా !

క. నీరాక కలరి పికమా !
యారామశ్రీ మనోహరామలగాన
ప్రారంభచ్ఛలమునఁ జవు
లూరన్ స్వాగతముఁ దెల్పుచున్నది కంటే.

క. ముందే నీక్రీడావన
మందిరమునఁ బ్రికృతికాంత మహనీయతరా
నందమునఁ దలిరుద్వోరణ
లందముగాఁ గట్టుచున్న యది కోకిలమా !

క. వినరెదవు నీవు కోకిల !
కొనగలముత్యాలసరులొ కుసుమసరములొ
రసవన్మృదుగానసుధా
రసకలితకుహూకుహూస్వరంబులొ చెప్పుమా !

క. ఎందాఁక మాధవీలత
సుందరసుమమంజరీపరిశోభిత మగునో

యందాఁక మేము వీనుల
విందుగ నీగానరవము వినఁగలముగదా!

క. బాలుఁడు నవవికసితసుమ
జాలంబులఁ గోయుచున్ వసంతారామా
ఖేలనమున నీగానము
నాలించి కుహూస్వరంబు నాలాపించున్.

క. బాలకుఁడేకాదు దివ్యక
లాలాపనమైనఁ, దత్కరాంచద్వీణా
లోలత్తంతువులైనను,
నీలాగునఁ బలుకనేర్చు నే కోకిలమా!

క. నీకును నావికునకుఁబలె
నే కలదా చుక్క మార్గ మెఱుఁగించుటకున్?
లేకున్నఁ దిరిగిపోయెడు
నీకాలము నెట్లు తెలియ నేర్తువు చెపుమా!

క. ఓమోహనగాయకమణి!
నీమందిర మెప్పుడుఁ బచ్చనిదియే మఱియున్
నీమార్గము ద్యోమార్గము
నీమసలినయంతవఱకు నిర్మలమెకదా.

క. కానంగఁబోము నీకా
లానన్ శీతాతపంబు లంగల బాధల్

లేనేలేదు సుమీ నీ
గానమున విచారసూచకస్వర మైనన్.

క. చిగురువలన నీ గానము
నెగడెనొ? లేకున్నఁ జిగురె నీ గానమునన్
నెగడెనొ? నీగానంబును
జిగురు నొకట నెగడెనో? వచింపుము పికమా!

క. చివురాకుఁ దినుము! పాడుము!
చివురులు వెట్టింపు; మరలఁ జేయుమువనమున్;
నవనవగీతాచాతురి
మివుల మరల మరలఁ జూపుమీ! కోకిలమా!

క. అయ్యో! నాకును ఱెక్కల
నియ్యఁడు భగవంతుఁ; డిచ్చె నేనియు నీతో
నియ్యాకసమున నెగురుచు
సయ్యాటంబులను బ్రొద్దు జరపుదునుగదా!

క. ముచ్చటగ నెగిరికొనుచును
నెచ్చటికేనియును బోయి యిర్వురమును రా
వచ్చుఁగదా! విందులమై
యిచ్చటికి వసంతుఁగూడి యిల్లేఁ జేటన్.

(20-4-1911.)

---

# 19 ప్రభాతవాతము.

చ. మము( బరమార్థమైన యొక
మాట వచింప(గనిందు నిత్యస
త్యమునకు( జేరువైనదియొ?
స్వానుభవంబున కూ(తమైనదో?
క్రమముగ మీకె తో(చెడు(; బ
రాకునన్నైన( బ్రభాతవాతపో
తము నెద నమ్మరా దనెడి
తత్త్వమె బోధయొనర్తు మియ్యెడన్.

చ. మనమున( బక్షపాతమును
మాని వచింపు(డు మీరె; యేకతం
బున యువదంపతుల్ నిదుర
వోవుచునుండ(గ( దట్టి లేప(గా
దనకు( బనేమి? యిట్లు గల
దా? యిది సిగ్గులచేటుగాదె? యే
మన(దగు నీప్రభాతసమ
యాగతధూర్తసమీరడింభకున్!

సీ. జలతరంగముల నుయ్యెలలూ(గి నట్లుండి
తలిరువేచి చలువల( దస్కరించు

నరవిరిమొగ్గల నలరించి నట్లుండి
యదనెంచి రజమెల్ల నపహరించు
లతకూనచెంత మెల్లఁగ నున్నయట్లుండి
సమయంబుఁ గని చుట్టు సడలఁ జేయు
ననగొమ్మ నిట్టె యూఁచినయట్టులే యుండి
కొంటెయై వలపులఁ గొల్లవెట్టు
చలువతెక్కలికాఁడు, రజంపుదొంగ,
పైఁడిపచ్చిఁడు; తావులబందెకాఁడు,
ప్రాతరనిలార్భకుఁడు తడిపాఁత గొంతు
కోఁతగాఁ డాతనిని నమ్మఁగూడ దెపుడు.

(17-5-1911.)

# 20 నిన్న, నేఁడు, రేపు.

సంతసంబొ, విచారమో, సంభవించు
సుఖమొ, కష్టంబొ మఱినీవు చూడలేని
దాని, నీజన్మమున నిఁక రానిదాని
నీవు గాంచితివెప్పుడు? నిన్న! నిన్న!
నీవు పోయెడుత్రోవలో నీయదృష్ట
దేవతయభీష్టఫలము లందించుచుండ
నాఁగి వేవేగముగ వాని నందికొనఁగ
నెపుడు కోరెద వీవు? నేఁడేకదయ్య!
కాని, యాదేవి విముఖయై కానిపించి
ముందు రాఁబోవు నీకష్టములను దెలుప
నట్టికష్టంబు లెల్ల నీ వనుభవింప
వలసినప్పుడు రేపు గావలయు నీకు.
పుణ్యమో పాపమో నీవు పూనుకొన్న
దొక్క కార్యంబు నెఱవేర్చుచున్నయపుడు
మంచిచెడ్డలఁగూర్చి యోజించు టెపుడు?
తెలివిగలదేని నిన్నటి దినమునందె.
అపకృతియొనర్చి నీకుఁ దా నవల నెఱిఁగి
సిగ్గుపడుచుఁ బశ్చాత్తప్త చిత్తవృత్తి

నీనుండై వేఁడుకొనుచున్న వానితప్పు
నీవు క్షమియింపఁదగినది నేఁడె నేఁడె!
గురుతరక్రోధవశమున నొరునిఁ గీడు
పఱిచి నీతప్పు నీవుగా నెఱిఁగినపుడు
వానిక్షమియింపఁ గోరఁగావలసెనేని
నీకు సమయంబు తేపటిదాఁక లేదు.
ఒరులకడ దాఁచికొన్నదో యొరులవలన
రావలసియున్న యట్టిదో కావలసిన
నవసరంబైనయపుడు నీ కందఁ బోదు
తెచ్చికొనఁదగు నిన్నటిదినమునందె.
తీరుపుంగాంచి ధనము తేతెమ్మటంచు
నప్పులిచ్చినయతఁడు ని న్నడ్డగించి
తీవరంబును జూపి వేధించెనేని
నిలువఁబడి తీర్పఁదగు నీవు నేఁటిదినమె.
సాక్షి లేకయొ, కాలదోషంబు గనియొ
యన్యుకడ నీవు తెచ్చికొన్నట్టి ఋణము
పరికృతశాసనమునఁ గొట్టువడినయైన
మానదది; తీర్పవలయు తే పైనఁగాని

నేఁడు రేపటికింజూడ నిన్నయగును
రేపు నేఁడగుచుండును రేపటికిని
నిన్న, నేఁడు, రేపనుకాల మెన్నివేల
యేండ్లనుండియొ యొకరీతి నేఁగుచుండె.

(27-5-1911.)

---

## 21 ప్రణయకోపము.

(రాధాకృష్ణులు.)

కవులకు స్వభావవర్ణన కష్టతరము
ప్రకృతిచిత్రంబు గ్రహియింపఁ బాఠకులకు
నంతకంటెను గష్టమౌ నైన నుస్వ
భావమాధురికిని లేదు పరిమితి భువి.

జలదమాలిక నింగిపై నలరుచుండ
మెఱుఁగుఁదీవలు మిలమిల మెఱయుచుండఁ
బాటపాటగఁ జినుకులు పడుచునుండఁ
దఱచుగాక తుషారంబు గురియుచుండ
జివ్వుజివ్వున వలిగాలి యువ్వుచుండ
రేఁగి యొక్కొక్క జడి గొట్టి యాఁగుచుండఁ
గారుమబ్బులఁ జీఁకటి గ్రమ్ముచుండ
నోరపిడిం గాంచి మేఘంబు లుఱుముచుండ
జోరు మని వానకాళులు జాఱుచుండ
స్వాంత మలరించు వర్షావసరముఁ జూచి
మెడలు త్రిక్కించి కూయునెమిళ్లఁ జూచి
యెలమి దివి నాడువానకోయిలలఁ జూచి.
తొరట వాయనిశుకదంపతులను జూచి
మేలుకట్టులనీలాల మేడఁ జూచి
భవనమున హంసతూలతల్పంబుఁ జూచి
ఆసపడి వచ్చుప్రాణనాయకునిఁ జూచి.
ప్రణయకోపంబు దాల్ప నెవ్వరితరంబు
గొల్లచేడియ రాధకుఁ జెల్లెఁగాక !

* * * *

నవనవామోదబృందా వనంబులోన

లలితమాధవీ మల్లికా లతలలోన.
రమ్యతరమైన భర్మహర్మ్యంబులోన
ఘనమణీమయదీపికా కాంతిలోన
బాలగోపాలుఁ డెదుటఁ గన్పట్టకున్న
కానఁబడి తన్ను దయతోడఁ గాంచకున్నఁ
గాంచి తనమాటలో మాట గలపకున్నఁ
గలపి హర్షించి చనవుమై మెలఁగకున్న
మనసుచిడిముడిపాటుతో మసలురాధ
పదము లదరంగ నెల్లెడ వెదకురాధ
క్షణ మొకమహాయుగంబుగాఁ గడపురాధ
తనదుజీవమ్ము వమ్మని తలఁచురాధ
అతిమృదులచిత్త యగురాధ—అట్టిరాధ
మదనజనకుండు తనయెట్ట యెదుట నుండఁ
బ్రేమనిండారి మది తత్తరించుచుండ
నోరు మాటాడ నువ్విళు లూరుచుండ
నోరచూపులు చల్లఁగా జాఱుచుండ
నెట్టినిర్బంధ మయ్యెనో యేమొకాని
ఎట్టికఠినత్వ మూనెనో యేమొకాని
యెట్టిగొడవలు పుట్టెనో యేమొకాని
యేమి యూహించెనో చెప్పలేము గాని

వడఁకుచుండెడు మృదుగాత్రి వల్లితోడఁ
గలఁగి వెలవెల్లనగునెమ్మొగంబుతోడ
రక్తకాంతులఁ జిమ్ము నేత్రములతోడ
నశ్రుసంసిక్త గండద్వయంబుతోడ
నోష్ఠరాగంబుఁ దొలఁచునిట్టూర్పుతోడఁ
బ్రకటితంబగు బొమముడి పాటుతోడఁ
దల్లడిల్లుచునుండు చిత్తంబుతోడ
విభుని కవ్వలిమొగమయి వెలఁది నిలిచె
నెట్లు నిలువంగఁగలిగెనో యెవరికెఱుక ?

* * * *

అంబుదశ్యామ కోమలాంగంబువాని
తరళతరపద్మపత్రనేత్రములవాని
చారుచమకితబర్హిపింఛంబువాని
వలపు లొలయించు చిఱునవ్వు గులుకువాని
కలికి చూపుల రాగంబుఁ జిలుకువాని
పలుకుపలుకున నమృతంబు లొలుకువాని
ప్రేమగలవాని, నందుని పిల్లవాని
గాంచి యూరక మోడి వహించుటకును
గారణం బేదొ రాధకుఁ గలుగవలయు;
రాధికాకృష్ణులదృఢాను రాగగరిమ

మెఱిఁగియున్న వారల కిది యెంత వింత!
గోపికానాయకుం డెంత కొంటెవాఁడొ
యంతకంతెను ఖండిత యగును రాధ
యెంతకైనను మగవాఁడు కృష్ణమూర్తి
తనదునధికార మటుఁ జూపఁ దగదు రాధ
మృదులతరపుష్పసుకుమార హృదయ రాధ
నిట్టు లలయింపఁదగదు శ్రీకృష్ణునకును,
నొక్కమూలను ప్రణయంబు నొక్కమూలఁ
గోపభావంబు, రెండును గూడిమాడి
యుత్తరోత్తర మభివృద్ధి నొందుచుండ
నొండొరులచిత్తములు మార్పు నొందుచుండె-
పలుకు మని యనుచున్నదో ప్రణయమహిమ
కూడదని చెప్పుచున్నదో కోపమహిమ,
పలుకఁగడఁగుదు రిరువురుఁ బలుకలేరు!
వలపుఁజూపు లొండొంటితోఁ గలయఁజూచుఁ
గాని యంతలోఁ జటుకున గాఁడివాఱు
ప్రణయమహిమంబునకు వెనుఁబాటుఁ గూర్చి
మేరమీఱినకోపంబు దారిఁ జూప
సౌమ్యసంకల్పముల మేలిచాయ లెల్ల
నంతలోననె మాయంబు లగుచునుండె

నిరత మీకోప మిట్టులే నిలుచు నేమొ
ప్రణయమహిమంబునకుఁ బట్టు వదలు నేమొ
ఒఱలు చొండొరు లిట్టులే యుందు రేమొ
దర్పకునకును వాఁడిమి తగ్గు నేమొ
యకట! యంతటిదాంపత్య మంత మైత్రి
యంతచన వంతకూరిమి యంతగరువ
మంతదయ యంతమర్యాద యంతమోహ
మంతయనురాగ మెచ్చట నైనఁ గలవె?
కుటిలమైన తాత్కాలికక్రోధవహ్ని
బారిఁ బడి పోవఁదగినదా ప్రణయమహిమ!—
ఎంతదూరంబు పోయితి! యిది నిజంబె?
ప్రణయకోపంబునకుఁ జింతపడఁగ నేల?
కొఱవిదయ్యంబువలె భయపఱచుఁ గాని
ప్రణయకోపంబునకును రూపంబె లేదు.
కానియతిలోకమైనది దానితెఱఁగు
దానికుటిలప్రకృతి యసాధారణంబు
దానివేషంబు మాయావితానకంబు
దానివృత్తం బనాలోచితంబు గాదె!
కాకయుండిన ననురాగ కలితులైన
రాధికాకృష్ణులను నొక్కసౌధమందె

నిలిపి వైముఖ్యమును గూర్చి నిలువఁగలదె?—
ఆసపడి లేనిపోనియూాయూాసములను
తీరి కూర్చుండి యెవ్వఁడు తెచ్చికొనును?
పాలయలుకగూడఁ బ్రియముగాఁదలఁచుచుండు
కాముకులకు వివేకంబు గలదో లేదో—
చేరి యొండొరుఁ జూచుకొన్నారో లేదో
కేరుసెమ్ములసేక విన్నారో లేదో
నాల్గునిమిషంబులైన నున్నారో లేదో
పట్టువిడినచిత్తంబుఁ బట్టలేక
యిర్వు రిరువంకలకుఁ బోయి రింతలోనె
ప్రియము గల్గియు నిర్వురుఁ బిలిచికొనినఁ
గోర్కెఁ గల్గియు నొండొరుఁ గూడికొనిన
మనసుపడియుఁ బరస్పరం బెనసికొనినఁ
గోపగౌరవమున కేమి లోప మగును?
అలుక ముక్కున నున్న నేమాయె దాన?
మేను లీరీతి దాఁచుకొన్నైన దేమి?
పాదుకొనియున్న ప్రేమానుబంధమునకు
నట్టి వేమియు నంతరాయములు గావు.
ఎదురుకొనుకొలందిని ప్రేమ హెచ్చుచుండు
నెడసి చనుకొలందిని ప్రేమ హెచ్చుచుండు

ననుచుఁ జిరకాలపరిచితు లైనయట్టి
పరిణయకోపతత్త్వజ్ఞులు పలికినారు.

*    *    *    *

రాధికాకృష్ణమధ్యవర్తనముఁ గాంచి
వారిప్రతిబింబముల నేకభావలీల
లోఁగొనెడుమణికుడ్యమా! లోకమందు
నీవు ధన్యమవే యిష్టి నిశ్చయముగఁ
గాని యన్యాపదేశంబు గాఁగ వార
లాడుకొనుమాట లాలించు నట్టిభాగ్య
మెక్కడిది నీకు? వానిమే మెఱుఁగఁగలము.
రాధికాకృష్ణు లిటఁ గనరారుగాని
వారు మేమింత యెఱుఁగనివారు గారు
వార లెవ్వరికిని వింతవారు గారు
వారిసంభాషణంబుల వేఱువేఱ
పలుకుసవ్వడిఁ బోలిక పట్టఁగలము.
కానఁబడకుండ మాటాడుకారణమునఁ
బ్రకృతిభేదంబు లేర్పరింపంగలేక
పాఠకోత్తములార! దిగ్భ్రమము నొందఁ
బోకుఁడీ భావగతిఁబట్టి పోవవచ్చు
కొంచెమైనఁ బరాకుగాఁ గొనఁగఁబోక

వినుఁడు చెవియొగ్గి కౌతుక మెనయ నదిగో!
పలుకుచున్నది రాధ యాభావ మేమొ;
"అళివరా! నీవు చాల ధన్యాత్ముఁడవు
మందభాగ్యను నావంక మరలె దేల
వలపుఁగొలిపెడునీపుష్పవాటిలోని
కరిగి విహరింప నిన్నెవ్వ రాగఁగలరు?"
అనుచు రాధిక వర్ణోక్తు లాడుచుండ,
"ఒక్క తరుకోటరవంబున నున్నవార
లొట్టు వెట్టిన ముట్టుకోకుండు టెట్లు?
కసరి పలికిన బెదరక మసలు టెట్లు?
లొట్టుఁ దీసి గట్టునఁ బెట్టు మోసిచిలుక!"
అని వినంబడఁ జమకిత యగుచు రాధ
మనసు జల్లనఁ బొలయల్క ననుసరించి
తెగువ యుదయింప వెనుకకుఁ దిరుగఁబోయి
యడుగు తడఁబడఁ జిడిముడిపడుచు నొడలు
గడగడ వడంకఁ బీరంబు సడలిపోవ
నడలి బుడిబుడిఁ గన్నీరు వొడమఁ బ్రియుని
గలిసికొనలేక మఱియట నిలువలేక
సంభ్రమంబున నిటునటు జరగుచుండ
మదనగోపాలుఁడుముగూడ మదిఁగలంగి

క్షణమె యొక్కొక్క యేఁడాదిగాఁగ హృదయ
తాప మగ్గలమైన నిల్పోపలేక
రాధికాహృదయాంతర క్రోధవహ్ని
నార్పఁజాలు నుపాయంబు నరయలేక
చిత్తమం దేమొకాని యోజించుచుండ,
నంతలో స్యందనాశ్వహేషాస్వనంబు,
వచ్చె నక్రూరుఁ డను జనవాచకంబు,
"శౌరియెక్కడ ?" ననెడి ప్రశ్నారవంబు
నొక్కమాఱుగ నుదయింప నుదరిపడుచుఁ
దత్తరంబునఁ దేలి సౌధంబు వెడలి
ముద్దు కృష్ణుండు సోపానములనుఁ బట్టి
త్వరగఁ బోవుచునుండ సంభ్రమము నొంది
చిరవియోగంబునట్టి సూచించుచున్న
కృష్ణమధురాప్రయాణంబు స్మృతికి రాఁగఁ
గళవళంబున వెన్నాడి కలిసికొనఁగ
వడివడిగ రాధ మెట్టులో వచ్చెఁ గాని
యప్పుడే కృష్ణుఁ డక్రూరు నరద మెక్కె

* * * *

పాప మారాధ కుత్సాహభంగమయ్యె
నామెహృదయ భావములెల్ల నంతరించె

డిల్లపాటునగుండె గుభిల్లుమనియెఁ
గ్రిందికిఁకను జనుబుద్ధి మందమయ్యెఁ
బైకిఁబోవుట కెంతయో భారమయ్యె
నిముసమున కెన్నొమెట్లులం దిగినరాధ
యొక్కలేకుండ గడియకే నొక్క మెట్టు;
అనురుపరువుప్పెఁ, జిత్తంబు వసముదప్పె
నసిచెడియె మేను, చూపులపస యడంగె
నబల రాధిక యేమి చేయఁగఁ గలదు ?
అకట ! దడదడలాడు దేహంబుతోడఁ
దడఁబడుచునుండు మృదులపాదములతోడ
నమలమణిమయకుడ్యంబు నానికొనుచు
నల్లనల్లన సౌధంబు నధిగమించి
గహనమందలిపర్వతగుహారమట్లు
లతిభయంకరమైనగేహంబుఁజొచ్చి
ఝల్లుఝల్లున గుండెలు తల్లడిల్ల
మృదులపర్యంకమున నెట్లొ మేను వాల్చి
దిగులుఁ జెందుచుఁ జేసేతఁ దెచ్చికొనిన
యెడ రనుభవింపకే తీరుటెట్లు లనుచు
నొరుని వెఱపింపఁబోయి తా వెఱచినట్లు
లక్కటా ! నేఁడు నాబ్రదు కాయె ననుచుఁ

క్రమ్మఱంగ శౌరిఁ గన్నులఁ గాంతునేని
తప్పులకుఁ బాదములఁ బట్టుదాన ననుచు
వేణుగానలోలుం డెంత విరసుఁడైన
సరస నుండుటయే నాకుఁ జాలు ననుచుఁ
బ్రియుఁడు దయతోడ నను బల్కరించినపుడు
చిన్నిమాటాడు మని వేఁడు కొన్నయపుడు
నేరము క్షమింపు మని దరిఁ జేరినపుడు
మోడి వహియించి నేనేల చూడనైతి ?
పాడి దొరఁగి నేనేల మాటాడనైతి ?
పాడుకోపంబు నేనేల వీడనైతి ?
ప్రియునికడ నేల నే నొట్టు పెట్టుకొంటి ?
అతనిదర్శన మిఁక నెటులబ్బు నాకు ?
ననుచు నేమేమి మదినెంచుకొనెనో ? రాధ
తరళనయనంబు లశ్రులు గురియుచుండె ;
పరులహృదయంబు నెఱుఁగ నెవ్వరితరంబు ?
కానియూహింప నెన్నొ మార్గములు గలవు ;
అద్ద మున్నది మొగమున్న దడుగనేల ?
చెప్పనేఁటికి మీరె యోజించుకొనుఁడు!
సమయముంబట్టి తత్కథాసరణిఁబట్టి.

* * * *

చెలువ నిశ్చేష్టయై కొంతసే పటుండి
చారుచేలాంచలమునఁ గన్నీరు దుడిచి
లేచి కూర్చుండి యొకపత్రలేఖనంబు
హస్తవద్మంబు గంపింప నట్టె వ్రాసి
మొదలినుండియుఁ దుదిదాఁకఁ జదివి చదివి
నిలిపినను నిల్వకుండఁ గన్నీటిధార
వరదలై పాఱ మఱి చదువంగలేక
యట నిలువలేక సదుపాయ మరయలేక
రమణునకు లేఖనంప ధైర్యంబులేక
యతితరంబగు దుఃఖంబు నాఁపలేక
హస్తమందున్న పత్రిక నట్టె విడిచి
యేమి తలపోసికొన్నదో యేమొ కాని
నడలు తడఁబడుచుండ నెన్నడుము వడఁక
సౌధమును డిగ్గి బిరబిరఁ జనియె రాధ;

*   *   *   *

అవల నేమయ్యె ననుచు మ మ్మడుగవలదు
ప్రణయకోపంబుఁ గూర్చిన మనకథాంశ
మింతియే కాన తెలిపితి మింతవఱకె.
కొదవ గలదేని యూహించుకొనుఁడు మీరె;
ఐన నిప్డు రాధాకృష్ణులందుఁ గలుగు

ప్రణయకోపాన కేమికారణము గలదొ
మన మెఱుఁగమైతి; మేకాంతమునఁ జరించు
దంపతుల వృత్తి మెవ్వరు తెలుపఁగలరు?
రాధికాకృష్ణు లిందుఁ బరస్పరంబుఁ
గలిసికొనకుండ మనకథ గడఁచెఁ గాని
వార లెటులైనఁ గలియకపోరు తుదకు.
ప్రణయకోపంబు వైరకారణము గాదు
ప్రియులహృదయంబు పాషాణమయము గాదు
కాని, యీకథ యెల్లను గట్టిపెట్టి
రాధికాసాధుభావవిరాజమాన
మోహలేఖార్థము గ్రహింప ముచ్చటైన
నిదిగొ! యీపత్రికఁ నున్నది చదివికొనుఁడు.

(9-8-1911.)

"మఱచిపోవకు

# నన్ను మఱచిపోవకుము.

(మంజరి.)

నామనోనాయక ! నామోహఫలము !
క్రొత్తనెచ్చెలులును క్రొత్తయాశలును
క్రొత్తసంతోషముల్ కోరికఁ బొంద
నరుగుదే దూరదేశాంతరములకు,
అయినను సౌందర్య మందును మిగుల
గర్వించియున్నట్టి కాంతలనడుమ
నల్లన విహరించు నప్పుడుఁగూడ
నెవ్వతె నొంటిగా నీవిందు విడిచి
యరిగితివో దాని నపుడప్పుడైనఁ
దలఁచుట గొఱఁతగాఁ దలఁపఁగఁబోకు,
నవయౌవనాకార ! నామోహనాంగ !
నీదగుప్రేమను నీదుభాగ్యమును
బొంది సుఖించెడి పుణ్య మేమియును
నిఁక నాకుఁ గల్గఁబో దీజన్మమందు ;
నైనను నీదీనురాలి ప్రార్థనము,
నైననుంచి యొకవర మీయంగవలయు

" మఱచిపోవకు నన్ను మఱచిపోవకుము "
ఈదీనదురదృష్ట మించుకంతైనఁ
దలఁచినమాత్రఁ జిత్తంబున నీకు
భరియింపరానితాపము కల్గెనేని
నేను గోరినయట్టి యీప్రార్థనంబు
నుల్లంబులోపల నుంపఁగాఁబోకు,
ననుఁగూర్చియైన నెన్నండునుగాని
చిత్తనుం దింతయోజింపఁగాఁబోకు ;
అటు సేయుదువుగాని యక్కట ! నీకు
ఘనవిచారంబులు కల్గినయపుడు
నేవైన లోపంబు లెనసినయపుడు
దురదృష్టవశమునఁ దొంటియారోగ్య
వశచెడి ధైర్యంబు దప్పినయపుడు
చిత్తశాంతి నొసంగు చెలియసాయంబు
వలసినయపుడు నాప్రాణసఖుండ !
" మఱచిపోవకు నన్ను మఱచిపోవకుము."

రాధ "

(12-8_1911.)

# 22 మక్షికము.

క. నీ వెపు డేదో పనికే
పోవుదు విపు డేమొ దాహముం గొని నాతోఁ
ద్రావఁగ వేఁడుకపడు చు
న్నావో? మక్షికమ! రమ్ము నాచెంగటికిన్.

క. త్రాగుము నాతో; నే నెటు
త్రాగితి నటు త్రాగుమీ! స్వతంత్రతతోడన్
నాగిన్నె దరికి రమ్మా!
యీగవ్యము చప్పరింపుమీ! మెలమెల్లన్.

క. నీమనసు వచ్చినట్లుగ
నీమనుగడ సార్థకముగ నెఱపఁగ వలదే!
యే మున్నది జీవితపరి
ణామము క్షణకాలికము క్షణక్షీణమొకా!

క. అరయఁగ నీ జీవితమును
మఱి నాజీవితము నొక్కమాదిరిగానే
పరుగిడుచు నున్నయవి స
త్వరముగఁ దమయంత్యదశలఁబడయుటకొఱకున్.

(13-8-1911.)

# 23 భాగ్యము.

ఎట్టులుండునో నాభాగ్య మెల్లి యనుచుఁ
గాంచ నెంచుట నాపని కాదుకాదు
నేను నను దాఁటిపోలేదు నేఁ డటంచు
నవగతం బగుచుండె నా కదియె చాలు.
మృత్యు వొకవేళ నడ్డమరేయినాదు
నెత్తురు హరించి శ్వాసల నిలుపనిమ్ము
నేను నాలోని మేలి నిధానమునకు
నేకరణినైనఁ గర్తను గాకపోను.
కనఁబడకపోవు భాగ్యమా! కరఁగిపోవు
కనకమా! యూరకేపోవు ఘనబిరుదము!
మెఱసిపోయెడు రత్నమా మీకునెల్ల
తెక్క లున్నవటంచు నెఱింగి యుంటి.
నెగిరిపోయెడు పక్షంబు లెఱుఁగఁబడియె
నట్టి తెక్కాఁర్చుచును మాయ మౌచురిట్టి
నిట్టివస్తులఁ గాంచుచు నెప్పటికిని
గూడ నాపని భావించువాఁడఁగాను.
ఈప్రపంచకమే వాని నిచ్చెఁగాన

వాని నెల్లను దానెపుడైన సరియె
వెండి గైకొననిమ్ము పోవిడువనిమ్ము
కాని నాపెన్నిధిని జేరనైనఁ గలదె?
నేను నాయాత్మఁ జూడఁగా నేర్చినపుడు
నన్ను నేఁ బూర్ణముగఁ గనుఁగొన్నయపుడు
నేను నాలోన నానంద మూనునపుడు
నేనెనా రాజ్యమై యుండు నిశ్చయముగ.

(20-8-1911.)

---

## 22 ఆత్మసఖుఁడు.

ఎపుడు నీవెంటఁ దిరుగుచూరెందఱున్న
వార లందఱు మిత్రులుగారు నీకు
హాస్యపరిహాసములు, ప్రియ భాషణములు
పొగడికలు గాలితోఁ గూడఁ బోవుచుండు.
ఆటపాటలకును గోటు నీటులకును

వింతలకు పీడియములకు విందులకును
నెన్నినా ళ్ళీవు ధనము వ్యయింపఁగలవో
యన్నినాళ్లును వారు నీకాప్తసఖులె.
ఈవిలోనైన విందుల నిడుటనైన
కొదవయించుక నీయెడ నొదవెనేని
దినదినము నిన్నుఁ గనవచ్చు ఘను లదేమొ
యేఁటికైనను దర్శన మీయలేరు.
భయమొ, బాంధవ్యమో, మత పరిచయంబొ
కారణంబుగఁ గలిగిన కలయికలకు
సమయముంబట్టి మార్పులు జరుగుచుండుఁ
గాని మిత్రిత్వమట్టిది కాదుకాదు
సహజధర్మంబుచే నన్న చనవుఁజూపు
సత్కులాచారమున భార్య సరస మొలఁగు
వృత్తిధర్మంబున భటుండు వేఁడి కొలుచు
నంతమాత్రిన మిత్రత్వ మనఁగరాదు.
అనిశ మానందదాయక మైనయట్టి
నీదుభాగ్యంబుతోఁగూడ నీప్రియులును
బూర్వపరిచితులుంగూడఁ బోవుచుండ్రి
ప్రొద్దుతోఁగూడ దీప్తులు పోవుకరణి.
కలిమిలేములయం దొక్కగతిఁ జరించి

కష్టసుఖములలోన భాగంబుఁ గొనుచు
కష్టమైనను హితముసు గఱపుచుండు
వాఁడెచుమ్ము నిజమ్ము నీ ప్రాణసఖుఁడు.
ఆత్మబంధులు వాసి యిల్లాలు రోసి
పొరుగువారలు తలుపులు మూసినపుడు
దివ్వెతోఁగూడ నున్నట్టి తేజుఁవోలె
నెవఁడు నినుఁబాయఁడతఁడె నీ యిష్టసఖుఁడు.
పేదవడిపోయి యాఁకలిచేఁ దపించి
దిక్కులేనియవస్థలోఁ జిక్కినపుడు
చేతనైనంత సాయంబు చేసి యెవఁడు
నీకుఁ దోడగు నాతఁడే నీసఖుండు.
ధనమునకుఁగాక నీదుమెప్పునకుఁగాక
కీర్తికింగాక ప్రత్యుపకృతికిఁ గాక
చిత్తశుద్ధిగ నీకు మేల్సేయు నెవఁడు
నిజముగాఁ జూడ నాతఁడే నీసఖుండు
ఎవనిచిత్తంబు నీచిత్త మేకమగునొ
యెవనిజీవంబు నీజీవ మేకమగునొ
యెవనివృత్తంబు నీవృత్త మేకమగునొ
యాతఁడేచుమ్ము నమ్ము నీయాత్మసఖుఁడు.

(16-9-1911.)

# 25 రాజభక్తి.



శ్రీజార్జి పట్టాభిషేకోపాయనపద్యహారావళి.

ఆ శీ ర్వా ద ము.



శ్రీరంజిల్లఁగ భద్రపీఠమున భా
త్రీపుత్త్రితోఁ గూర్మియే
పారం గొల్వయి సోదరాప్తబుధమి
త్రామాత్యసామంతులున్
బౌరవ్రాతముఁ గొల్వఁ జెల్వెసఁగు నా
పట్టాభిరాముండు మా
మేరీజార్జుల రాజదంపతులఁ బే
ర్మిన్ బ్రోచు నశ్రాంతమున్.

ఉ. శ్రీమహిళాజనార్దనులు
శ్రీయును, రాజ్యరమానుభూతి, భా
షామహిళాపితామహులు
సన్మతియున్, జిరజీవనంబు, నా
ర్యామహిళాగిరీశులు శు
భాళి, విభూతియు, నిచ్చి మేరిరా

జ్ఞీమణి, జార్జి భూవిభుని
నిత్యముఁ బ్రోతురుగాక సత్కృపన్.

స్వాగతము.

మ. మును రాజేంద్రకుమారచంద్రు నిను స
మ్మోదంబు రెట్టింపఁగాఁ
గనుమాకిప్పుడు చక్రవర్తివయి రాఁ
గాఁ గ్రమ్మఱంగల్గె ద
ర్శనలాభంబు, కృతార్థులైతిమి మహా
రాజేంద్రచూడామణీ!
ఘనతేజోద్యుమణీ! శ్రితావనమణీ!
కల్యాణచింతామణీ!

సీ. ధర్మంబు నాల్గుపాదములఁ దప్పకయుండ
నర్థంబు సంతుయ మందకుండ
విజయరమాహృదంబుజము కందకయుండఁ
గీర్తికామిని కోపగింపకుండ
సుప్రతాపానల స్ఫూర్తితగ్గకయుండ
గుణముల లోపంబు గూడకుండ
ప్రజలచిత్తంబుల భక్తితప్పకయుండఁ
బగవార లున్నతిఁ బడయకుండఁ

దండ్రిపోలికి, నాతని తల్లిపోల్కి
నేలుచున్నావు చిరకాల మేలఁగలవు
భరతఖండంబునను పట్టభద్రుఁడైన
సత్యపథవర్తి! శ్రీజార్జి చక్రవర్తి!
గీ. జానకీరాములను, శచీ శతమఖులను,
శారదాబ్జాసనుల, నుమా శంకరులను,
శ్రీరమామాధవులఁ, బోలి చెలఁగుసార్వ
భౌమదంపతులకు మీకు స్వాగతంబు.

---

## అమూల్యమణిహారము.

---

సీ. ఇనుఁడగునీకు చేర్మినిఁ గూర్తురెందఱో
ప్రభుశేఖరులు పద్మరాగమణుల
రాజగు నీకు నమ్రిత దెత్తురెందఱో
సామంతనృపులు ముక్తామణులను
గురుఁడగు నీకు మక్కువ నిత్తురెందఱో
ప్రకృతినాథులు పుష్యరాగమణుల
బుధుఁడగునీకుఁ బెంపునఁ జేర్తురెందఱో
ధరణీజనంబులు గరుడమణుల

భూమిపాలక ! మేము నమూల్యనవ్య
పద్యమణిహారముల నీ కుపాయనముగ
నిచ్చుచుంటిమి దయతో గ్రహింపుమయ్య !
చారుమణిధామ ! శ్రీజార్జిసార్వభౌమ!

---

## అమ్లానపుష్పోపహారము.

సీ. అసమానమాలతీ కుసుమవల్లరికంటెఁ
జాఁక మోహానమ్మృదు శయ్యఁగూర్చి
కమనీయనవమల్లికాగుళుచ్ఛముకంటెఁ
బ్రథితసౌరభ్య భావంబు నెఱపి
సురపారిజాత ప్రసూనమంజరికంటె
సమ్యగామోదరసంబుఁ జిలికి
మాలతీ మల్లికామందారములకంటె
లలితమనోజ్ఞ రీతులఘటించి
పద్యపుష్పోపహారముల్ భక్తిమీఱఁ
జేర్చి హారము పట్టాభిషేకపుష్ప
హారములుగాఁగఁ బ్రేమతో నందికొనుఁడు
సాధ్వి ! మేరీమతల్లి ! శ్రీజార్జిభూప !

---

## అభినందనము.

సీ. వైభవంబున శచీవరుని కన్నులు గుట్టి,
వైశ్వానరుని శుచిత్వమునఁ నూఁది
ధర్మరక్షణఁ గాలు దండంబు వెట్టించి,
నిర్భృతిఁ బుణ్యజనత్వ నియతిఁ దెగడి
భువనపాలనమున భువనేశు నరికట్టి
యమ్మహాబలు శక్తి వమ్ముఁ జేసి
ధనదత్వమునఁ గుబేరున కుత్తరంబిచ్చి,
శర్వుని భూతిచే నగముచేసి
యష్టదిక్పాలకాంశల నవఘళించి
విశ్వపాలనమున మహా విష్ణు వగుచు
వెలయుచున్నాఁడు విబుధులు వినుతి సేయఁ
జారుతరకీర్తి మాజార్జి చక్రవర్తి.

సీ. వాహినీమండలి వస్తుమాత్రమె కాని,
యతనిపరితాపమే యవని నేలు
అంగరక్షకసైన్య మంగమాత్రమె కాని,
యతనితేజమె దుష్టతతి నడంచు
న్యాయసభాపాళి నామమాత్రమె కానిఁ
యతనియాజ్ఞయె ధర్మగతుల నిలుపు

ఛత్రాదికంబు భూషామాత్రమేగాని
యతనిరూపమె ప్రభుత్వాప్తిఁ దెలుపుఁ
దలఁప మాగధు ల్విభవమాత్రింబెగాని
యతనిభాగ్యంబె యశము దిక్తతుల నింపు
రాజమాత్రిండె యతఁడు విరాజమాన
విక్రమస్ఫూర్తి, శ్రీజార్జి చక్రవర్తి.

సీ. చతురాస్యుఁడనుపేర జరుగుచుండుటెగాని,
యజుఁడెన్న మతిమాలినట్టివాఁడు
విశ్వరక్షకుఁడను పేరుమోయుటెగాని,
హారిజ్ఞాతిప్రైరంబు గలుపువాఁడు
మంగళప్రియుఁడను మాటమాత్రిమెగాని,
హేమచాపుఁడు బిచ్చ మెత్తువాఁడు
సతతసన్మార్గసంచరణుఁడంటయెగాని,
రవి యంటముట్టఁగా రానివాఁడు
పొగడికలుగావు ముప్వురు మూర్తులైన
మూఁడుమూర్తుల రూపొందు ప్రోడమైన
నాతనికి నెందు నీడు జోడనఁగ రాదు
సర్వసామాన్యుఁడే జార్జి చక్రవర్తి.

సీ. తనరాజ్యమున నెప్పు డినుని వెలింగించు
నన్నఁ బ్రతాపంబు నెన్న నేల!

తననివాసంబె తెల్లని దీవిగాఁజేసె
నన్నయశస్స్ఫూర్తి నెన్ననేల ?
తనభూమి విమలవాహినులఁ దన్పఁగఁజేయు
నన్న దయారసం బెన్న నేల ?
తనముద్రికనె జగద్భరణంబుఁగావించు
నన్న మహత్త్వంబు నెన్న నేల ?
శిష్టజనముల మన్నించి దుష్టతతుల
నొంచి దయతోడ జగతిఁ బాలించుచుండె
నమ్మహారాజ్ఞి సార్వభౌమావతంసుఁ
డన్న మఱి వేఱె విష్ణువం చెన్న నేల ?

సీ. విబుధరక్షణముఁ గావించు మహేంద్రుండు
జనుల నెల్లరఁ బ్రోచు సర్వసముఁడు
ఖలవైరిజనముల కనులు గుట్టునినుండు
పరిజలకన్నులఁ జల్లఁబఱచు రాజు
అపమృత్యుభయముల నడఁగించు నీశుండు
జగమెల్లఁ బాలించు సార్వభౌముఁ
డిష్టార్థములనెల్ల నిచ్చువదాన్యుండు
పాపభారముఁదీర్చు భూపమౌళి
అర్థులకుఁ గొంగుబంగార మైనవాఁడు
ఆశ్రితులయింటి కల్పకం బైనవాఁడు

అఖిలభూమీజనుల కాధ్యుఁ డైనవాఁడు
సత్యపథవర్తి శ్రీజార్జి చక్రవర్తి.
గీ. భరతఖండాద్వితీయ సౌభాగ్యగరిమ
భారతీయతపః పరిపాకకలన
మేరియుతుఁడౌచు జార్జి భూమీవిభుండు
చేరి యిచ్చటఁ బట్టాభిషిక్తుఁడయ్యె.

## అ భి జా త్య ము.

సీ. జగమెల్ల నేలఁగాఁ జాలినబిడ్డలఁ
గడుపు చల్లనగాఁగఁ గన్నతల్లి
పతిని దైవంబుగా భావించి సేవించి
కమనీయతరకీర్తిఁ గన్నసాధ్వి
ప్రజల బిడ్డలవలెఁ బాలించి యెనలేని
గౌరవభావంబుఁ గన్నరాజ్ఞి
నిజశత్రులకు గర్భనిర్భేదమగుప్రతా
పోన్నతి వెలయింపఁ గన్నదేవి
ఈదృశానేక సత్ప్రతిభాదికములఁ
గొనియె నేదేవి యట్టివిక్టోరియాంబ
యెన్నఁ దనతండ్రితల్లిగా నెసఁగువాఁడు
సర్వసామాన్యుఁడే జార్జి చక్రవర్తి.

సీ. దిశ లెల్లఁ గీర్తిచంద్రికలఁ గప్పినదెవ్వ
రన, నాతఁడన నర్హుఁ డైనవాఁడు
అరు లైదుపదిసేయ నవని నేలినదెవ్వ
రన, నాతఁడన గుణిమైనవాఁడు
ప్రజల బిడ్డలఁబోలెఁ బాలించు విభుఁడెవ్వ
రన నాతఁడనఁ బాత్రుఁ డైనవాఁడు
వసుధ సప్తమ సార్వభౌమ శేఖరుఁ డెవ్వ
రన, నాతఁడన యోగ్యుఁ డైనవాఁడు
పరిధిత విక్టోరియా తపఃఫలము నైన
సాంద్రతరకీర్తి యెడ్వర్డు చక్రవర్తి
తనకు జనకుండుగాఁ బ్రోది గనినవాఁడు
భూపమాత్రుండె శ్రీజార్జి భూపమౌళి.
సీ. దీనపాలనకు నందినచేయి, సత్యప్రి
యత్వంబునకును బట్టైనకొమ్మ
ఋజువర్తనమునకు నిజమైన మార్గంబు
గౌరవంబునకు నా కల్పకంబు
అనఘ పాతివ్రత్యమునకు నిదానంబు
తరుణీమణులకు నాదర్శకంబు
శాంతి సద్ధర్మశౌచముల కావాసంబు
సద్గుణంబులకును జన్మభూమి

యగు నక్షోంద్రియా, మహాయాభిజాత్య,
ధన్యచారిత్ర, సాధ్వీమతల్లి, తల్లి
కూరిమిని బెంపఁబెరుగు కుమారమూర్తి
సర్వసామాన్యుఁడే జార్జి చక్రవర్తి?
గీ. పూర్ణచంద్రునితోడి కౌముదినిబోలి
వెన్నుఁబాయక యెపుడు సేవించుచుండు
నట్టి శ్రీమేరిరాజ్ఞి యర్ధాంగిగాఁగఁ
బ్రీతిఁ దనరారు జార్జి వర్ణింపఁదరమె.

---

## ప రి పా ల న ము.

---

సీ. మున్నున్నదనిమైన నెన్నఁడే వింటిమే,
రమణీయతంతి వార్తాప్రశంస
మున్నున్నదనిమైన నెన్నఁడేఁ గంటిమే,
యత్యద్భుతాకాశ యానకలన
మున్నున్నదనిమైన నెన్నఁడే వింటిమే,
కమనీయలోహ మార్గప్రశస్తి
మున్నున్నదనిమైన నెన్నఁడేఁ గంటిమే,
విద్యుత్ప్రదీపికా విలసనంబు
విన్నవియుఁ, గన్నవియుఁ, గాని వింతలెల్లఁ
గాంచుచుంటిమి ; నెవ్వదిఁ గాంచుచుంటి

మవనిలో స్వర్గసౌఖ్యంబు లందుచుంటి
మహహా! యాంగ్లేయ ధర్మరాజ్యంబువలన.

సీ. రాజవీథులనైన రత్నాలమూటలఁ
బడవేసికొనుటకు భయము లేదు
నడురేయినైన నొంటరిగ మార్గంబున
జరగిపోవుటకును జంకులేదు
అడవిలోపలనైన వ్యవసాయ మొనరించి
శరణంబుఁ జేర సంశయములేదు
అంబుధినైనఁ బ్రయాణంబుఁ గావించి,
దేశాంతరము లేగ దిగులులేదు
ప్రజలతలను పూవు వాడకయుండఁగాఁ
గడుపులోనిచల్ల గదలకుండ
వఱలఁజేయుచుండు పరిపాలనము గల్గె
నహహా! మనయదృష్ట మరయవశమె!

సీ. చౌడైనఁ బండని చట్టునేలలుగూడ
మహనీయ సస్య ధామంబు లయ్యెఁ
గాలైన నిడరాని గహనభూములుగూడ
రమణీయ రాజమార్గంబు లయ్యె
గట్టైన నెఱుఁగని మెట్టచెర్వులుగూడఁ
గమనీయ సోపాన గతము లయ్యెఁ

గదలైన నెఱుఁగని కారుకాల్వలుగూడ
వరణీయవాహినీ వరము లయ్యె
నెప్పుడో కృతయుగధర్మ మెవ్వఁ డెఱుఁగు
నెప్పుడో రామరాజ్యంబు నెవ్వఁ డెఱుఁగు
నెప్పుడో యుధిష్ఠిరశకం బెవ్వఁ డెఱుఁగు
నింతటిపరిభుత్వ మున్నదే యెన్నఁడైన ?

సీ. ఏటికావల నూళులే లేవనెడివార
మంబుధి యవ్వల నరయుచుంటి
మామడ దినమున కరుగనేరనివార
మయుతయోజనముల కరుగుచుంటి
మవలివీథిప్రసంగ మాకళింపనివార
మెల్లభూములవార్త లెఱుఁగుచుంటి
మాత్మదేశము వీడి యడుగు దాఁటనివార
మెల్లదేశంబుల కేఁగుచుంటి
మహహా ! యెన్నఁడు నెఱుఁగని యట్టిభాగ్య
మట్టిసౌఖ్యంబు నట్టి మహాముదంబు
ననుభవించితిమే యెప్పుడైన మనము
నయత రాంగ్లేయ పరిపాలనమునఁ గాక !

సీ. సాహసికంబైన సహగమన మడంగె
శిశుహత్య లెల్ల నశించిపోయె

గాలపుసిడులు ధిక్కారంబు నందెను
నరబలులెల్ల వినాశమయ్యె
పాశకారుల దుష్టవర్తనంబు లడంగె
దొంగతనంబులు దూరమయ్యె
బందిపోటులకు నిర్బంధముల్ ఘటియిల్లె
సకల దుష్కార్యముల్ సమసిపోయె
ప్రాణమానధనాళి గాపాడఁబడియె
దివ్యసత్యధర్మములు బోధింపఁబడియె
క్షితిజనాళికి సౌఖ్యంబు చేర్పఁబడియె
ఘనత రాంగ్లేయపాలనా కౌశలమున.

సీ. సందేశములఁ దెల్పు జాబులందింప లే
ఖాపేషణస్థాన కలనఁగలిగె
క్రయవిక్రయముల సౌకర్యంబుఁ గలిగింప
రాకపోకలకు మార్గములు గలిగె
వ్యవసాయ మభివృద్ధిపఱుపంగఁ బ్రవిమలాం
బుపులైన పంటకాలువలు గలిగె
విద్యాభివృద్ధిఁ గావింప నూరూరికి
సరవి నొక్కొక కళాశాలగలిగె
ప్రజలకుంగల మూఢభావములు వోయె
స్త్రీలకునుగూడ విద్య నేర్పింపఁబడియె

జగతి నెల్లెడలంగూడ శాంతియొదవె
ఘనత రాంగ్లేయపాలనా కౌశలమున.

సీ. అవనివార్తలకెల్ల నాధారమైన వా
ర్తాపత్రికా పరిచారంబు గలిగె
నారోగ్యమునకు మూలాధారమైయున్న
వైద్యాలయాధిక వ్యాప్తిగలిగె
నగరంబులకు లోహనాళమార్గంబుల
నమలోదకపరివాహము లభించె
స఼్ోటకామయము లుద్ఘాటించి యపమృత్యు
భయము పోకార్చు త్రోవలు లభించె
ఇన్ని యన్ని యనఁగనేల యెన్నియేని
సౌఖ్యకరమార్గములు ప్రజా సమితికొదవె
సత్యధర్మతుమాదయా సక్తమైన
ఘనత రాంగ్లేయపాలనా కౌశలమున.

సీ. ఆంగిలేయుల ప్రభుత్వాప్తి యబ్బుటఁగదా
ధర్మపాలన మహత్త్వంబు గలిగె
ధర్మపాలన మహత్త్వంబు గల్గుటఁగదా
జగమంతయు సుభిక్ష మగుచునుండె
జగమంతయు సుభిక్ష మగుచుండుటనెగదా
దురవృత్తి జనులకు దూరమయ్యె

దుర్వృత్తి జనులకు దూరమౌటనెగదా
ప్రజలకు సౌఖ్యంబు పడయఁగలిగె
సకలభూభారము సడంగె; శాంతియొదవె;
నహహా! మనభాగ్య మెంతని యనఁగవచ్చు
నాసుధాకర తారార్కమగుచు నిట్టి
దివ్యపరిపాలనంబు వర్ధిల్లఁగాక!

---

## మంగళాశాసనము.

సీ. మహనీయతరసర్వ మంగళాకలితమై,
యలరారుచుండు నర్ధాంగితోడ
ననుపమానందదాయకమౌచు సౌఖ్యంబుఁ,
గాంచు కుమార వర్గంబుతోడ
విద్యున్నిభద్యుతి విలసిల్లు విమలమ
హాహీన మణిభూషణాళితోడ
నాజ్ఞానుసార విహారమై భక్తిసం
గతిఁగొల్చు సద్భృత్య గణముతోడ
సదమలవిభూతితోడఁ దేజంబుతోడ,
నలరి, రాజశేఖరత నార్యానురాగ

పరతఁ జెలువొందిఁ, జార్జిభూపాలతిలక!
లీలఁ బెక్కేఁడు లవనిఁ బాలింపుమయ్య!

—

## మంగళమహాశ్రీ

శ్రీనిలయుఁ డార్యజన, సేవ్యుఁడు, పరాత్పరుఁ,డ
శేషజనపాలకుఁ, డనంతుం
డానతశరణ్యుఁడు, మహామహుఁ డమేయగుణుఁ
డాఢ్యుఁడు, దయామయుఁ, డజుండున్
జ్ఞానమయుఁ, డీశ్వరుఁ డఖండమగునట్లొసఁగుఁ
గావుతఁ గృపామతిని మేరీ
మానవతి, కీశ్వరసమానుఁ డగుజార్జికిని,
మంగళము, మంగళమహాశ్రీన్.

## కథాప్రారంభము.

శ్రీమదిలాతనూజను వ
రించెడిపట్టునఁ దన్ముఖాంబుజా
తామితరామణీయక సు
ధాసవ మానఁదలంచి యొంఁదలన్
ప్రేమను బ్రాలునించెడుత
టిన్ గడుపారఁగఁ గ్రోలి క్రాలు నా
రాముని ప్రేక్షణాళులు ని
రంతరమున్ గృపఁజూచు మమ్ములన్.

సీ. దర్శనీయంబైన దైవంబు భూపాలుఁ
డిహాము వెలుంగించు నినుఁడు విభుఁడు
చనవునఁ బోషించు జనకుండు నృపమౌళి
తమిమీఱ నలరించు తల్లిప్రభువు
గుణదోషములఁదెల్పు గురుఁడు మహీంద్రుండు
హితముదెల్పెడు పురోహితుఁడు రాజు
మేలొనఁగూర్చు సన్మిత్రుఁ డుర్వీశుండు
తలఁపుల నీడేర్చు దాత నృపతి
మహిత మహిమాన్వితుండు పేర్మిప్రపూర్ణుఁ
డనుపమజ్ఞానసంపన్నుఁ డాత్మనున్వ

భావకలితుండు, నగు నరపాలుఁడెగద
యవనిజనులకు నన్నియు నైనవాఁడు !

ఉ. శ్రోఁతియెయయ్యు మారుతి య
కుంఠితవిక్రముఁడై యపారవి
ఖ్యాతి పయోనిధిం గడవఁ
గల్గెను, సూతుఁడెయయ్యుఁ గర్ణుఁడా
స్ఫీతచరిత్రుఁడై నృపతి
సేవితుఁడయ్యెఁ; దలంచి చూడఁగా
నాతత రాజభక్తులకు
నందఁగరాని యభీష్ట ముండునే?

సీ. శ్రీమద్వసుంధరా స్థితజనోన్నతిఁ గూర్చు
పరిణితప్రభాశక్తి రాజభక్తి
ధర్మార్థకామముక్త్యాచయంబు లొసంగు
రమణీయతరశక్తి రాజభక్తి
సంతతసన్మార్గసరణిఁ బరిబోధించు
పాలించదాగమసూక్తి రాజభక్తి
అనవద్యభువనయాత్రానందము ఘటించు
రమ్యనౌకాయుక్తి రాజభక్తి
సకల భూమండలికిని ప్రశాంతమైన
తేజమిడు నద్భుతవ్యక్తి రాజభక్తి

సకలజనులకు నెనలేని సౌఖ్యమిచ్చు
రాజితామృతభక్తి శ్రీరాజభక్తి.

క. వేదవ్యాసుఁడు పంచమ
వేదంబున వ్రాసినట్టి విమలచరిత్రం
బాదర్శంబుగఁ జేసి ని
వేదింతుము రాజభక్తి విశ్రుతఫణితిన్.

సీ. తుదమొద లెఱుఁగక తోఁచునన్నియువ్రాసి,
మాగ్రంథమును నింప మనసు లేదు
అస్వభావంబులౌ నాఖ్యాయికలఁ గూర్చి
క్రొత్తపద్యము లల్లఁ గోర్కి లేదు
కల్లవ్రాఁతలతోడఁ గాగితంబుల నింపి
మము మేమె మెచ్చుకో మమత లేదు
కలదులేదనుశంక గలిగించి పాఠకా
గ్రణులఁ గలంగింపఁ గాంక్షలేదు
అచతురాననుఁడగు బ్రహ్మ, యపరవిష్ణుఁ,
డత్రిలోచనుఁడగు హరుఁడైన వ్యాస
మూర్తి భావించి స్వాంత ముస్ముఖముచేసి
కడఁగుచుంటిమి సత్యవాగ్రచనకొఱకు.

సీ. ఇది మంచి దిది చెడ్డ దిది యధర్మం బిది .
ధర్మంబని విధించు తాత్రి లేక

ఈతప్పుఁ జేసిన నీశిక్ష యగునని
నిల్చి శాసించెడి నేత లేక
దుష్కృతు లొనరించు దుష్టులఁ గనిపట్టి
తగురీతి దండించు ధాత లేక
అదివారి దిదివీరి దని స్వాస్థ్యవృత్తుల
నియమింపఁజాలు నిర్ణేత లేక
యల్లకల్లోలమై విపదంధకార
మందుఁబడి రాజులేని త్రియామభంగి
ప్రతిభచెడి రవిలేనట్టి పగటికరణిఁ
దొల్లి యొక్కప్పుడు జగంబు తల్లడిల్లె.

క. ఆకాలంబునఁ బ్రజ లె
ట్లాకుల పడుచుండిరో యథార్థ మెఱుఁగ ని
రాకులచిత్తంబున నా
లోకించినఁ దెలియు నెంతలోనిది మనకున్.

ఉ. ఉన్నది లేనియ ట్లెఱుఁగ
నోపెడు తెల్వియు లేనిదున్నయ
ట్లెన్నఁగఁజాలు నేర్పును, వ
హించిన మానస దివ్యశక్తికిన్
విన్నది కన్నయట్లుగ స
విస్తరభంగి సహేతుకంబుగాఁ

జెన్నసలార భావనము
చేయుట కష్టముగాఁగఁ దోఁచునే.
ఆ. రామ! రామ! యేమి వ్రాయంగనేర్తు మా
నాఁటి భూమి ప్రజల పాటులెల్లఁ
బెద్దమీను వచ్చి పిల్లమీనును బట్టి
పొట్టఁబెట్టుకొన్న యట్టులుండె.
సీ. తలకించుచుండి రెందఱో హిరణ్యాక్షులు,
ధారణీచక్రంబు దద్దరిల్ల
దండించుచుండి రెందఱో హేమకశ్యపుల్,
సాధుసంతానంబు బాధనొంద
చెఱఁబట్టుచుండి రెందఱో రావణాసురుల్,
కోమలాంగులు గోలుగోలనంగ
తెరలించుచుండి రెందఱో నరకాసురుల్,
విబుధసంఘుంబులు వెతలఁగుంద
దుష్టచక్రంబునొంచు నాథుండు లేఁడె
దీనజనముల రక్షించు దిక్కులేదె
భూమి భారంబడంచు విభుండు లేఁడె
యనుచు జగమెల్ల భీతి తల్లాడుచుండె.
సీ. బలవంతముగ నొక్క పరకాంతఁ జెఱఁబట్టు
వారి మేనులు కాల్చువారు లేరు

ధనవంతు తలఁగొట్టి ధనమెల్లఁ దరలించు
వారి బంధించెడువారు లేరు
పగఁబూని యొరులకొంపలకు నిప్పులువెట్టు,
వారిచేతులఁ జెండువారు లేరు
నడురేయి నిండ్లలోఁబడి హత్య లొనరించు,
వారితలల్ గొట్టువారు లేరు
జారచోరు, లభాగ్యు లజ్ఞాను, లనద
లవినయు, లధర్మమార్గవిహారు, లల్ప
లప్రయోజకు, లప్రియు లసురమూర్తు
లైరి ప్రజలెల్ల శాసించువారు లేక.

సీ. సంపదగలదన్న సంతోషమున్నదే,
కొట్టిచోరులు దోఁచుకొనుచునుండ
నాలుబిడ్డలు గలరనుతృప్తియున్నదే,
పట్టి జారులు భంగపఱచుచుండఁ
బండించుకొంటిమన్న బరితోషమున్నదే
త్రెంచి ముష్కరులు తర్లించుచుండఁ
బొలములు గలవన్న నిలుకడయున్నదే,
మించి దుర్మదు లాక్రమించుచుండ
నన్న మున్నది యని తృప్తియున్నదొకో
పొగరుఁబోతెవ్వఁడో తినిపోవుచుండ

లేదు నెమ్మది ; సంతుష్టి లేదు ; సుఖము
లేదు ; గతిలేదు ; శరణంబు లేదు లేదు.

చ. అనయము హెచ్చు ; ధర్మ మడు
గంటెను ; వర్తక మంతరించె, దు
ర్జనత విశేషమయ్యె ; వ్యవ
సాయము చచ్చె ; నధర్మమార్గవ
ర్తనములు వృద్ధిఁ బొందెను ; మ
తంబులు మాసెఁ గులంబు గూలెఁ ; బీ
డన మతిరేక మయ్యెను ; గ
డంకలు వోయె మహీజనాళికిన్.

సీ. కామంబునకు యథేచ్ఛామార్గ మొనఁగూడె,
క్రోధంబునకుఁ బట్టుఁగొమ్మ లబ్బె
లోభంబునకు భృత్యలోకంబు చేఁజిక్కె,
మోహమ్మునకు జయమ్ములు ఘటిల్లె
మదమున కధిక సన్మానంబు సమకూరె,
మత్సరంబునకు సామ్రాజ్య మొదవె
దుర్గుణంబులకును దొలునోము ఫలియించె
దుర్నయంబుల కున్నతులు లభించె
ధర్మమే లేదు ; కలదే నధర్మహాతము ;
సాధులే లేరు, కలరే నసాధుహాతులు ;

కటకటా! మంగళములోని కందిగింజఁ
బోలె జగమంతయును వేగిపోవుచుండె.

క. తగవులు, నల్లరు, లలజడు,
లగచా, ట్లాఱటములు, తిట్టులాడిక, లఱపుల్,
జగడంబులు, హత్యలునై
జగము పరిభ్రాంత మగుచు నసిచెడిపోయెన్.

సీ. సంఘంబు దుర్నీతి సమయించుటకుఁ గాదు,
చొచ్చి గ్రామముల దోఁచుటకుఁగాని
ప్రాబల్య మబలలఁ బాలించుటకుఁ గాదు,
శుద్ధాంతములఁ గలంచుటకుఁ గాని
ఖడ్గంబు దుష్టుల ఖండించుటకుఁ గాదు,
పొడిచి కన్నములు త్రవ్వుటకుఁ గాని
ప్రాభవం బనదలఁ బాలించుటకుఁ గాదు,
చుఱచుఱ ప్రజలఁ గాల్చుటకుఁగాని,
అకట! యీరాఁటిప్రజలయం దడరియున్న
శక్తులన్నియు దుష్క్రియాచరణమునకె
పాలుపడుచుండ దీనుల ప్రాణములకు
గడియ కొక్కొక్కకష్టంబు గలుగుచుండె.

చ. బలమున విక్రమంబునను
పాపపథోన్ముఖ వర్తనంబునన్

జలమున నొక్కనిం గెలువఁ
జాలినవాఁడు మఱొక్కఁడుంట దు
ర్బలబలభేదభావములఁ
బొల్పడి పోరెద రంతెగాని యీ
ఇలపయి నొక్కఁడేని సుఖి
యించుటలే దదియేమి పాపమో.

చ. కలవులచేత, దుర్జనని
కాయముచేతఁ, బరస్పరంబు ము
ష్కరులయిపోరు దుర్మదుల
ఘర్షణచేత భయంబునొంది ది
క్కఱి దరిలేనియాపదలఁ
గ్రాఁగుచు దూఁగుచు నొక్కరీతిగా
హరి! హరి? యప్పు డట్టుడికి
నట్టుడికెన్ బ్రజయెల్ల నెల్లెడన్.

శా. ఆరీతిం జనులెల్లఁ దల్లడిల న
న్యాయంబు వర్ధిల్లుటన్
దౌరాత్మ్యంబుఁ దొలంచి తోడిప్రజ కా
ధారంబుఁ గల్పింపఁగా
ధీరస్వాంతుఁ డొకండు గావలయుఁ గా
దే నాయకుం డంచు నూ

రూరన్ జర్చలు సేయఁ జొచ్చిరి మహా
ద్యోగంబుఁ గావించుచున్.

చ. పదుగురు చేరి యొక్కరునిఁ
బాలకుఁగాఁ గొని యూరనూర ధ
ర్మములు నడంచి సాధుజన
మండలిఁ దన్పుచునుండ నాతనిం
గుదురొనరించి భక్తిమెయిఁ
గొల్చుచు నాతని శాసనంబు నె
మ్మదిఁ దలఁదాల్చుచుండుటకు
మేకొనుచుండిరి కొన్నినాళ్లుగిన్.

క. అంతటితో నేమగుఁ గ
ల్పాంతజ్వలనంబు నార్పఁజాలును సమిధల్
సంతప్తములై కీలా
సంతానంబునకుఁ దోడొసఁగుఁగాక వివియున్.

క. ఆపాలకు లధికారము
ప్రాప్తునకు మదించి ధర్మపద్ధతిఁ బ్రజలం
గాపాడనేరక యథే
చ్ఛాపరతంత్రులయి తిరుగసాగిరి పెలుచన్.

చ. తనతన శాసఁగొల్పిన ల
తాలలితాంగుల వాహనంబులఁ

ధనముల మానికంబుల ను
దారమతిం గొనితెచ్చి యిచ్చు నా
తనిఁ దమవానిగా మనిచి
తక్కినవారల దండనాష్టులం
చును నలయించుచుండె రవి
శుద్ధచరిత్రికులై క్రమంబుగన్.

మ. తనుదావచ్చిన స్వానికారములచే
తంబొంగి మత్తిల్లి దు
ర్జనతం బూని చరించువారిఁ గని యా
శం జెంది యాస్థాన మే
య్యన చెందందగు మాక, మాక, యని పో
రాడంగఁ దొల్లింటి మిం
చినకల్లోలము పుట్టి భూప్రజలకుం
జేకూర్చెఁ గష్టంబులన్.

క. ఒకరొకరుగ, నొకసంఘము
నొకసంఘముగాఁగ, యుద్ధమొనరింపఁగ నూ
రక రక్తనదులె కాని
సుఖము జయము చేర దొక్కచోటికి నైనన్.

ఆ. ఒకనిజంపి యొక్కఁ డుస్నతివహించుఁబ
నతనిఁజంపి మఱొకఁ డది హరించు;

తాఁకిడిఁ దన్నువాని తలఁదన్నువాఁడుండు
నన్న యార్యసూక్తి సార్థకముగ.

మ. జగమెల్లన్ రణరంగమై యెసఁగ వే
శ్మంబుల్ శ్మశానంబులై
నగరంబుల్ గహనంబులై చెడియె ను
న్మత్తాకృతుల్ దాల్చి దు
ష్టగణంబుల్ చెలరేఁగి యుబ్బుచు యథే
చ్ఛావృత్తి సన్మార్గ దూ
రగులై తాండవమాడుచుండిరి జగ
దంగంబు భంగించుచున్.

క. ఆకల్లోలమునంబడి
లోకము తల్లడము నొంది లోఁగఁగఁ బ్రజల
వ్యాకులమతులై శరణము
నాకాంక్షించి పరమేశుఁ బ్రార్థించి రాగిన్.

మ. జగతిన్ సృష్టియుఁ బాలనంబును వినా
శంబున్ త్రిభంగిం బొన
ర్పఁగ నీవేగద కర్త వాఢ్యుఁడవు దే
వా! యార్తులన్, దీనులన్,
విగతజ్ఞానుల, నిస్సహాయుల, విపద్వి
భ్రాంతులన్ మమ్ముఁ బ్రో

వంగరావే దయఁజూడవే యనదలం
బాలింపవే యీశ్వరా!

శా. దేవా! పాపముపండెఁ; సాధుజనముల్ ది
క్కేఁడియున్నారు; రౌ
ద్రావేశంబున దుర్మదుల్ ప్రబలి దు
ర్వారాపకారక్రియల్
గావింపన్ వెనుదీయకుండిరి, మహా
కాలావతారుండవై
రావే! రక్షణ శిక్షణంబులను దీ
ర్పం బెద్ద నిర్మింపవే!

మ. గరదుల్ కొంపలఁ గాల్చువారలు కనత్
ఖడ్గాది శస్త్రాస్త్రదుల్
పరదారాభిరతుల్ పరస్వహరణ
ప్రాశుల్ పరక్షేత్రసం
హరణుల్మన్నగు నాతతాయులు యథే
చ్ఛాయత్తులై సాహసో
ద్ధురులై యుండిరి, విశ్వరక్షక!
జగద్ద్రోహంబు వారింపవే!

చ. బలమును విక్రమంబును ప్రబ
భావము సర్వసమత్వమున్ దయా

కలనముఁ గల్గు నాథ్యుఁడు జ
గంబు భరించుటలేక యెల్లెడన్
దలతలపెత్తనంబును న
ధర్మపథాచరణంబుఁగల్గి వి
చ్చలవిడి రేఁగుచుండి రతి
సాహసులై ఖలులై మహీజనుల్.

సీ. చోరులు, జారులు, జూదరుల్ మద్యసే
వనులును, దుర్మార్గ వర్తనులును,
ననృతవాదులు, న్యాసహారులు, వర్ణాశ్ర
మాచారదూరు, లన్యాయపరులు,
శఠులుఁ, నాస్తికులు, హింసాపరు, లార్యవి
ద్వేషులు, సత్క్రియాదూషకులును,
బరుషభాషణులు, ముష్కరులు, మద్మత్తు, లహం
కారు, లున్మత్తులు, మారకులును,
స్వార్థపరతంత్రులౌచు నీ జగమునెల్ల
గలఁచుచున్నారు దీనులు నిలువ నీడ
లేదు ; చేరుటకును దిక్కులేదు ; వేగ
రావె ! రక్షింపవే ! మహాదేవ ! దేవ !

సీ. కరుణారసముఁజిల్కు కడకంటిచూపుతో
దీనులబాలించు దిక్కునీవ

జగతికి భద్రంబు సమకూర్చి సమబుద్ధిఁ
బరిపాలనము సేయు ప్రభుఁడవీవ
లోకకంటకుల నాలోకించి తగురీతి,
శాసింపఁజాలు శిక్షకుఁడవీవ,
ఆర్తులౌ భక్తుల యభిమతార్థంబులు
దయచేసి ప్రోచెడి దాతవీవ
శిష్టజనరక్షణము, దుష్టశిక్షణంబు
నెఱపి భూభారమడఁగింప ధరణి నవత
రించు నాథుఁడవీవ హరీ! మహాత్మ!
అగతికుల మమ్ముఁ గాపాడుమయ్య దేవ!

మ. అని యీరీతి విపన్నులై జనులు హా
హాకారముల్ సేయుచున్
ఘనభక్తిన్ ధరణీజనంబులు జగ
త్కర్తన్, జగన్నాథు, బా
వను, నీశుం, బ్రణతార్తి సంహరణునిన్,
వందారు మందారు, వి
శ్వనిదానుం, బరముం, బ్రధానమహితుం
బ్రార్థించి రొక్కుమ్మడిన్.

సీ. దుష్టశిక్షణమును శిష్టరక్షణమును,
నొకచేతనే చేయుచుండువాఁడు

ఖలులదుర్మార్గంబు, ఘనులసన్మార్గంబు,
నొకకంటనే చూచుచుండువాఁడు
నాస్తికులదురుక్తి యాస్తికుల నతోక్తి,
యొకచెవినే వినుచుండువాఁడు
నిరుపేదబిడ్డల నరపాలసూనుల,
నొకరీతినే పెంచుచుండువాఁడు
రాతిలోఁ గప్పకును చెట్లఁ గోఁతులకును
నొక్కగతి భుక్తినొసఁగూర్చు చుండువాఁడు
సర్వసమవర్తి దేవతా చక్రవర్తి
యపుడు వారలయెదుటఁ బ్రత్యక్షమయ్యె.

సీ. నిప్పచ్చరంబున నెగులొందు పేదకుఁ,
బెన్నిధి యెదుటఁ గాన్పించినట్లు
నట్టేటఁబడి మున్గి కొట్టాడు నార్తుని,
చేతికిఁ గూలంబు చిక్కినట్లు
అంధకారమున నల్లాడు జాత్యంధున,
కాకస్మికముగ జూపైనయట్లు
కడుపు మండంగ నాఁకలిగొన్నవానికి
నిష్టాన్నములు లభియించినట్లు
అఖిల భూతదయాపరుఁడయిన విభుఁడు
కట్టెదుట నొక్కసారి సాక్షాత్కరింప

నామహాజనమండల మద్భుతప్రి
మోదరసమగ్నమై తేలిపోవుచుండె.

సీ. చాతకాళికిఁ బిపాసార్తి తీరదే
కమనీయ మేఘోదకంబువలన
కుముదావళికిని సంకోచంబుతీరదే
లలితేందుచంద్రికా విలసనమున
కుజషండమునకు నాకులపాటు తీరదే,
మహితవసంత సమాగమమున
కోకసంతతికి వ్యాకులపాటు తీరదే
తరుణ ప్రభాకరోదయమువలన
ఘనుఁ డనంత లసత్ప్రభాకరుఁడు విభుఁడు,
కాలరూపుఁడు సర్వజగత్స్వరూపుఁ
డైన దేవుండె ప్రత్యక్ష మైనయపుడు
దీనజనుల యభీష్టముల్ తీరకున్నె ?

శా. ఆయానందరసాతిరేకమున నా
హ్లాదంబు దీపింప ని
త్యా, యానందమయాయ విశ్వపతయే
ధర్మస్వరూపాయ తే
ధ్యాయాధ్యాయ నమోస్తుతే యనుచు సా
ష్టాంగంబు లర్పించి భ

క్త్యాయత్తాత్మకు లమ్మహాజనులు లో
కారాధ్యుఁ బ్రార్థింపఁగన్.
శా. ఆర్తత్రాణపరాయణుం డఖిలలో
కాధీశుఁ డుద్యత్కృపా
స్ఫూర్తిన్ దక్షిణహస్త మెత్తి, వినుఁడో
భూమీజనుల్ ! విస్ఫుర
త్కీర్తిక్ సాత్వికమూర్తి సర్వసమవ
ర్తిన్ భర్తగాఁగూర్చి మీ
యార్తిం దీర్చెద నోడకుండుఁడని స
ద్యస్సిద్ధ సంకల్పుఁడై.
మ. అనహంకారుఁడు నీతికోవిదుఁడు శౌ
ర్యౌదార్యవీర్యోన్నతుం
డనసూయాపరుఁ డార్యధర్మనిరతుం
డార్తార్తినిర్వాపణుం
డనుకంపామతి, సాత్వికాకృతి యమే
యప్రాభవోపేతుఁడౌ
ఘనతేజోనిలయున్ సృజించెను జగ
త్కల్యాణసంసిద్ధికిన్.
క. ఆకీర్తిన్ సృజియించి కృ
పారతుఁ డయ్యీశ్వరుండు ప్రజలం గనుమన్

మీా శా జీతండే మీ
యా రాటముఁ దీర్చునని కటాక్షింపంగన్.

గీ. రాజుఁగని పొంగు నాజలరాశిపోల్కి
రాజుఁ గని పొంగె నా జనరాజియపుడు
ఘనతరానందరస తరంగములతోడ
విజయఘోషంబు లెల్లెడ విస్తరిల్లె.

క. మాకోరికలు ఫలించెను ;
మాకన్నులు చల్లనయ్యె మాకొదతీరెన్
మాకార్యము సిద్ధించెను
లోకావనమయ్యె సత్యలోకాధీశా !

క. అని యిటు లేకగ్రీవం
బున నానందంబు పొంగి పొరలఁ బలుకుచున్
జనులు జయధ్వనులఁ బ్రతి
ధ్వనితంబుగఁ జేసి రఖిల ధరణీతలమున్.

క. ఆకలకల మడఁగించి కృ
పాకలితుం డీశ్వరుండు వారిఁ గని యీ
భూకాంతుఁడు మనునాముము
చేకొని పాలింపఁగలఁడు క్షితితల మెల్లన్.

చ. అని మనుసార్వభౌమునిఁ గ
టాక్షములన్ దిలకించి వత్స ! నీ

వనితర ధీవిశారదుఁడ
వై సమదృష్టిని ధర్మమార్గవ
ర్తనమున, సాధుభావమున
ధారుణిఁ బాలనసేయు మర్థశా
సనమున దుష్టభంజనము
సల్పుము నిల్పుము ధర్మమెల్లెడన్.

సీ. ధర్మంబు నిలుపుము తఱి వేచి శత్రుల
మడఁగింపు, మనదల మనవి వినుము,
బలములఁ గూర్పుము; వ్యసనంబు లెడలింపు
మవినీతుల నడంపు; మవని గొనుము
సైనికుల్, ప్రజలును సచివు లేకీభావ
మందునట్లుగఁ జూడు మర్థధర్మ
కామమోక్షంబులఁ గాంచుము; విషయస
క్తుండవు గాకుము గురుపురోహి
తాదుల, నమాత్యభృత్యుల నాదరింపు
మవనిజనముల నీబిడ్డలట్లు చూడు
మర్థదండంబు గొనుము, మహాపరాధుఁ
డయిన సుతునైన దండింపు మనఘచరిత!

చ. ప్రతినిధియుం; బ్రధానుఁడును,
బండితుఁడున్, సచివుండు మంత్రియున్

మతియుతుఁడౌ నమాత్యుఁడు, సు
మంత్రుఁడు, ధీనిధి ప్రాడ్వివాకుఁడుం
బతులకు నెందునుం బ్రకృతి
వర్గము కావున నట్టివార లా
యతమతులున్, సధర్ములుగ
నారసి చేకొనఁబోలు జేనికిన్.

గీ. రాజులేని ప్రజ విరాజిల్లనోపదు
రాజు ప్రజలులేక తేజరిలఁడు
కాన; స్వామిభక్తి ఘనతరంబగునట్లు
నృపతి ప్రజల నాదరింపవలయు.

గీ. మించు శక్తిత్రియంబు సాధించి, చతురు
పాయముల మర్మములెఱింగి పంచకరణ
మును నిరోధించి షాడ్గుణ్యమును నెఱింగి
కొనుచు సప్తాంగములఁ గాచికొనఁగవలయు.

క. తానుగ నవమానించుట
దానము సేయమియుఁ బ్రబలదండము, కపటం
బైనగతి; పలుకుపల్లద
మూనుటయును దొసఁగుదెచ్చు నుర్వీశునకున్.

క. అని యుపదేశించి కన
ఘనతేజుం డీశ్వరుండు కరుణామయుఁ డ

ల్లన నంతర్ధానుండయి
చనియె జగద్రింగమెడలి సత్యపథమునన్.

క. అంతట జను లమ్మనుభూ
కాంతుం గని భక్తి వినయగౌరవముల న
త్యంతముఁ బ్రార్థించిరి సు
స్వాంతంబున సార్వభౌమపదముం గొనఁగన్.

గీ. ధరణిజను లసత్యనిరతులై యుండుట
రాష్ట్రజనులయఘము రాజుదగుట
తలఁచి మనువిభుండు తలఁకి మహీరాజ్య
పాలనమున కిష్టపడకయుండె.

క. జను లప్డు ససంభ్రములై
మనువుం గని సార్వభౌమ! మము దయతోడం
గని పాలింపుము బిడ్డలఁ
దనుపక జనకుండు విడువ ధర్మంబగునే.

క. ధరణీశ ! విపజ్జలధిం
దరి గానఁగ లేనిమమ్ము దయఁగన, నిన్నున్
దరణికిఁ జూపి చనె నీ
శ్వరుఁ డాతనిపనుపు సేయవలవదె నీకున్.

గీ. "లోకములు, లోకధర్మంబులును నృపాల!
రాజమూలముల్ ; రాజవిరహితమైన

పుడమిజనులకు నింకిన మడువులోని
జలచరంబులు వడుపాటు సంభవిల్లు.

క. తరణి శశాంకుల తేజ
స్స్ఫురణము లేకున్నయట్లు భూజనములు ని
ర్భరదురితతఁ జేడ్పడుదురు
నరపాలకవిహితపాలనము లేకున్నన్.

క. తనధన మిదియని యూఁజడి
మనఁ; బరిణయమాదియైనమహోత్సవముల్
గొనియాడ నెవ్వరికి వ
చ్చునె? జనపాలుండు లేనిచో నిర్భయతన్?

గీ. విభుఁడు లేకున్న జనములు సభయహృదయు
లగుచు హాహానినాదంబు లడరఁ దల్ల
డిల్లుదురు; రాజులేమియ యెల్లవారు
లేమి; కల్మియ కల్మి నిక్లేపహృదయ!

క. యాగములును భోగములును
ద్యాగములును, బహువిధములధర్మములు మహా
భాగా! నరపతిరక్షా
యోగంబునఁ జెల్లుఁ బ్రజకు నుల్లాసమునన్.

క. రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మగాన రాజుం బ్రజయున్

రాజోత్తమ ! యన్యోన్యవి
రాజితులై యుండవలయు రక్షోర్చనలన్.

గీ. ఈశ్వరోద్దేశమును నిర్వహింపుమయ్య!
నియతితోడ స్వధర్మంబు నెఱపుమయ్య !
ప్రజల బిడ్డలఁబోలెఁ గాపాడుమయ్య !
విశ్వధూర్వహావిఖ్యాతి వెలయుమయ్య !

ఆ. హేమగోగణముల నేఁబదియవపాలు
ధాన్యతతులయందు దశమభాగ
మప్పనంబుగాఁగ నంది రాజ్యాంగంబు
నిలిపి పాలనంబుఁ జలుపుమయ్య !

ఆ. జగతిఁగల్గు నెల్ల శత్రుజీవుల నీవ
చేర్చికొనుచు దుష్టశిక్షణంబు
శిష్టరక్షణంబు సేయుచు రాజధ
ర్మంబు నిలిపి ప్రజల మనుపుమయ్య !

క. మనుజాధీశ్వర ! యీనీ
జనముల ధర్మంబునందు షడ్భాగంబున్
గొని బలతేజస్స్ఫూర్తిం
గని సురల మహేంద్రుఁడట్లు కావుముకూర్మిన్.

సీ. అని ప్రజలెల్ల నిట్లర్థింప మనుధర
ణీశ్వరుం డందుల కియ్యకొనుచు

నోమహీజనులార ! మోడకుం డిమ్మహీ
భారంబు వహియించి భద్రగతులఁ
బరిపాలనముచేసి పరమేశ్వరునియాజ్ఞ
ననుసరించెద నని యభయమొసఁగ
నెసలేని సంతోషమునఁబొంగి ప్రజలెల్ల,
జయజయోదీర్ణ ఘోషములతోడ
గీ. భక్తితోడ ననంతవైభవముతోడ
మంగళాశాసనములతో మనునృపాలు
నవ్యమణిమయ సింహాసనమున నునిచి
వేడ్కఁ బట్టాభిషిక్తుఁ గావించిరంత.
సీ, సకలభూమిజనస్వాంతముల్ విలసిల్లె
సకలదేశంబులు చల్లనయ్యె
సకలసస్యంబులు సంపూర్ణముగఁబండె
సకలదిక్కులు ప్రకాశకములయ్యె
సకలధర్మంబులు సంస్థాపితములయ్యె
సకలదుష్కృతులు నాశంబులయ్యె
సకలసౌఖ్యంబులు సంకల్పితములయ్యె
సకలేప్సితంబులు సఫలమయ్యె
సకల లోకాభినంద్య ప్రశస్తకీర్తి
సకల కల్యాణగుణ సుప్రసన్నమూర్తి

సకల సమవర్తి యమ్మను చక్రవర్తి
సకల భూప్రజలలర రాజ్యంబు సేయు.

చ. ప్రియజనకుండుఁ, దల్లియును,
విశ్వవిభుండు గురుండు దేవుఁడై
దయయును ప్రేమమున్నతియు
దాంతియు శాంతియుఁ గల్గి లోకమున్
నయగతి రక్షసేయుచు జ
నంబులఁబ్రోచు ప్రభుండు కల్గుటన్
భయములుతీరె నీధరణి
భారముతీరెను జేరె సౌఖ్యముల్.

గీ. కరము కరముఁ గొనక కడుఁగృపామతితోడ
నేల నేల సాధుశీలమునను
ప్రజలు ప్రజలువోలెఁ బ్రభుభక్తి యుతులైరి
రాజు రాజువోలెఁ దేజరిల్లె.

(15-11-1912.)

# 26 కవిగీతము.

కవిత కవిమూలమునఁ గవి కవితవలన
ఘనతర స్థితినందుట గలుగుచుండుఁ
గవితఁబోలిన మధురవస్తువులు లేవు
కవులఁబోలిన ధన్యమానవులు లేరు.

---

విమలనవనీత మృదులశబ్దములఁ గూర్చి
రమ్యభావ ప్రబోధకార్థములఁ గూర్చి
పరిమళామోద మధురభావములఁ గూర్చి
తతమనోహారలసదలంకృతులఁ గూర్చి
యనుపమావ్యక్తసుమధురధ్వనులు సెలఁగ
సలలిత శిరీషసుకుమార శయ్యలలర
నూతనమనోజ్ఞ చాతురీ రీతులెసఁగఁ
బటుతరాద్భుత వివిధకల్పనలు వెలయఁ
దఱచు దొలకరి మెఱపులు మెఱసినట్లు
మెఱసి క్రొవ్విరి సోనలు గురిసినట్లు
కురిసి సౌరభమెల్లెడ దొరసినట్లు
మహితమై మానితంబైన మనసుతోడ

భవ్యమై పావనంబైన పల్కుతోడ
విమలమై విస్ఫుటంబైన వృత్తితోడ
దివ్యమై ధీయుతంబైన దృష్టితోడఁ
బదములు నిరర్థకంబులై గదురకుండఁ
బొదలు రసభావములు చెక్కు చెదరకుండ
సుస్వభావ మాధుర్యంబు సుడియకుండఁ
గావ్యదోషంబు లెందును గవియకుండ
భావముఁ గరంచు దృశ్యకావ్యములనైనఁ
జవులఁబుట్టించు శ్రవ్యకోశములనైనఁ
దానవర్ణాళిఁ బోలు పద్యములనైనఁ
దారహారాళిఁ బోలు గద్యములనైన
మహితగతి వ్రాయుమా! వ్రాయుమా!కవీంద్ర!
పరికృతి నీతోడుసీడయై పలుకుచుండె
స్వస్థచిత్తత గల దంతెచాలు నీకుఁ
గావ్యనిర్మాణమునఁ బరికరము లరసి
చూచుకొన నేల ? కవిత నీసొమ్ముకాదె !
భావనాబల మున్నది ప్రకృతియున్న
దిష్టముండినఁ బదముల కేమి కొఱఁత ?
వారిదఖిహారనగశృంగపదము లరసి
స్వాదు జలపూర్ణ సదనదీపదము లరసి

పంకజామోద కాసారపదము లరసి
ఫలభరిత దివ్య కేదారపదము లరసి
సదమల స్నిగ్ధసైకతపదము లరసి
పావన తపోవనాశ్రమ పదము లరసి
భవ్యతర మందిరారామ పదము లరసి
భవనగోపుర పట్టణపదము లరసి
సార్థకంబుగ భావించి సరసకావ్య
మొకటివ్రాయుము! వ్రాయుము! సుకవిచంద్ర!
సమదకోకిల కలకూజితములలోనఁ
బ్రముదిత మయూర కేకారవములలోనఁ
బంజరశుకీశుకాను లాపములలోన
సుమసమారోహదళిశింజితములలోన
వర్షపాద ప్రచారారవములలోనఁ
దుములకల్లోల జలధి ఘోషములలోన
ధరణిధర నిర్ఝరప్రపాతములలోన
విమలతటినీ తరంగవేగములలోన
సుమధురానిల సంచాలనములలోనఁ
దరుణకాదంబినీ గర్జితములలోనఁ
బ్రకృతి యవ్యక్తమంజుల ధ్వనులు నెలపి
వినుచున్నది చెవియొగ్గి వినుము! వినుము!

రమణ నొకసారి నీలాంబరంబుఁ దాల్చి
చెలఁగి యొకసారి వెన్నెల చీరఁ దాల్చి
పొసఁగ నొకసారి మంచుమేల్ముసుఁగుఁ దాల్చి
లీల నొకసారి మేఘమాలికలఁ దాల్చి
ప్రీతి నొకసారి చుక్కలపేరు దాల్చి
పరగ నొకసారి క్రొన్నెలవంకఁ దాల్చి
వరుసనొకసారి సస్యగర్భంబుఁ దాల్చి
సరస నొకసారి బాలభాస్కరునిఁ దాల్చి
గడియకొకరీతిగా నలంకార సరణి
నెఱపుచున్నది ప్రకృతి నీనికటమందు
లసదలంకారముల లక్ష్యలక్షణములఁ
దెలిసియుంటి విఁకేమికావలయు నీకు ?
కమ్మపుప్పొడి నెత్తావి గుమ్మరించి
వేగుఁబోకలఁ దెమ్మెరల్ వీచునపుడు
ప్రౌఢకాంతల ప్రణయకోపములు దీరఁ
గొక్కొరోయని తొలుకోడి గూయునపుడు
కాఱుచీఁకటి గుంపులఁ గడలఁ ద్రోసి
తూర్పునఁ బ్రభాతకాంతులు తోఁచునప్పు
డుదయశైలంబు మాటుననుండి బాల
సూర్యుఁ డల్లనల్లన తొంగిచూచునప్పు

డరుణకిరణంబు లల్లన తరులమీఁద
నలరు పవడంపుఁ దీవల నల్లునపుడు
ప్రకృతికాంత ప్రసన్నభావంబుఁ దాల్చి
కలవిహంగమ రుతములఁ గులుకునపుడు
విమలమౌ నీహృదంతరాళమున నెన్ని
యెన్నియూహలు తట్టునో యెవరి కెఱుక ?
కలికి చూపుల నెంత రాగంబు గలదొ
వెలఁది నవ్వులలో నెంత చలువగలదొ
విరిశరంబులలో నెంత చుఱుకుగలదొ
కాంచి తెలుపంగ వలఁతివీ కవివెగాదె !
సమయ సముచిత నవరస స్యందనమున
హృదయకేదారముల నెల్లఁ బదనుచేసి
లలిత నీతి బీజంబులఁ జిలుకరించి
మొలకలెత్తింపఁగాఁ గృషి సలుపుమయ్య !
నీతితత్త్వబోధకుఁడవై నెగడునపుడు
తోఁచి నన్నితోవల నీవు త్రొక్కవచ్చు
లేదు నిర్బంధమనఁగ నీలేఖినికిని
కలదుగాదె " నిరంకుశాః కవయ " యనుట ;
వెలయు ప్రకృతికిఁ బరిమితి కలదుగాని
భావనాప్రకృతికి లేదు పరిమితి భువి

భావవీథి యనంతమై పరగుఁగాన
వివిధగతులఁ జరింతువీ కవివరేణ్యా!
నిస్తులంబగు నీలేఖనీముఖంబు
కలుషపూర్ణమషీరస కలితమయ్యు
నవరసంబులఁ జిల్కుచున్నది సతంబుఁ
గృతుల చేపట్టుగలవారి కేమికొఱఁత?
నీమనోభావముల నెల్ల నేర్పుమీఱ
నక్షరాకృతి విలసిల్లు నట్లుచేసి
మనసువెంబడి నీదులేఖిని చరింపఁ
గలదుగావునఁ గవితపైఁ దలఁపుఁజేసి
ప్రకృతితత్త్వరహస్య నిర్ణయముచేసి
యఖిలవస్తుగుణంబుల నవధరించి
వివిధరూపస్వభావముల్ విశదపఱచి
దేశకాలపాత్రంబులఁ దెలియఁజెప్పి
సనయ దుర్నయగతుల బోధనము చేసి
కష్టసుఖసంతతుల నెల్ల గణనఁజేసి
పాపపుణ్యకర్మంబులఁ బరిగణించి
యనుపమపవిత్ర చరితంబు లనువదించి
సకలవిద్యుక్తధర్మముల్ సంతరించి
సర్వశాస్త్రముల్ బోధింపఁజాలఁగలవు

సర్వధర్మముల్ వివరింపఁ జాలఁగలవు
సర్వశక్తులు గలిగింపఁ జాలఁగలవు
సర్వశుభముల సమకూర్పఁ జాలఁగలవు
జగతి నీమాటమీఁదుగా జరుగుచుండు
జగతి నీచేత నన్వర్థ మగుచునుండు
జగతి నీచూపుతో (బ్రవనే చనుచునుండు
జగతి ధన్యుండనఁగ నీవె సత్కవీంద్ర!

(2-9-12.)

# 27 కావ్యగీతము.

సుకవి మూర్ధన్యభావబోధకములైన
లలితసూక్తుల నక్షరంబులుగఁ జేయు
నిస్తులంబైన వరలేఖనీముఖంబు
సుప్రసన్నప్రభావంబుఁ జూపుఁగాక!

---

రథ్యములఁదోలి దినరాజు రథముఁద్రిప్ప
మహీజనంబుల వడఁకించు మంచువిచ్చి
తరువరంబుల జీర్ణపత్త్రములదూసి
విశ్వమెల్లెడ నాశల వెలయఁజేసి
వత్సరముతోడ శిశిరంబు వదలిపోవ
విరిసరులతోడ నలరుఁ దెమ్మెరలతోడఁ
దలిరుఁగొమ్మలతోడఁ గోకిలలతోడఁ
గమ్మవుప్పొళ్లతోడ భృంగములతోడ
వల్లరులతోడ నిత్యోత్సవములతోడ
మేలిదినములతోడ యామినులతోడ
నల్లనల్లన మధుమాస మరుగుదెంచె;
నైననేమాయె శాశ్వత మైనదేది?

కాంచుచుండంగ నిదియును గడచిపోవు;
నిట్టి శిశిరవసంతంబు లేమిలెక్క?
యెన్నికల్పాంతరంబు లెన్నెన్ని యుగము
లెన్ని ఘం డ్లెన్ని యయనంబు లెన్ని ఋతువు
లెన్నినెల లెన్నిపక్షంబు లెన్నిదినము
లెన్ని రే లెన్నియామంబు లెన్నిగడియ
లెన్నినిమిషంబు లీరీతి నేఁగినవియొ?
వడివడిగఁబోవు కాలప్రవాహమందుఁ
బొడము సుడిగండములలోనఁ బడి మునింగి
పాంచభౌతిక వస్తుప్రపంచ మెన్ని
యెన్నిమార్పుల నందలే దింతదనుక?
ఎట్టయెదుటనో, వెనుకనో యెఱుకపడియొ
యెఱుకపడకుండనో భువి జరగిపోవు
చున్న యీపరిణామంబు లన్నిటికిని
మనము గనఁజాలు నానవాళ్లను లిఖించి
ప్రకృతి చూపుచునేయుండు వికృతలీల;
భౌతికంబైనయట్టి ప్రపంచమునకుఁ
గేవలాదర్శనంబె స్వాభావికంబు
గాని దానికి, మనమంతగా గ్రహింపఁ
గలమొ లేమోయనెడు శంక గలుగఁబోదు;

అరయఁ గావ్యప్రపంచంబునందుఁగూడ
నట్టి కాలాతిపాతంబు లట్టిమార్పు
లట్టిచిహ్నంబులే పొడకట్టుచుండు ;
నైనను బ్రదర్శనంబున యందె కాక
బోధనంబునఁగూడఁ బ్రబుద్ధమైన
దగుటఁ గావ్యంబె వరణీయమగునుగాదె?
పరమమైనట్టి కావ్యప్రపంచమందు
దర్శితములైన ప్రికృతిచిత్రంబులెల్లఁ
గాలవాహిని వడిలోనఁ గలసిపోక
యుండు నప్పటి కెప్పటి కొక్కగతిని ;
నగరరాజమయోధ్య యెన్నటిదొ? పుణ్య
వనగిరి నదీనదంబు లెప్పటివొ? సేతు
కలనమేనాఁటిదో? మహాజలధిలోని
లంకయెప్పటిదో? నిష్కళంకుఁడైన
మేటి శ్రీరామచంద్రుఁ డేనాఁటివాఁడొ?
పరమసాధ్వీమహీజ యెప్పటిదొ? ఖలుఁడు
పఙ్క్తికంధరుఁ డెప్పటివాఁడొ చూడ
నాస్థలంబులు మున్నటియట్లలేవు ;
తెలుపు నాకాలమంతయుఁ దిరిగిపోయె
నాఁటివారొక్కరైన నీనాఁడులేరు

కాని తత్తత్స్వరూపలక్షణములెల్ల
నతుల కావ్యప్రపంచ చిహ్నితములగుటఁ
గావ్యమునఁ బూర్వమెట్లట్లె కాంచఁగలము.
ఉచితదేశంబులను దత్తదుచితరీతి
నుచితసమయంబులను దత్తదుచితలీల
నుచితపాత్రంబులను దత్తదుచితవృత్తి
నుచితభంగిఁ బ్రదర్శించి యుచితవచన
గతుల నుచితానుచిత ధర్మతతులనెల్ల
నెఱపి కావ్యప్రపంచంబు గఱపుచుండు.
ధర్మదేవతా నిర్మలోత్తమపవిత్ర
సుప్రసిద్ధానురూప వచోమధురిమ,
శ్రీరమారమణీమణీ చిరదయార్ద్ర
పావనాలోకనాతి ప్రభావపటిమ,
ప్రియసతీహృదయాంభోజ విలసదతను
భావనిస్తులనిశ్చల ప్రణయమహిమ,
మోక్షలక్ష్మీమనోజ్ఞ సముత్సుకప్ర
భాసమానాభినుత మందహాసగరిమ
మొల్ల నొకచోటఁ బడయంగ నెంతువేని
పడసి నెమ్మదినలరారఁ గడఁగుదేని
నలరి యనుభావములఁ జొక్కఁ దలఁతువేని

చొక్కి పరమార్థము గ్రహింపఁ జూతువేని
నలఘుతర దివ్యవస్తుసంకలితమైన
కలితగుణభావ వర్ణనాలలితమైన
లలితశబ్దార్థమధురసోచ్చలితమైన
చలదమేయాభినవరసోల్లలితమైన
సరసకావ్యంబు నొకసారి చదువుకొనుము!
తలుపుచాఁటున నిలుచుండి తమివెలార్చు
వలపుటిల్లాలి నునుముద్దు పలుకుపోలె
మెలపునం జేరి కౌఁగిట నలముకొనిన
కలికిజవరాలి వగగుల్కు పలుకుపోలె
నలసి యలయించి తలపించు నలవెఱింగె
కులుకుప్రోయాలి నెఱనీటు పలుకుపోలె
నేది నీమానసము నెలయింపఁగలదొ?
యేది నీయాత్మ కానంద మీయఁగలదొ?
యేది తనతోడ నిన్నెనయింపఁగలదొ?
అట్టి సద్వస్తునిస్తులంబైనదాని,
నట్టి నవరసబంధురంబైనదాని
నట్టి పరమార్థసాధనంబైనదాని
నెఱిఁగి సత్కావ్యముగ గ్రహియింపుమయ్య!
మించు సంసారజలధి దాఁటించునావ

మంచిచెడ్డలగతు లేర్పరించుత్రోవ
మానసికరోగములనెల్ల మాన్పుమందు
మహితదీప్తికరంబైన మంచివిందు
సరసకావ్యంబుసనె నీకు దొరకఁగలదు.
పొదలు పరితాపమున మది చెదరునపుడు
దొరలు దుఃఖంబుననుదారి దోఁపనపుడు
వడఁకు నెమ్మేనికలసత వొడమునపుడు
జీవితమునందు నిస్పృహఁ జెందునపుడు
మదిఁగుదురఁజేసి, చల్లనిమాట చెప్పి
కలఁకనెడలించి, ధైర్యంబు గలుగఁజేసి
తల్లిదండ్రులఁబోలి, పెద్దలనుబోలి
యిష్టసఖుఁబోలి, ప్రాణనాయికనుబోలి
గురుజనముఁబోలి, వలయు నెల్లరనుబోలి
యెల్లవిధముల నీమేలునే ఘటింప
సదుపదేశంబు నీఁజాలునది తలంపఁ
గావ్యమునకంటె వేఱొండు గానరాదు.
అరసిచూడ నిరర్థకమగునయేని
నక్షరసమష్టియే పదమనఁగరాదు;
లోకహితలక్షణయుతంబు గాకయున్నఁ
బద్యగద్యాత్మకంబె కావ్యంబుగాదు;

హృదయభావంబులను వెలయింపకున్నఁ
గలముపట్టినమాత్రినఁ గవులుగారు ;
ఉచితగతి రసభావంబు లొప్పకున్నఁ
గవులు వ్రాసినదంతయుఁ గవితగాదు;
వరుసవెట్టి యష్టాదశవర్ణనములఁ
బెంచి వర్ణించి మ్రొక్కు చెల్లించుకొఱకె
ధరణి కాకాశమునకు సూత్రములఁగట్టి
తలతిరుగఁజేయు కల్పనల్ తార్చుకొఱకె
అస్వభావపదంబుల ననుగమించి
కడఁగి తడఁబాటుగాఁ గథ నడపుకొఱకె
తగనిచిక్కులఁబెట్టి బంధంబు లనుచు
నల్లిబిల్లిగఁ బద్యంబు లల్లుకొఱకె
గణయతిప్రాసముల గట్టిగాఁ గుదించి
పద్యములలోనఁ బద్యముల్ పన్నుకొఱకె
ఓష్ఠ్యమస్పర్శకంబు నిరోష్ఠ్యమనుచుఁ
ద్ర్యక్షుంద్వ్యక్షరైకాక్షరంబులనుచుఁ
బ్రాసగతులంచు శబ్దచిత్రంబులనుచు
సర్వగురులఘువర్ణ ప్రసారమనుచు
వ్యర్థవాక్యావళీ విడంబనముకొఱకె
వ్రాయఁబడినవియెల్లఁ గావ్యంబులగునె ?

అర్థములతోడ వాక్యంబు లమరుచుండఁ
జిత్తముఁ గరంచుగతి ధ్వనుల్ సెలఁగుచుండ
భావము సెలంగ రస ముట్టిపడుచునుండ
సమయసముచితవర్ణనల్ సాగుచుండఁ
బాత్రరూపంబు లెదుటఁ గన్పట్టుచుండఁ
దత్తదుచితస్వభావముల్ తేట్టుచుండ
సరణి విడకుండఁగాఁ గథ జరుగుచుండఁ
బాఠకుల మానసములలోఁ బడఁగఁ జేసి
నిశ్చయజ్ఞానగరిమ నందింపఁ జేసి
పాత్రపాఠకతతి నైక్యపడఁగఁ జేసి
మోదమో, ఖేదమో, కష్టమో, సుఖంబొ,
ధైర్యమో, దైన్యమోయద్భుతంబొ, భయమొ
కోపమో, యీర్ష్యయో, మోహతాపభరమొ
యనుభవింపంగఁ జేసి యయ్యదనులందు
నెల్లధర్మంబు లక్షరాకృతిగఁ జేసి
హృదయఫలకంబులందుఁ జిత్రింపఁ జాలు
నట్టికావ్యంబె సత్కావ్యమగు నిజంబు.
కలిత గంగాప్రవాహావగాహనమున
గాత్రము పవిత్రమై కాంతిఁ గాంచినట్లు
అనుపమానప్రభావ దివ్యాంజనమున

నేత్రములు నిర్మలంబులై నెగడినట్లు
కమ్రితరశాణయంత్ర సంఘర్షణమున
జీవమణిదీప్తమై విరాజిల్లినట్లు
పటుతరానలసంపుట పాకకలనఁ
గనకముత్తప్తమై వన్నెఁ గన్నయట్లు
సరసకావ్యరసామృతాస్వాదనమున
హృదయసీమ పవిత్రమై సదమల మయి,
దివ్యమై, తీక్ష్ణమై, సముద్దీప్తమగుచు
నిశ్చలానందపదవి నందించుచుండ
నీనరుఁడు కోరఁదగిన దింకేమిగలదు ?
విధివిధానంబు లెప్డు భావింపఁబోము
పరికృతినూత్నంబు గరమునఁ బట్టఁబోము
విశ్వమనియెడు కావ్యంబు విప్పఁబోము
అంతరాళంబులోనున్న దరయఁబోము
కాంచెదము నిన్నె కావ్యమా! కన్నులార
వినియెదము నిన్నె సతతంబు వీనులార
చదివెదము నిన్నె నోరూరఁ జవులు దేర
మననమొనరించెదము నిన్నె మనసుదీరఁ
గడఁగి ధర్మార్థకామమోక్షంబులనెడి
పూరుషార్థచతుష్కంబుఁ బొందఁజేసి

యనితరజ్ఞాన సంపద నందఁజేసి
మమ్ముఁ జరితార్థులను జేయుమా సతంబు !
(10-1-13.)

---

## 28 ప్రేమ.

ప్రేమమున లోకముదయించెనేమొ ? కాక
ప్రేమమే లోకమునఁ బుట్టెనేమొ ? కాక
ప్రేమ లోకమయంబయ్యెనేమొ ? కాక
లోకమే ప్రేమమయమై వెలుంగునేమొ !
ఏమయిననేమి, కొంచె మూహించిచూడఁ
బ్రేమమయుఁ డీశ్వరుఁడు; సృష్టిప్రేమమయము
ప్రేమమయులెల్ల జీవులు ప్రేమయొకటె
పావనంబైనదని బోధపడుచునుండె.
అంతరంగమునిండి తొలఁకాడునేది ?
యితరభావంబులను చొరనీని దేది ?
కష్టసుఖముల భేదంబుఁ గనని దేది ?
ప్రతివిధానంబునకు నాసపడని దేది ?

యవిరతానందదాయకమైనదేది ?
యదిగదా యుత్తమోత్తమమైనప్రేమ.
అట్టి ప్రేమంబునకు విష మమృతమగును ;
కాలకాకోదరము పూలమాలయగును;
దారుణారణ్య మభినవోద్యానమగును;
జ్వలనకుండంబు చందనకలశమగును ;
బండఱానేల యరవిరి పానుపగును ;
మండువేసవియెండ రేయెండయగును ;
మృత్యుదేవత పరమాప్త మిత్రిమగును;
అట్టి ప్రేమప్రకాశంబు నెట్టయెదుట
నట్టి ప్రేమసుధావృష్టి యెట్టయెదుట
నట్టిప్రేమ ప్రతాపాగ్ని యెట్టయెదుట
నట్టి ప్రేమౌషధరసంబు నెట్టయెదుట
నట్టి ప్రేమమృగేంద్రింబు నెట్టయెదుట
నట్టిప్రేమ గరుత్మంతు నెట్టయెదుటఁ
గలుష కామాంధకారంబు నిలువఁగలదె ?
నిర్గతక్రోధదావాగ్ని నిలువఁగలదె ?
ఖలవిలోభపతంగంబు నిలువఁగలదె ?
నీచమోహవికారంబు నిలువఁగలదె ?
నిష్ఠురమదోన్మదేభంబు నిలువఁగలదె?

నింద్యమాత్సర్యవిషఫణి నిలువఁగలదె—
భవ్యమగునట్టి ప్రేమ ప్రపంచకమున
కమరపట్టణ మొకపల్లెయైనఁ గాదు;
హద్దులేనట్టి ప్రేమ రసాలయమున
కంబునిధి యొకశీకరమైనఁగాదు.
వేయుఁగన్నులవెలయు నాప్రేమగతులఁ
గన్నుఁగవతోడ నెవ్వాఁడు గాంచఁగలఁడు?
తూరుపునఁబుట్టి మిన్నెక్కి తొంగిచూచి
యబ్ధిఁబొంగించి కువలయ మలరఁజేసి
కమలజాండకటాక్షంబుఁ గలయఁబ్రాఁకి
చలువలను గ్రుమ్మరించి ప్రశాంతినెసఁగు
పావనప్రేమచంద్రికా పటలమందు
నెంతయమృతంబు గలదొకో యెవరికెఱుక?
యెంత మాధుర్యమున్నదో యెవరికెఱుక?
యెంతలావణ్యమున్నదో యెవరికెఱుక?
యెంతయానందమున్నదో యెవరికెఱుక?

(25-4-13.)

---

# 29 నిర్వేదము.

కాలకూటవిషంబును గంఠమందుఁ
దాల్చి శితికంఠుఁ డయ్యె సదాశివుండు
కాళియోరగ విషవహ్నిఁ గాఁగుకతన
నల్లవాఁడయ్యె గోపాలనందనుండు
విషము భూషణమనియెంచి వెఱ్ఱినైతి
విషము కన్నులలోనుంచి వెఱ్ఱినైతి
విషము దిగమ్రింగఁజాలక వెఱ్ఱినైతి
విషము తలఁదాల్చి నిలువున వెఱ్ఱినైతి
ఈవిషంబును భరియింప నేది తెరువు
విషము హరియించుటకు వేఱువిషములేదె?—
విషము విషమునహరియించు వేళదాఁక
విషపువిఱుగుడు దొరకెడు వేళదాఁక
విషపుమంత్రంబు సదివెడు వేళదాఁకఁ
దాఁచుపాములబుట్ట నాతల నిదేల ?
ఫణిఫణంబున నొక దివ్యమణినిగాంచి
నెత్తిపై నాశతో దీని నెత్తుకొంటి;
త్రాఁచు బుసకొట్టి విసములఁ గ్రక్కుచుండె
నీవిషాగ్నిని నే భరియింపఁగలనె ?

బుట్టలోనుండి తలమీఁదఁ బొడిచె నేదొ
ఉన్నయది పాముగాక యేమున్న దింక—
అవశమగుచుండె నాయొడ లక్కటకట!
బుట్టనెట్టులు భరియింతుఁ బుట్టిమునిఁగెఁ
గానుకగ దీని నేమంత్రగానికిత్తు?
పాముమంత్రంబు నేర్చిన ప్రాజ్ఞుఁ డెవఁడొ?
తెలివిలో వానిఁ గానక తిరిగితిరిగి
విశ్వమంతయు వెదకుచు వెఱ్ఱినైతి.

(5-5-1913.)

## 30 కౌతుకము.

ఆకసంబున నెల తోఁచినంతమాత్రఁ
జుక్క హృదయాంతరంబునఁ జొచ్చు టేల?
మినుకుమినుకుమటంచును మెఱయు టేల?
మెఱసి లోలోననే యస్తమింపకుండఁ
బొంగిపొరలుచుఁ గన్నులఁ బొడుచు టేల?
చుక్క పొడిచిన తావెంత చక్కనిదియొ?
నెలకుఁ జుక్కకు నేపాటి నెలవు కలదొ?
కన్నులనువిప్పి కన్నవా రున్నవారె?

(19-5-1913.)

# 31 రాధ.

ఎచటఁజూచినఁ గనులున్నవేమొ నాకు
నెచటఁజూచినఁ జెవులున్నవేమొ నాకు
నీవె కానంగఁబడుచుంటి వెల్లయెడల
వినఁబడుచునుండె నీపేరె విశ్వమందు
నిన్నుఁ బొడఁగానకుండ నే నున్నవేళ
నగపడిన నాదుకష్టంబు లట్లె యుండె
మేఘమాలికపైఁ దోఁచు మెఱపుపోలెఁ
గష్టతతిమీఁద నాకు సుఖంబుదోఁచె
సుఖము కష్టాలమాటిచి సుఖమెయగునొ ?
కష్టములఁగూడి సుఖమును గష్టమగునొ?—
నీవె లోకంబుగా మదినెంచు నాకు
మతి చెదరిపోవుచుండె నీమాటలేక
హృదయదావానలము భరియింపలేక
కష్టతరమైన కాలంబుఁ గడపలేక
తల్లడిలునన్ను దయఁజూడఁ దలఁపరాదె
కృష్ణపక్షంబునను జంద్రరేఖపోలె
రాధ యిదె యున్నదిచట నీరాధ యిదిగొ—
మంజులంబేమొ చీఁకటిమాఁనిచిగురు ?

నిస్తులమనోహరంబేమొ నెమలికన్న ?
కుతుకదాయకమగునేమొ కొంచెగొంగు ?
దివ్యతమమేమొ యమునానదీజలంబు
కానిచో వీనిపైఁ బ్రేమ కలుగుటేల ?
అందమునకును బ్రేమింతువా మహాత్మ ?—
(16-5-1913.)

---

## 32 ప్రకృతిప్రబంధకర్త.

దేవదేవ ! మహాత్మ ! త్వదీయదివ్య
భావబోధకవిశ్వ ప్రబంధమందు
నెచట శ్రీరామచుట్టితి ? యెచటఁ జిత్ర
గింపవలెనని వ్రాసి ముగించినావు ?
మొదలు తుది లేని నీగ్రంథమును నతంబు
నెంతచదివిన, నెంత యూహించుకొన్న

నెవ్వ రీకావ్యమును రచియింపుమనిరొ
యెవరి కీకృతి నొసఁగితో యెఱుఁగరాదు.
సుమధురమనోజ్ఞ మృదుపదార్థములతోడఁ
బరిస్ఫుటప్రౌఢ రుచిరభావములతోడ
సలలితస్నిగ్ధసౌరభ శైలితోడ
నీప్రబంధంబు సర్వంబు నిండియుండె
నీప్రబంధంబె సర్వమై నెగడుచుండె
నిట్టిసత్కావ్యమును రచియించునూహ
మనను! యెప్పుడు కలిగినదయ్య నీకు?
ఆకసంబున నోంకార మైనయపుడొ?
విపులగతి రేఁగి వాయువుల్ వీచినపుడొ?
కీలికీలాకలాపుఁడై కెరలినపుడొ?
ఉదకము రసోత్తరంగమై యొదవినపుడొ;
భూతపంచకమై భూమి పుట్టినపుడొ?
మింటఁ జుక్కలు మిలమిల మెఱసినపుడొ?
ధరణి జీవులు కన్నులఁ దెఱచినపుడొ?
యెపుడు మొదలిడితో తెల్పుమీ మహాత్మ!
సర్వరక్షక మంగళాశాసనముగ
నీవు తొలుదొల్త వ్రాసిన నిరుపమాన
దివ్యగీతంబు నీదయాదృష్టిఁ జేసె

యేసుకృతిముందు గానంబు చేసినాఁడొ
యాతఁడేగద ధన్యాత్ముఁ డైననాఁడు.
సదయ ! సచరాచరప్రపంచమున జీవ
హృదయభావప్రబోధార్థ మెల్లయెడల
నెన్ని యెన్నిరీతుల బాసలున్నయవియొ
యన్నిబాసల నలరారు నఖిలమునకు
నఖిలమును నిండియున్న నీమూదికావ్య
మర్మగతిఁ బఠనీయమై యలరుచుండె.
అనఘ ! నీవచియించినయదియె వేద ;
మరయ నీవ్రాతలకు నెందుఁ దిరుగులేదు;
దివ్యలేఖిని నీకు స్వాధీనమయ్యె ;
గ్రంథకర్తలకును గ్రంథకర్త వీవు.
అమలతరమైన నీప్రబంధమునఁ దక్కఁ
దనుసుఖావహముగఁ జల్లఁదనముఁ గూర్చు
మలయమారుత మెచ్చోట మలయుచుండు ?
నేత్రపర్వంబుగాఁగ వెన్నెలలఁ గాయు
చందురుం డెందు వాహ్యాళి సలుపుచుండు ?
శ్రుతివిమోహనముగ దివ్యరుతులఁ దేల్చు
విహగసంతాన మేమెఁ వెలయుచుండు?
జిహ్వకింపగు రుచులచేఁ జెలఁగుచుండు

సరసవాహిను లెచ్చట జరుగుచుండు;
ఘ్రాణతర్పణముగను సుగంధమొసఁగు
కుసుమవిసరంబు లేకడ నెసఁగుచుండు?
కవులు నిన్ననుసంధించు కాంక్షఁజేసి
కావ్యములు వ్రాయుచుండు టొక్కటియె గాని
యూహకొలఁది వర్ణించుట యొకటెకాని
ప్రకృతిమర్మంబు గ్రహియించు పాటివారె?
ప్రకృతిమాయల కెందు లోఁబడనివారె?
ప్రకృతి కెల్ల నధీతుఁడౌ ప్రభుని నిన్ను,
బ్రకృతిఁ జేబ తిగాఁబట్టు ప్రభుని నిన్నుఁ
బ్రకృతిశాసన మొనరించు ప్రభుని నిన్నుఁ
బ్రకృతియందెల్ల నిండిన ప్రభుని నిన్నుఁ
నూహసేయుటకేని వా రోపఁగలరె?
వారు కవిజాతిలోఁ జేరువారె కాని
నిన్ననుసరించి వ్రాయఁగా నేర్తుమనుట
సాహసముగాదె కవిరాజ చక్రవర్తి!
అనుపమంబైన నీదుకావ్యంబు నిట్టు
లెట్టియోజనతో వెలయించినావొ
యెంత యోజించుకొన్న నావంతయైన
హృదయనయనంబులకు గోచరింపకుండె.

నేను దరియించుతెరువను నియతిఁగాని
యాత్మశక్తిని బ్రకటించు నాసఁగాని
లోకములు మెచ్చుననెడి లోలుపతఁగాని
నాకు యశమబ్బునను చింతనమునఁ గాని
యర్థసంగ్రహణాపేక్ష నందిగాని
యీమహాకావ్యమును రచియించినావె ?
జగములఁ దరింపఁజేయంగఁ జాలునీకు
నఖిలశక్తులకును మూలమైననీకు
సకలముఁ బ్రశంససేయంగఁ జాలు నీకు
లోకమంతట నిండి వెలుంగు నీకు
నందగారాని పరమార్థమైన నీకు
నుల్లమునఁ గోరఁదగిన దేమున్నదయ్య !
మేము నీకృతిఁ జూచుచున్నాముగాని
మేముఁ దన్మయలీల నున్నాముగాని
తెలిసినట్లుండి యేమియుఁ దెలియకుండెఁ
దెలియకుండియు నంతయుఁ దెలిసినట్లు
నటనమును జేయుచుంటి మనాథనాథ !
యెవరు నీకృతిమర్మంబు లెఱుఁగఁగలరు
దేవ ! యాద్యంతరహితమై దివ్యగతిని
భవ్యమైయొప్పు నీమహాకావ్యమునకు

నీవె వ్యాఖ్యాతవై ప్రౌఢి నెఱపకున్న
నెవఁడు వ్యాఖ్యానమును రచియింపఁగలఁడు ?
నీమహాకావ్యమహిమం బదేమొకాని
పూర్వసందర్భముల పొంతఁ బోవకున్నఁ
జదువ మొదలిడ్డ నెచటి కచ్చటికెపుట్టి
పొదలి రసభావములు పొంగి పొరలుచుండు;
నిట్టిమృదుశైలి నీకెట్లు పట్టువడెనొ
దేవ! యెవ్వరికేని బోధింపరాదె!
తాము వ్రాసిన యొక్కపద్యంబునైన
నొరుఁ డొకండైనఁ బఠియించుచున్న యప్పుడు
కవుల కెంతయానందమో కలుగునంట!
విశ్వమయ! విశ్వమందు నీవిపులకావ్య
మఖిలజీవులు గూడ నిరంతరంబు
నెంతొ సంతోషమునఁ బఠియించుచుండఁ
గాంచు నీకెంత యానందగరిమ కలదొ
కొలఁదివెట్టి వర్ణింపఁగాఁగలమటయ్య!
రమ్యగుణసాంద్ర! యోకవిరాజచంద్ర!
ఎన్నిజన్మాంతరంబులో యెత్తియెత్తి
యెచటదొరకిన నచ్చటనే గ్రహించి
యిమ్మహాకావ్యమును పఠియించుచుంటి

మార ! యెప్పటి కప్పుడే యభినవముగ,
నతిమనోహరముగ, సురసాశ్రియముగ,
సత్యముగ, సార్థకమ్ముగ, సమధికముగ,
సర్వజనసమ్మతమ్ముగా, సలలితముగ
ననుభవంబునకుం దోఁచునంతె కాని
వినుఁగోకింతయుఁ గలుగ దీవింతయేమొ !
కొక్కొరోయని తొలికోడి కూసినపుడు
తొలుదెసఁ బ్రభాతకాంతులు దోఁచినపుడు
కులుకుబెల్గునఁ బక్షులు పలికినపుడు
తరులతాదులఁ బూవులు విరిసినపుడు
తరుణభృంగాళి మొఱయుచు నరుగునపుడు
వెడలి ప్రత్యూషపవనంబు వీచినపుడు
పూర్వరాగంబు కుంకుమఁ బూసినపుడు
చివురులాకాంతి నైక్యంబుఁ జెందినపుడు
కూసి కోకిల కన్నెఱ్ఱ చేసినపుడు
పొడుపుఁగొండపై నెఱపొద్దు పొడిచినపుడు
తరణికిరణంబు లవనికిఁ దిరిగినపుడు
మెచ్చి తామరమొగ్గలు విచ్చినపుడు
బాలభానుండు మింటిపైఁ బ్రాకునపుడు
జరగినకొలంది నీడలు దరియునపుడు

తలకు సూటిగ దినమణి నిలిచినపుడు
తరలి పడమటిదెసఁ బ్రొద్దుతిరిగినపుడు
నానవిడి చాయ పెడమొగమైనయపుడు
నపరగిరి ధాతురాగంబు లలమినపుడు
నపరవారిధి మిలమిలలాడునపుడు
కనకకాంతుల నీరెండఁ గాయునపుడు
నిట్టి పవలంతయును దుదముట్టినపుడు
మిన్ను తనభాగ్యమణి దాఁచుకొన్నయపుడు
వెలుఁగుఁ జీఁకటియును గాక వెలయునపుడు
నఖిలజగతిఁ దమోలత లలమినపుడు
పొలుపుగా మింటఁ బూవులు పూచినపుడు
డాశలన్నియు నేకంబులైనయపుడు
మిణుగురుంబుర్వు లెగయుచు మెఱసినపుడు
నించుమించుగ నెల యుదయించునపుడు
వెలఁదివెన్నెలకుప్పలు విరిసినపుడు
నలుదెసలు చూచి కలకల నవ్వినపుడు
కలువపూవులనెత్తావు లొలసినపుడు
దేవ! యెక్కడవ్వాడా? దినదినమునందు
గాఢనిద్రను బొందిన గడియయేమొ
కాని నిక్కంబుగాఁ గలలోనఁగూడ

నవరసాశ్రయమగు నీయనంత కావ్య
గతులు సూచుచు నానందగరిమఁ గాంచి
చకువుకొనుచుందు మొకవింతచవులు దేవ.
చదివినకొలంది మాకు నోసదయహృదయ
దినము నీమీఁది భక్తి వర్ధిల్లుచుండు.
ప్రబలగౌరవమో యనిర్వాచ్యమైన
ప్రేమయో మాహృదయవీథిఁ బెరుఁగుచుండు
నేమహాకావ్యమును బఠియించునప్పు
డామహాకావ్యకర్తపై ననుపమాన
భక్తిగౌరవప్రేమముల్ ప్రబలుచుండు;
వదిగదా యుత్తమోత్తమమైనసుకృతి!
అట్టిమహిమంబు నీకావ్యమునందె కలదు,
అట్టి రచనాప్రశస్తి నీయందె కలదు,
కానఁ ద్రికరణశుద్ధిగా గౌరవించి
దేవ! నీమీఁదిప్రేమ వర్ధిల్లుకొఱకుఁ
బ్రవిమలజ్ఞానసంపత్తిఁ బడయుకొఱకు
నవ్యయానంద పరిపూర్తి నందుకొఱకు
నెపుడు నీకావ్యమే పఠియింతుమయ్య!
పరని మిటుసేయఁ జేయ నెప్పటికి మేము
దీని ముగియింపఁగలమయ్య! దేవదేవ!

ఇమ్మహాకావ్యజలధిలో నెంతకాల
మీఁది యవ్వలియొడ్డున కేఁగఁగలము?
ఈవలావలియొడ్డులం దెచటి కేనిఁ
గష్టపడి యెట్టులో చేరఁగలమయేనిఁ
దీరమునఁ గూరుచుండి నీదివ్యకావ్య
మహిమ యెంతటిదో యొక్కమాటలోనె
యింతలో నంతయును గ్రహియింపఁగలము.
కాని తొలిగాథ తెలియంగరాని మాకు
నవల నేమున్నదో చూచునంతకంటె
నాది గాంచుటకే యాస యధికమయ్యె.
సర్వభూతదయాపర సాధుహృదయ!
మాయభిమతంబుఁ దీర్పవే మాననీయ!
తావకీన మహాప్రబంధంబునందు
నాది సింహాసనంబుపై నధిగమించి
సర్వశక్తిస్వరూప ప్రసన్నమగుచు
ననుపమానాతిలోక రహస్య మగుచు
మూలకారణతత్త్వ ప్రబోధ మగుచు
నిర్మలానందవిజ్ఞాన నిలయ మగుచు
దాదులకు నాదియైన నీయాదిగీత
మెప్డు మపదేశ మొనరింప నెంచినావు?

ఎప్పుడు గానంబు సేయింప నెంచినావు?
ఎప్పుడు మాకభిముఖముగా నెంచినావు?
ఎప్పుడు పిలిచిన నోయన నెంచినావు?
అప్పుడు నీవేమి బోధింతువయ్య మాకు?
అప్పుడు కోరుట కేముందునయ్య మాకు?
అప్పుడు నీవలె రచియింప నగునుగాదె!
అప్పుడు నీవంటియానంద మగునుగాదె!
సచ్చిదానందమూర్తి! విశాలకీర్తి!

(8-11-13.)

# 33 సంవత్సరాది.

సకలసచరాచర ప్రపంచకము నరయు
నిరత మభినవముగఁ గానఁబఱచుచుండు
ప్రకృతికో పరమాత్మకో పలుకరాని
సర్వశక్తికి మా నమస్కారశతము.

---

మ. కలమా ! నీవిపు డేమివ్రాయుటకు సం
కల్పించితో ? నేఁటి నీ
కులుకుం జెయ్వులు మెచ్చకచ్చకలు మా
కున్ వింతగాఁదోఁచె ; ను
జ్జ్వలభావస్ఫురణంబునం దభినవ
ప్రాగల్భ్యముం జూపు నీ
జిలుగుంబంగరువ్రా లమోఘవిజయ
శ్రీకంబులౌఁ గావుతన్ !
అస్మదీయ మనోభావనానురూప
కామగామినీ ! యో లేఖనీమతల్లి !
చల్లచల్లగ నటునిటు జరగెదేల ?
తెల్లముగ మాకు నీజాడ తెలిపిపోమె.

నాయికానాయకుల నటనంబు లెల్ల
నిలమిఁ జిత్రింపఁగా మది నెంచలేదు;
వికృతసందర్శనాలాప విభ్రమముల
నలరు పురుషులఁ జూపింపఁ దలఁపలేదు;
జీవితం బంతయును దేశసేవఁ గడపు
పుణ్యులచరిత్రమును వ్రాయఁ బూనలేదు;
బవరమున జయలక్ష్మినో స్వర్గమునో
చూఱఁగొను వీరుల లిఖింపఁ జూడలేదు;
పరిథిత దేశభాషోపద్రవంబుఁ గూర్చు
తెంపరుల విమర్శింప నూహింపలేదు;
ఘనదురాచారపంక సంకలితులైన
కుమతులఁ దిరస్కరింప నాలోచనఁగలేదు,
అవని కపకారకారణులైనయట్టి
దుర్మదాంధుల దూషింపఁ దొడరలేదు;
పరిష్కృతితత్త్వాద్భుతగుణానుభవము గలుగు
ధీమతుల చిత్రగతులఁ జింతింపలేదు;
విపులవైరాగ్య నిష్ఠాపరివిష్టులైన
మౌనులమహత్త్వ మెఱిఁగించు మమతలేదు;
కాని, నవరసంబులకు నిధానులైన
యుండఱకు నాట్యరంగమై యొసఁగుచున్న

యిందఱకు నాశలను వెలయించుచున్న
యిందఱకు నూతనోత్సాహ మిచ్చుచున్న
యిందఱకు నొక్కరూపుగా నెదుట నున్న
యట్టి నూతనసంవత్సరాదిఁ గూర్చి
లేఖినీ! వ్రాయఁదలఁచుకోలేదె? చెప్పుమ!

* * * *

క. వ్రాయుము నిర్మలభావవి
ధేయమ్ముగ బుధజనాతిథేయముగ జగ
ద్గేయమ్ముగ లలితసుధా
ప్రాయమ్ముగఁ బాఠకశ్రవణపేయముగన్.

ప్రిమదమందానిలాంకూర పటలితోడ
లలితకుసుమపరీమళలహరితోడఁ
గలితనవమంజరీలతా గణముతోడ
నమితఫలపుష్ప ఘనతరు సమితితోడఁ
దనరు నుపవనముల, మహావనములందు,
నలరు పొదరింటి చల్లని నెలవులందు,
జలజ విలసిత కాసారతలములందు,
బలియు చక్కని పచ్చికబయళులందు
గొనఁగెడు మనోజ్ఞభావంబు నెంచుకొనుచు
ననితరానందలీలల నాడుకొనుచు

భ్రమరఝుంకారములతోడఁ బాడుకొనుచుఁ
బ్రకృతిచిత్రంబులను గానఁబఱచుకొనుచు
వనరమంగూడి క్రీడింప వచ్చినట్టి
తరుణసుందరమూర్తి మాధవునిఁ గూడి
వచ్చినది నేఁడు నూతన వత్సరంబు.

*   *   *   *

అస్మదీయసుఖస్థితు లందుఁగాని
యలఘుతర కష్టకాలంబులందుఁ గాని
యరనిమునమైన మము విడనాడకుండ
నీడపోలిక నెపుడు మాతోడఁ దిరిగి
కాలవశమున నేఁడు మాకను మొఱంగి
పూర్వవత్సర మెచటికో పోయె ననుచు,
దానితోఁగూడఁ దలచూపి దక్షిమఁగాంచి
పొదలు నాశాలతలు తెగిపోయె ననుచు
డెందములఁ గుందువడి దిగులొందనేల?
దానిపోలికనే పూని దానివెనుక
దాని సర్వస్వమునకు స్వత్వంబుఁగాంచి
దానియధికారమున నిల్చి దానిగతిని
కలసి మిమ్ములఁ దనవారిఁగా గ్రహించి
భావుకానోన్యబంధుసంబంధభావ

/

బోధకంబుగఁ దాని మిమ్ములను జేర
వచ్చినదిగాదె నూతన వత్సరంబు!
కాని, యొకచింత యున్నది! దాని నిదియు
దీని నదియును జూడఁగా లేనిగతికిఁ
దలఁచి తలఁచి విచారింపవలసినదియె.
కడచిపోయిన వత్సరగర్భమందుఁ
గలసిపోయిన సంస్థితిగతులయందు
జరగిపోయిన కార్యసంచయమునందు
మనసుపోయినచోఁ బోవఁజనును గాక,
మనకు నాస్థితి మరల రాదనుట నిజము;
మనము నచటికిఁ బోఁజాలమనుట నిజము.
ఏరు గతమున కొక యుపకారమైనఁ
జేయునది లేదు; కాన నాచింత మాని
హృదయముల నాశలను వెలయించుచున్న
యట్టి యీవర్తమానంబు ననుసరించి
యొదవనైయున్న భావిఫలోదయమున
కెదురుసూచుచు ముందుకుఁ బోవుదముగాక!
అనయు మెలమావి లేఁజిగురాకె మెసవఁ
దలఁపుఁగాంచుట కోకిల తప్పుగాదు;
ఎపుడు వికసించియేయుండ నిచ్చగించి

సంభ్రమించుట తప్పిదోసమ్ము గాదు;
ప్రకృతిసంబంధులగు జీవులకు సతంబు
భావ మాశార్ద్రిమగుట స్వాభావికంబు.
అవనతోన్నతగతుల కాశాభరతులె
కారణములని, పరిణామకాలమందుఁ
గష్టసుఖదాయకము లని కాంచి, వాని
నెవఁడు మొదలంటఁ దెగఁగోయ నెంచఁగలఁడు?
జీవులప్రచారములకు, నాశావకాశ
విస్మృతికి, వర్తమానభవిష్యములకు
ననిశసంబంధబాంధవ్య మమరుఁ; గాన
సాగిపోయిన పూర్వవత్సరముకంటె
నరుగుదెంచిన యీనూతనాబ్దమందె
యెల్లవారలకును బ్రేమ హెచ్చుఁగాదె!

* * * *

"క్రొత్త యొకవింత యని యెంచుకొనుటెకాని
జగతికిం గ్రొత్తయున్నదే? సాధులార!
పరగ దినములలోన మాసములలోన
నమరు ఋతువులలో నయనములలోనఁ
గాలములలోన నొక్కటే గతిని గాంచి
తెలఁగి చన్న ప్రమాదివత్సరముకంటె

నేఁగుదెంచిన యానంద మెంతగొప్ప?
జరగిపోయినయట్టి వత్సరమునకును
వచ్చి జరుగుచునున్న యీవర్షమునకు
నెంచి చూడంగ వ్యత్యాస మేమికలదు?
కాలగతికిని భేదంబు కలదె?"—యనుచుఁ
జెప్పుచుందురు కొందఱ అచ్చెరువుగాఁగ
విశ్వసింపంగఁజెల్లునే వీరిమాట?
కాలపరిణామముల కానవాలుసైచి
ప్రకృతి కన్నారఁగాఁ గనంబఱచుచుండఁ
దెలిసి యెవ్వారు కాదని పలుకఁగలరు?
అస్మదీయోక్తు లనృతంబు లందురేనిఁ
బ్రక్కమీఁదనె యటునిటు పడుటమాని
లలితగతిఁ బ్రాఁకుచుండు బాలకునిఁ జూచి
తప్పటడుగులఁ దిరుగాడు దారిమాని
పరువులెత్తుచునుండు డింభకునిఁ జూచి
జననిచెంగటనే యాడుకొనుట మాని
సకులతోఁగూడి యాడు కొండికనుజూచి
మంటిలో వ్రాసికొను నోనమాలు మాని
బాలబోధను చదువు శాబకునిఁ జూచి
చదువుసాములు నేర్చుకోఁ జనుట మాని

వలపుజవరాలిఁ జేరు జవ్వనునిఁజూచి
భవనమున భార్యతోఁ బ్లొంటిపాటు మాని
తనయులం గాంచు బిడ్డల తండ్రిఁజూచి
యంతయును నాదియని దోర్లు నాసమాని
ముక్తికై చూచు ముక్కాలి ముసలిఁజూచి
ముఖ్యముగ వారిదరి కేఁగి ముచ్చటించి
కాలగతికిని భేదంబు కలదో, లేదో
తిరిగిపోవక వలసినఁ దెలిసికొనుఁడు!

* * * *

నిన్న నేఁడును నొకరీతిఁ జన్ననైన
జీవులకుఁ గ్రొత్తయే చేసి పోవుచుండు.
రాజ్యములఁగ్రొత్త, సమయధర్మములఁ గ్రొత్త,
పాత్రములఁ గ్రొత్త, నెఱనడవడులఁ గ్రొత్త,
గుణములం గ్రొత్త, పలుపలుకులను గ్రొత్త,
వేసములఁ గ్రొత్త, యాచారవిధులఁ గ్రొత్త,
చదువులం గ్రొత్త, కవితారసములఁ గ్రొత్త,
దినదినంబును గ్రొత్తయై తనరుచుండు.
నూత్నజీవధర్మాసక్తి నూత్నశక్తి,
నూత్నవైభవసంపత్తి, నూత్నవృత్తి,
నూత్నమార్గానుగతబుద్ధి, నూత్నసిద్ధి

నూత్నభావోదయమునసే నూలుకొనును ;
గాన ప్రకృతియో పరముఁడో కరుణఁ జేసి
జీవులకు నూత్నమతి దయచేసియుంట
నిట్టిసంవత్సరాదు లెన్నేనిఁ జనిన
మనకు నీవత్సరాది నూతనమె యయ్యె.
నెల్లవారల హృదయముల్ పల్లవించె ;
మరల నాశాలతలు పూచి పరిమళించె ;
జనులకెలను నూతనోత్సాహ మొదవె ;
నవ్యభావోదయం బయ్యె నరులలోన.
జనుల జీవమానమున వత్సర మొకండె
యరయ సర్వప్రధానమై వఱలుఁ ; గాన
జీవితంబున నొకయేఁడు చెల్లిపోయె
ననుచుఁ బెద్దలు తమధర్మ మాచరింప,
వయసు వెలయింప నొకయేఁడు వచ్చెననుచు
నలరి బాలురు పెద్దల ననుకరింప,
నేఁడు గడచిన ఫల మింత యెఱుఁగలేమి
జడమతులు పండుగలె చేసి సంతసింప,
నందఱకు నన్నిరూపులై యవతరించి
యుత్సవముఁ గూర్చుచుండె సంవత్సరాది.
ఉదయభానుని కోమల మృదుకరముల

దరవికసితాబ్జినీనవపరిమళములఁ
జారు శీతలమంద సమీరణములఁ
గలవిహంగకలాలాప కలకలముల
నిట్టలంబుగ నాశలు నిండియుండె.
నేక్షణంబున గతవర్ష మిట్లుచనియె
నేక్షణంబున నవవర్ష మేఁగుదెంచె
నాక్షణం బెప్పు డేరీతి నరిగినదియొ
యెట్లు మాఱిచి మాఱెనో యెవ్వఁడెఱుఁగు?
జననమరణంబులకు నట్టిక్షణమె కలదు;
జాగరస్వప్నముల కట్టి క్షణమె కలదు;
ఆక్షణం బెట్లుగా మాయమైన నేమి?
గతవినూత్నవర్షములకుఁ, గాలగతికిఁ
దిరుగులేకుంటఁ జూపులు దొరకకున్నఁ
బ్రజల కిప్పుడు కలిగిన బాధయేమి?
ప్రభువనంతరమునఁ గుమారప్రభుండు
పైతృకపదం బధిష్ఠింప వచ్చినపుడు
లోకమునకును గలిగిన లోపమేమి?
కాని, గతమునకంటె నాగతముఁ గూర్చి
సంశయంబులు పుట్టుట సహజ మరయ.
"పూర్వవత్సర మేరీతిఁ బోయినదియొ

మరల రాకుంట దానికి మాన్పు లేదు;
మనల లోఁగొని, మనతోడ ననుగమించు
చున్న యీయేఁటిగతి యెట్లు లుండు?" నను చు
మనుజులకు సంశయముతోఁచు మాట నిజము.
ప్రజలజీవితము లను కావ్యములందు
వఱలు సర్గలవంటి వీవత్సరములు ;
జరగిపోయిన వత్సర సమితినెల్లఁ
జదివివైచిన సర్గల జాడ విడిచి
వానిలోఁ గన్న సుఖదుఃఖభావములను
నెడఁదలోఁ బెట్టుకొని యాత్ర పడెద వేల ?
వచ్చు సర్గను నేకతపట్టు గలదొ
చల్లఁగాఁ బత్త్రిముల విప్పి చదువుకొనుఁడు !

(10-2-1914.)

# 34 సంశయము.

ఎవని గతిభేదమునఁ జేసి యీజగంబు
వివిధపరిణామములతోడ వెలయుచుండు
నట్టికాలాత్మునకు నిరంతరునకు
ననితరాధీనగతికి వందనశతంబు.

---

నిత్యమై యద్వయంబయి నెగడుదాని
నాకృతి గుణాహ్వయాభావ మైనదాని
నాదిమధ్యాంతరహితమై యలరుదాని
నఖిలకర్మంబులకు సాక్షి యైనదాని
నఖిలశక్తులకును మూల మైనదాని
నఖిలపరిణామకారణ మైనదాని
నఖిలమును జూచి చూడనియట్టిదాని
నఖిలమును జేసి చేయనియట్టిదాని
నఖిలమును నంటి యంటనియట్టిదాని
నఖిలమగుదాని నవ్యయ మైనదాని
విమలవిజ్ఞానధనులైన విబుధులెల్ల
నైకకంఠ్యంబుగాఁ బరమాత్మ యనిరి;—

కాని యామూర్తి నేరిచేఁ గాంచవలెనొ
తెలిసి చూపఁగలేక యదృశ్యమనిరి;
పలికి బోధింపలేక నిర్వాచ్యమనిరి;
అతితరానుభవంబున నామహాత్ము
లేది పరమాత్మయని నిశ్చయించిరో
యావిశేషంబులెల్ల నీయందుఁ గూడ
నగపడుచునుండె నిదియేమి యద్భుతంబొ?
కాలమా! శాశ్వతత్వంబు గలదె నీకు?—
దైవమునకును నీకు భేదంబు గలదొ,
నీవె దైవంబొ తెలియంగ నేరకుంటి
నుగము గుర్తించుచునుండె నే మున్నదింక ?
నాత్మనిర్వృతి కెవ్వారి నాశ్రయింతు ?
నెవరి నడుగుదు సంశయం బెట్లుతీఱుఁ
గాలమా! యించు కాఁగుము కరుణతోడ
నాదుసంశయమును దీర్చి పోదుగాని—
అధికలోకానుభవయుక్తు లైనవారు
అనుభవంబున విజ్ఞాను లైనవారు
తెలిసికొన్నంత యడిగినఁ దెలుపువారు
ప్రకృతిలో ముందు నీకంటెఁ బడినవారు
పేరుగలవారు, నాకంటెఁ బెద్దవారు

పుడమి విడనాడి యెచటికో పోయినారు;
ఉన్నవారెల్ల నాకంటెఁ జిన్నవారె
యెవరి నడుగుదు? సంశయం బెట్లుతీఱుఁ?
కాలమా! యించుకాఁగుము కరుణతోడ
నాదుసంశయమును దీర్చి పోదుగాని;—
తల నరసియుండె; మేనిరక్తము హరించె;
చూపులు నశించెఁ; బలుగమి శూన్యమయ్యె;
నడుము లేవదు; కాళ్లకు నడకలేదు
శల్యములు సంధులను బాయు సమయమయ్యె.
నేను నీతోడఁ బరువెత్తలేను గాన
నేను గన్నార నినుఁ గానలేనుగాన
నాదువిన్నప మొక్కటియున్నయది గానఁ
గరుణ నీదీనమానవు మొఱ వినంగఁ
గాలమా! నీవాఁకించుక కాలమాఁగు!
నాదుసంశయమును దీర్చి పోదుగాని;—
తల్లియొడిలోనఁ జేరి తాతాయటంచుఁ
గాలు సేయి గదల్చుచుఁ బాలు ద్రావి
చిన్ని చిఱునవ్వు వెన్నెలల్ చిందువాఁడఁ
గన్ను లరమోడ్చి నిద్దురఁ గనుటె కాని
నీవు తారుట యే చూడనేరనైతి

నాఁటి యవ్యక్తజోలికాంతరమునుండి
నేఁటివఱకును మేలుకోనేరనైతి
నిపుడు నీవాంఛ గాక నా కేమికలదు?
కాలమా! యించుకాఁగుము కరుణతోడ
నాదుసంశయమును దీర్చి పోదుగాని;
వనవిహారంబులను జేయు వాంఛతోడఁ
గుసుమసౌరభములఁ గాంచు కులుకుతోడ
మలయమారుతముల మెచ్చు మమతతోడఁ
గోకిలాలాపముల విను కోర్కెతోడఁ
దమిఁ బ్రియాన్వేషణము చేయు తలఁపుతోనె
తెలిసితెలియనిరీతిని దిరిగితిరిగి
నావనంతంబు కడచనిపోవుచుండఁ
జోద్యముగ నంతయును జూచి చూడనైతిఁ
గాలమా! యించుకాఁగుము కరుణతోడ
నాదుసంశయమును దీర్చి పోదుగాని;—
మోహమృగతృష్ణ యొకవంక ముసరుచుండ,
విరహపరితాప మొకవంకఁ గెరలుచుండ,
వేఁడినిట్టూర్పు లొకవంక వెడలుచుండ,
నుష్ణసంకల్పరుచిరారుణోదయములు,
నప్రసన్ననిదాఘమధ్యంతనములు,

జాగరీకృత యామినీసముదయములు
జరగె నెన్నియొ నాగ్రీష్మసమయమందుఁ,
గాని నాకిష్టపు టూహ కలుగలేదు
కాలమా! యించుకాఁగుము కరుణతోడ
నాదుసంశయమును దీర్చి పోదుగాని ;—
శైరవశ్వాసము సంచరాంగంబుతోడఁ
జాఱువిస్రస్తవేలాసహాసంబుతోడ
మెలిచూపుల నగ్నాంగి లీల వచ్చి
సమునైకానంద బాష్ప వర్షంబు గురిసి
చల్లగా మేను మఱపించి సాఁగిపోయె
నతిచమత్కృతి నాదు వర్షావసరము
పోవువేళను దుఃఖాశ్రుపూరమయ్యె
నింక నితరంబు నాపది కెట్లుతోఁచు ?
తోఁచి యిప్పుడు ప్రశ్నింపఁ జూచుచుంటిఁ
గాలమా! యించుకాఁగుము కరుణతోడ
నాదుసంశయమును దీర్చి పోవుగాని ;—
జీవనకళంకమంతయుఁ బోవఁజేసి
మానసాకాశవీథి నిర్మలముచేసి
కలుషపంకంబు నెల్ల నింకంగఁజేసి
హృదయకమలంబు నలరించి పొదలఁజేసి

నాశరద్వాసరంబులు నడచునాఁడు
వివృతవేణిక యగు నదీవిలసనంబు
వెలువడుచునున్న యిసుకతిన్నెలతెఱంగు
కలసి యాడెడు రాయంచకవ బెడంగు
తనివిదీఱక నిరతంబుఁ గనుటకొఱకె
మఱగి నీమాటఁ దలపోయ నెఱుఁగనైతిఁ
గాలమా! యించుకాఁగుము కరుణతోడ
నాదుసంశయమును దీర్చి పోదుగాని;—
నలుగడల మంచుకావిరు లొలయువేళ
హంససంస్ఫూర్తి యత్యల్పమైనవేళ
దడదడంగూర్చి కంపంబు దొడరువేళ
ననలసాన్నిధ్యమును గోరునట్టివేళఁ
దమివిశేషించి యసుఖంబుఁ దాల్చువేళ
మదిఁ గలంగించు నాదు హేమంతవేళ
ముదుచుకొని కన్నులను మూసి గడపినాఁడఁ
గాని యావేళ నాముందుగతిని గూర్చి
క్షణము నేపైన నూహింపఁ జాలనైతి
నుగము ద్రుంకుచుండె; నేమున్నదింకఁ?
గాలమా! యించుకాఁగుము కరుణతోడ
నాదు సంశయమును దీర్చి పోదుగాని;—

నామనోరథగతికి భిన్నత ఘటిల్ల
శైశిరమువచ్చెఁ, బ్రకృతియసారమయ్యె;
జీవితలతాలవాలంబు జీర్ణమయ్యెఁ;
బాటవము తగ్గె నాకులపాటు దోఁచెఁ;
నాశ కింకను చిగిరించు నాశ కలిగెఁ;—
బతనశీలంబు లగు జీర్ణపత్త్రవితతు
లెల్లఁ దలపోయ మున్ను చిగుళ్లె కావె?
ముందు దలసూపఁబోవు నామోపు లెల్లఁ
బండుటాకులు గాకుండ నుండఁగలవె?
బెండువడి రాలిపడకుండ నుండఁగలవె?
ఇట్టి చర్వితచర్వణ మెందుకొఱకు?
ఇంతమాత్రాన కాసించు టెందుకొఱకు?
అట్టె తలసూపుచుండెడు నాచిగుళ్లు
పండి రాలెడు నీజీర్ణపత్త్రములును
నెచటివో యెటకేఁగునో యెఱుఁగరాదు
కాన నామార్గమంతయుఁ గట్టిపెట్టి
పుట్టుటయుఁ గిట్టుటయు లేని పట్టుకొఱకు
సుఖము దుఃఖము నెఱుఁగని చోటుకొఱకు
బంధమును మోక్షమును లేని పదముకొఱకు
వెదకుకొనుచుంటి; దానికై వెడలనుంటి

నగము గ్రుంగుచునుండె; నేమున్నదింక!
నాత్మనిర్వృతి కెవ్వారి నాశ్రయింతు?
నెవరి నడుగుదు; సంశయం బెట్లుతీఱు?
గాలమా! యించుకాఁగుము కరుణతోడ
నాదుసంశయమును దీర్చి పోదుగాని.

(15-6-1914.)

---

## 35 ఆనందమందిరము.

---

సీ. పులకించెఁ జూచితే పుష్పచ్ఛలంబున
శోభాయమానమై చూతలతిక
హసియించెఁ జూచితే కుసుమకైతవమున
జగ్గునిగ్గైన గోజ్జంగిమోక
కొనసాగెఁ జూచితే సనలెత్తుమిషమునఁ
జలువపందిరిమీఁది లలితవల్లి
తలయూచెఁ జూచితే వలిగాలినెపమున
పరువంబుఁ జిల్కుసంపంగిగున్న

చంద్రి! త్వత్పాలితంబైన చంద్రశాల
యభిద నానందమందిరం బగుటకతన
నేతదంగణోద్యాన లతాతరులకు
సంతతానందమగుటేమి సందియంబు!

సీ. జలయంత్రగళిత నిర్ఝరవేణికలయందు
కలకలధ్వని విను కాంక్షఁ జేసి
చెసల గమ్మనివించు కుసుమసౌరభములఁ
నాఘ్రాణమొనరించు నాసఁ జేసి
అమృతంబు మఱపించు నమలఫలంబుల
మాధుర్యమును గాంచు మమతఁ జేసి
ఆలోక రమణీయమైన నీయుద్యాన
వనము నాలోకించు వాంఛఁ జేసి
దేవతాగణములతోడ దివ్యపురుషు
లతితరానందహృదయులై యరుగుదెంచి
చంద్రి! నీప్రమదావనసద్మమునను
చిత్రములువోలె నిలిచి రచ్చెరువుగాఁగ!

సీ. సురభిళ కుసుమ సంశోభితంబగుదాని
నాఘ్రాణతర్పణం బైనదాని
పల్లవగౌరవాస్పద వైభవముదాని
నానందదాయక మైనదాని

కోమలతరులతా శ్యామలంబగుదాని
నాలోకరమణీయ మైనదాని
పరిణతమాధురీ ఫలపూర్ణమగుదాని
నాకల్పితాభీష్ట మైనదాని
చలువగలదానిఁ జెలువంబు లొలుకుదాని
మలయవాయుచ్ఛలంబునఁ గులుకుదాని
తావకానంద మందిరోద్యానపాళిఁ
గాంచి యెంతని వర్ణింపఁగలము చంద్ర !

(20-1-1915.)

# 36 సంకల్పసోపానములు.

అసుగువెట్టక పరువెత్తు నట్టిశక్తి
పక్షివిక్షేపమే కానఁబడకయుండ
నంతరాళాన నెగిరెడు నట్టిశక్తి
రూపమెఱుఁగక యెన్నియో రూపములను
నఖిలజగముల విహరించు నట్టిశక్తి
కానఁగారాని కాలంబుఁ గాంచుశక్తి
అఖిలశక్తులఁ జేపట్టు నట్టిశక్తి
చూడఁగారాని తావును జూచుశక్తి
పడసియుండియు మాయలోఁబడి మునింగి
లీల సంకల్పసోపాన పాళియందు
గంతులిడుచును విహరించు కర్మమేమొ
మనస! మఱవక నాకొక్కమాట చెపుమ!
చిటికలోన సౌధాంతరసీమలందు
మెత్తనగు పట్టుపఱపులమీఁదఁ జేరి
యెలమి నొకచెలి వీడియ మిచ్చుచుండ,
నొకవిలాసిని చిఱునవ్వు లొలుకుచూపు
లలర వింతగ ముచ్చటలాడుచుండ,
నొక్కభామిని కోపించి యోరచూపు

తూపులను గుప్పించుచుండంగ, గోపుమీఁఱ
సేవకప్రజ లెందఱో చేరికొలువఁ
దిరుగుచుంటివి నిన్ను నీవెఱుఁగకుండ;
ఉత్తరక్షణమందె నీవొక యగాధ
జలధిలోఁబడి జలచరసముదయంబు
పట్టి బాధించుచుండంగఁ బ్రాఁకికొనుచుఁ
దిరిగి యెటుపోవుటకు దారితెన్నులేక
తీర మెందున్నదో కాంచు తెలివిలేక
జలధిలో నీఁదులాడెడు శక్తిలేక
మీఁద నేమున్నదో చూచు మెలపులేక
మునుకలిడుచును గ్రిందికిఁ బోవుచుంటి
వెందు సుఖమున్నదో, దుఃఖ మెందుఁగలదొ,
మనస! మఱవక నాకొక్కమాటు చెపుమ!
అరయఁ బరిణామమున దుఃఖమగున దేదొ?
సుఖమగున దేదొ? సుఖదుఃఖసూత్రమగుచు
బ్రిప్పలను బెట్టునదియేదొ? చెప్పఁగదవె!
మింటి మబ్బుచాయలనుండి మెఱుపుఁదీవ
సోయగముమీఁఱ నిటు తొంగిచూచువేళ
వాయుసంరంభమున మహావార్ధిపొంగి
రంగదుత్తుంగభంగానుషంగమయ్యె;

నుదరి ఘనతరులొఁదల లూఁపనయ్యెఁ;
గొమ్మ లదిగాంచలేక సంకోచమొడలి
యొడలు తెలియని కంపంబు నొందనయ్యె;
కటకటా! యిట్టివింతలగాలివాన
రేఁగి యుప్పొంగుచుండ నూరేఁగుతలఁపు,
నఖిలలోకంబులను ముంచునట్టి వరదఁ
గానఁబడని సంకల్పసోపానములను
జరణముల నానకుండంగఁ దిరుగు తెగువ
యేమిటజనించెనో, యది యెందుకొఱకొ?
పరువులెత్తుట మాని లోఁ గరుణనూని
మనస! నవ్వక నాకొక్కమాఱు చెపుమ!
రమ్యతరమార్గములను నిరంతరంబు
నీసుఖావాప్తికే వేళ నేఁ జరింతుఁ
బ్రకృతిలోఁ గానఁబడుచున్న వస్తువులను
నీవు సంతోషపడుటకై నేను గాంతు
ఫలరసాదిక సదమల భక్ష్యములను
నీవు సంతృప్తిఁగనుటకై నేభుజింతు
ఘనముదావహమోహన గానరవము
నీవు హాయిని జెందంగ నేను విందు
నెప్పు డెయ్యది చేయ నీకిష్టమగునొ

యప్పు డాపనిచేసెడు నట్టి నన్ను,
నిన్ను వీడినఁ గొయ్యారాచున్న నన్ను
నిన్నుఁ బ్రాణంబుగాఁ జూచుచున్న నన్ను,
మొఱఁగి యెచటికిఁ బరువునఁ బోవుచుంటి?
వాకసంబున నిలువకే యరుగుచుంటి?
పుడమిఁ గాలూనకే పాఱిపోవుచుంటి?
దశదిశలయందు మెల్లగాఁ దారుచుంటి
వంతరాళంబులోఁ జేరి యాడుచుంటి
వేపదార్థంబుకొఱకు నీవింతగాఁగ
వెదకులాడుచునుంటివి విశ్వమందుఁ?
బరువులెత్తుట మాని లోఁ గటుదాసూని
మనస! మఱవక నాకొక్కమాఱు చెప్పుమ!
లీల మెయి గాలినాడఁ దూలికవుగావు
కాని, చిటికలోఁ గృతకపక్షములవిచ్చి
పక్షివలె నాకసంబునఁ బాఱుచుంటి
వేఁగుచుండెడి సద్దొక యింతలేక
కనుఁగొనుటకైనఁ గన్నులఁ గానరాక
మించి ముల్లోకముల సంచరించుచుంటి
వెట్లుపోవుచునుంటివో యెఱుఁగనికి
నెచటి కేఁగుచునుంటివో యెఱుఁగనికి

నెందులకుఁ బోవుచుంటివో యెఱుఁగకునికి
నీదురూపిట్టిదని కాంచనేరకునికి
నీదుసంకల్ప మెఱుఁగంగ నేరకునికి
నచ్చెరువునంది యొకమాట యడుగుచుంటి
బరువులెత్తుటమాని లోఁ గరుణనూని
మనస ! నవ్వక నాకొక్కమాఱు చెపుమ !
సతతమును నీదు సంకల్ప జగతిలోన
ధనము, ధాన్యంబు, వస్తువాహనచయంబు,
నెచ్చెలులు, సేవకులు, రమణీజనంబు,
రమ్యమందిరవితతు, లారామములును,
కేళికాసరోవరములుఁ గృతకగిరులు
నాకసంబును జంద్రసూర్యగ్రహములుఁ
దారకారాజి, దిక్కులు ధరణితలము
సకలము బహిర్జగంబున జరుగునట్లె
యగపడుచునుండె నిదియేమి యద్భుతంబొ ?
నీజగమునకు మాతృక యీజగంబొ,
యీజగమునకు మాతృక నీజగంబొ ?
రెంటికిని భేద మరయలేకుంటి మహహ !
నీజగము సత్యమో, కాక యీజగంబు
సత్యమో, కాక రెండు వాస్తవము లగునొ

అట్లుగాక రెండును నసత్యంబు లగునొ?
కనులు విప్పి యోజించినఁ గానఁబడెడు
నొకటి, కనుమూసి యోజింప నొకటిదోఁచు
నట్టి ఘనశక్తి యీరెంటియందె కలదొ
కాక నీయందె కలదొ నిక్కంబుఁ దెలియఁ
బరువులెత్తెడుమూని లోఁ గరుణమూని
మనస! మఱవక నాకొక్కమాటఁ జెప్పుమ!

(19-3-1915.)

---

## 37 నక్షత్రము.

తలను బైకెత్తి కన్నుఱెప్పలను విప్పి
కనుబొమలనెత్తి ఫాలంబు గదియఁజేర్చి
ఘనతరాద్భుతదృష్టితోఁ గాంచుచున్న
నన్నుఁ గన్గొని నవ్వుచున్నావొ, కాక

నవ్వుచుండుటయే నీకు నైజగుణమొ
ఆశలను నిండియున్న యాకాశమందు
మినుకుమినుకుమన్కాంతితో మెఱయుచున్న
చిన్నినక్షత్రమా! నాకుఁ జెప్పఁగదవె—
జననమరణానుసారమై జరుగుదాని
బుణ్యపాపానుభూతమై పొల్చుదాని
సౌఖ్యదుఃఖాన్వితంబై యొసంగుదాని
క్షణిక పరిణామశీలమై సాగుదాని
బ్రకృతిఁగని దాని మాయలోఁబడి మునింగి
యొడలెఱుంగక కాలంబుఁ గడపుచున్న
నన్నుఁ గన్గొని నవ్వుచున్నావొ కాక
నవ్వుచుండుటయే నీకు నైజగుణమొ
చిన్నినక్షత్రమా! నాకుఁ జెప్పగదవె!

(25-5-1915.)

# 38 సంతుష్టి.

ఏమహావృత్తి చిత్తమం దెనసి యున్న
నిఖిలజగముఁ జిదానందనిలయ మగునో
యట్టిసుఖజీవితాలంబ హైమయష్టి
యైనసంతుష్టి నిరతంబు నాశ్రయింతు.

---

మంజులం బైనయీరాజమార్గమందుఁ
జరణములఁ దాఁకుకర్కశాశ్మములు గాని
పదములం గ్రుచ్చుకొనుముండ్లపొదలు గాని
తవిలి బాధించుక్రూరజంతువులు గాని
కలికమున కైన నెం దైనఁ గానఁబడవు
తొలకరి నెలర్చి పొదలుశాద్వలముకంటె
నామనిం దోఁచుతొలిచిగురాకుకంటెఁ
బట్టుపూవులమెత్తనివఱుపుకంటె
నతిమృదుల మైనయవ్విమలాధ్వమందు
నల్లనల్లన హాయిగా నడుగు లిడుచు
నెంతదూరంబు నడచిన నేమిభయము?
నిరత మాత్రోవఁ జరియించు నరవరులకు

శీతవాతాతపంబుల భీతి లేదు
కాలగతిభేదములచేతఁ గలుగుచుండు
నట్టిదుస్పృహాకష్టంబు లందులేవు
భగ్గునను మండునెండపవళ్లు లేవు
కాలునింబోలు చీకటిరేలు లేవు
దురితభయ మేది బాధించు దోపుకాండ్రి
మొదల నమ్మించి విడనాడు మోసకాండ్రు
పొదివి యదలించు నెఱతాగుఁబోఁతుకాండ్రి
కానరా రొక్కరైన నాఘనపథమున
సుగమమై శుభ్రమైన యా సుపథమునకు
నిరుగడల నున్నవనలతాతరులనుండి
మెల్లమెల్లన పిల్లతెమ్మెరలతరఁగ
లొలసి పాంథులకును హాయి నొసఁగుచుండు;
ఆపథంబున కిరువంకలందు బలిసి
కనులఁ దనియించురమ్యోపవనములందు
నలరుకమలాకరము లమృతాకరములై
క్రముభూజలతావళుల్ కల్పకములై
సురుచిరలతాంతమంజరుల్ సురభిళములై
సరసఫలగుచ్ఛములు సుధాసారకములై
యచట నెప్పుడు విహరించునట్టివార

లెన్నుకొని కోరఁదగిన దేమున్న దింక?
నచటినెలవులఁ బదచారి యైనవాఁడు
పైఁడిగాఁడీలకై తూలి పడఁగఁబోవఁ
డచటిప్రాసాదరిండ్లలో నలరువాఁడు
భర్మహర్మ్యాళికై మిట్టిపడఁగఁబోవఁ
డచటిచివురాకునునుసెజ్జ ననఁగువాఁడు
పట్టుపఱపులకై ప్రియం బడఁగఁబోవఁ
డచటిప్రాఁదీవచెలువల నత్తువాఁడు
వలపుటింతులకై వేడ్క పడఁగఁబోవఁ
డచటిఫలభోగములకు లోనైనవాఁడు
పంచభక్ష్యంబులకుఁ గోర్కి పడఁగఁబోవఁ
డచటికమలాకరములనీ రానువాఁడు
పరిమళాసవములఁ జొక్కవడఁగఁబోవఁ
డచటిప్రకృతిచేఁ బరిచర్య లందువాఁడు
పరిజనంబులకొఱ కిష్టపడఁగఁబోవఁ
టచటిదివ్యపదార్థాఢ్యుఁ డైనవాఁడు
భవ్యరాజ్యంబులకు నాసపడఁగఁబోవఁ
డిన్ని యననేల యట్టిసర్వోన్నతుండు
సకలసుఖదుఃఖసన్నివాసంబులైన
కోరికలనెల్ల నొకమూలఁ గూలఁద్రోసి

యగపడినదెల్ల సుఖమయం బని తలంచు
సర్వభూతదయాళుండు సర్వశక్తి
సర్వలోకశరణ్యుండు సర్వసముఁడు
శాశ్వతానందుఁడైన సర్వేశ్వరుండు
తాను సర్వజ్ఞుఁ డగుట నంతయును దెలిసి
సర్వజగముల సృజియించు సమయమందె
సర్వజీవులకును నపేక్ష్యంబులైన
సర్వవస్తువు లందందు సంతరించి
కొదవ లేకుండఁగా సమకూర్చి యుంచి
యెట్టు లెవరికిఁ దగు నట్టు లిచ్చి యుండఁ
దమకు లభియించువానితోఁ దనియలేక
ఘనతరాశాకుటిలమార్గ మనుసరించి
తీరినకొలంది గోరికల్ మీఱుచుండ
సంచరింతురు కొందఱు చపలమతులు;
అంబునిధు లేల, యవి భూము లైన నెంత
రాజ్య మగు? నని తలపోయు రాజవరుఁడు
ఆపగల జల మేల; కల్లైన నెంత
బాగుగా నుండు నని యెంచుఁ ద్రాగుఁబోఁతు
గిరుల శిల లేల పసిఁడిబొంగరము లైన
నెంతభాగ్యంబు గలుగునం చెంచు లోభి

పురుషు లేఁటికి నందఱుఁ దరుణు లైనఁ
గలదె నాకడ్డ మని యెంచుఁ గాముకుండు
దినము లవి యేల దర్శయామినులె యైన
నెంత సుఖ మబ్బు నని తపియించు దొంగ
కాఱుకొనునాశలకు నెందు మేర లేదు
మదిఁ బొడముకోరికల కెందుఁ గొదవ లేదు
ఘృతసముద్దీప్త శిఖిశిఖా తతులభాతి
నబ్బినకొలందిఁ గోరిక లడరుచుండుఁ
దనివి యొక్కింత యెఱుఁగక యనవరతము
దారుణాశోపనయనంబుఁ దాల్చి వివిధ
గతులఁ దిలకించువారల కన్నుఁగవల
కవనితలమెల్ల నొకయడు గైనఁ గాదు
హేమభూధర మొక చిన్నమేని గాదు
సకలసంపత్సమృద్ధమౌ జగతి యెల్ల
విశ్వపతి జీవులకుఁ జూఱ విడిచియుండ
హాయిగా నందుకొని సుఖ మంద లేక
కోరికలమీఁదఁ గోరికల్ కోరికొనుచు
దుర్గమపథానువర్తులై తూలికొనుచుఁ
జేయరాని యకార్యముల్ చేసికొనుచు
నాత్మవంచితు లగుచుందు రల్పమతులు

ఒక్కపరమార్థము వచింతు నున్నమాట
ప్రబలసుఖదుఃఖమయ మైన ప్రకృతియందుఁ
గలసి చరియింప రెండుమార్గములు గలవు
తలఁచి చూడఁగ నా రెండు దారులందు
సకలదుఃఖాధివాస మాశాపథంబు
స్వేష్టసుఖమందిరంబు సంతుష్టిపథము.

(20-6-1915.)

---

## 39 వేంకటేశ్వరస్తవము.

చ. సిరి నురమందుఁ జేర్చుకొని
శ్రీకరలీల సుఖోపభోగత
త్పరుఁడయి భక్తలోక పరి
పాలన మొల్లఁడఁటన్న వాఁడు నీ
శిరమునఁ జేరెఁ గానియెడఁ
జెచ్చెర నాకుఁ బ్రసన్నమూర్తివై
కరుణను నన్నుఁ బ్రోచుటయె
కల్గు మదీశ్వర వేంకటేశ్వరా!

మ. కలికాలంబున దుష్టమానవుల కౌ
　　ఙ్ఞాబద్ధులంజేసి ని
శ్చలధర్మంబు జగంబు నెల్లెడల సం
　　స్థాపింప శ్రీవేంకటా
చలదుర్గంబునఁ బ్రేయసీయుతుఁడవై
　　సద్భృత్యసంఘంబుతో
వెలయంగాంచిన దేవదేవు నిను సే
　　వింతున్ జగద్రక్షకా !

మ. అలవైకుంఠపురంబువీడి నిజభ
　　క్తాభీష్టముల్ గూర్పఁగా
వెలసెన్ వేంకటశైలమందిరమునన్
　　విశ్వాత్మకుండంచు ది
వ్యులు బ్రహ్మాది సమస్తదేవతలు భ
　　క్త్యుద్రేకులై యీవిభున్
గొలువన్ జేరిరొ యయ్యనంతుని నినున్
　　గొల్తున్ రమావల్లభా !

(24-7-15.)

# 40 జలజమాలిక.

మృదులసుమవల్లి పొదలియుఁ బొదలకుండఁ
దొగరుఁజిగురాకు తోఁచియుఁ దోఁపకుండఁ
దొడఁగునును మొగ్గ తొడిగియుఁ దొడుగకుండ
సురుచిరసుమంబు విరిసియు విరియకుండఁ
బూఁపపిందియు పుట్టియుఁ బుట్టకుండ
మధురమధుపానమునవె గ్రీష్మంబుదోఁపఁ
దాఁకువడగాలిచేత నాతపముచేతఁ
గాలవశమున వసివాఁడి తూలుచుండఁ
గన్ను గలవారు హృదయంబుఁ గన్నవారు
కష్టసుఖముల భేదంబుఁ గన్నవారు
కడుపు సల్లగ బిడ్డలఁ గన్నవారు
కరుణ వెదచల్లునొకచూపుఁ బరవఁ జేసి
వేఁడినిట్టూరు పొకటైన విడువకుండ
బండతనమున నూరక యుండఁగలరె?
ఇంచుకంత యేపాపంబు నెఱుఁగనట్టి
యబలనిర్బంధజీవితం బక్కటకట!
యడవిఁ గాచిన వెన్నెల యగుచునుండ
సాధుమతులార! మీకింత జాలిలేదె?

చెదు గన నెఱుంగనట్టి నాజీవనంబు
ప్రబలతాపాప్తి నింకిపోవలసినదియె?
మవ్వపుంబువ్వుఁబోని నాజవ్వనంబు
ఫల మెఱుంగక జాజిపోవలసినదియె?
చంచరీకంబు మంత్రంబు చదువకుండ
మెఱుఁగునును మొగ్గ యొక్కింత విరిసినంతఁ
బ్రిసవరసమెల్ల విషము గావలసినదియె?
అక్కటా! యిది యేటియన్యాయ మయ్య!
ఎట్టియపరాధము నెఱుంగనట్టి నాకుఁ
దగునె యింతటికీడు నాకంబుగ్రాలా!
అలికరుణా హైనయట్టి నామొఁక్కనాలు
నాలకించుట లేనమే యన్నలార!

---

అగ్రహారంబు నేఁబుట్టినట్టియూరు;
మాకులం బెన్నఁదగినబ్రాహ్మణకులంబు;
తగినమాయింటిపేరు వేదాలవారు
సోమయాజులు భాస్కరశ్రుతిప్రసిద్ధ
ధర్మసన్మార్గరతులు మాతాతలెల్ల;
గౌరిపతిసోమయాజి నాకన్నతండ్రి;
అర్థ మధికంబు గలయింటిమాఁదుపడుచు

కామమాంబామతల్లి నాకన్నతల్లి ;
ఇట్టితల్లియుఁ దండ్రియు నేకపుత్త్రి
నైననుఁ బిల్తు రన్నపూర్ణమ్మ యనుచు ;
నాదిపురుషులు గూర్చిన యగ్రహార
పావనక్షేత్రములు మాకు జీవనంబు ;
మాపురంబున కెంతయు దాపునందె
పద్మనాయకకులులు సుప్రథితయశులు
మేరుమందరధీరు లుదారగుణులు
శూరసేనులు దీనమందారులైన
రావుభూపాలవరులకు రాజధాని
కలదు భూగోపురము పీఠికాపురంబు ;
ఆనగర మేలు రావుభూజానిసభను
వాజపేయాన్వయారామ పారిజాతుఁ
డగుపరబ్రహ్మశాస్త్రి విద్యాధికుండు
సంస్కృతాంధ్రసాహిత్యవిశారదుండు
నిగమచయవేది పండితుండగుచునుండు ;
అతనియిల్లాలు మామేనయత్తగారు
శీలవతి శాంతిసదన చుట్టాలసురభి
యగుచు సీతమ్మ పేరికిఁ దగు నటంచు
నవనిజనులెన్న నత్తింట నలరుచుండు.

ధన్యజీవను లైనయామాదంపతులకుఁ
దొలుత నోఁచినయట్టినోములు ఫలింపఁ
గలిగె నొకబిడ్డ చంద్రశేఖరుఁ డనంగ.
అతనినాలవయేఁట మాయమ్మ యెంతొ
కష్టపడి నాకుఁ గష్టముల్ గట్టుకొనకుఁ
డాఁ గనియె నన్ను దుర్ముహూర్తంబునందు.
నేను బుట్టినయపుడు మామేనయత్త
తనకుఁ గోడలు కలిగినదనుచు నుబ్బి
భూరిసంతోషమునఁ బొంగిపోయెనంట!
అది మొదలుగాఁగ నామేనయత్త ప్రేమ
నగ్రహారంబు తనయూరి కవలివీథి
యట్లుగా నుంట ననుఁ జూడ ననుదినంబు
నొక్కపరి వచ్చి పోవుచు నుండు నంట!
మిగులఁ బసితనమందె నామేనబావ
నన్ను ముద్దాడి నవ్వించుచున్నయపుడు
కెవ్వు మని నవ్వలేక నేఁ గేక వేయఁ
బరుగుపరుగున మాయమ్మ యరుగుడెంచి
తత్తరంబున నెగచి నన్నెత్తికొనుచుఁ
బడకపై వంగియున్నమాబావఁ బట్టి
బారుమని యేడ్చుచుండ నీవలికిఁ దేఁగ

నమ్మపందిటిలోనుండి యూవురావు
రనుచుఁ గడుపుబ్బ నేడ్చితి నంట నేను
చిన్నతనమున విధవయై కన్నయింట
నున్నమాచిన్నమేనత్త యూర్చికొనుచు
నపుడు వంటింటిలోనుండి యరుగుదెంచి
నన్ను నొకవంకఁ దనయక్క చిన్నికొమరు
నెలమి నింకొకవంకఁ దానెత్తికొనిన
నూరకుంటిమి యంట మే మొక్కమాఱె.
అపుడు మాయమ్మ రోసరోస లాడుకొనుచు
సణఁగుచుండియు నంతలో జలముఁ గొనుచు
వచ్చుమాయత్తఁ గనుఁగొని ఱిచ్చవడియుఁ
గోపచిహ్నంబు మొగమునఁ దోఁపనీక
నగుమొగంబునఁ జూచి యంతయును దెలిపి
"ఇట్టిపసిపాపలకు నింతలేసిప్రేమ
లేక్రియ ఘటిల్లెనో దైవమే యెఱుంగుఁ
జనులు సేపిన నూరకుండనినిసుంగు
బాపఁ గని యూఱడిలె" నంచుఁ బలికెనంట!
అగ్నిహోత్రంబు సేయుమాయయ్య యప్పు
డమృతరసమొల్కు నాపల్కు లాలకించి
యల్లునిం గూఁతుఁ దిలకించి యలరెనంట!

ఇరుగుపొరుగులఁ గలవార లీయుదంత
మిప్పటికిఁ జెప్పుకొనుచుందు రెలమిమీఱ.
పలికితినియంట! ముందుగా బావపేరె
యడుగు పెట్టితినంట ముందత్త యింట
నేమి చెప్పుదు నిట్లు మాయిర్వురకును
దైవవిధిమూలమునఁ బసితనమునుండి
భావమునఁ బ్రేమ యుదయించి ప్రబలుచుండె.
మేము నిజముగ మేనత్త మేనమామ
బిడ్డలము; మాకు మాలోనఁ బ్రేమ కలిగె
ననిన నపరాధ మని యెవ్వ రనఁగఁగలరు?
చేరువపురంబులం దున్నవార మగుటఁ
బ్రతిదినముఁ జూచుకొనుచున్నవార మగుట
నుదయ మందినమాప్రేమ యొండొరులకుఁ
దెలియకుండ నంతంత వర్ధిల్లుచుండె.
ఇరువురము నొక్కయోఁటిపై నేఁడు వడఁగఁ
దల్లిదండ్రులహృదయేప్సితములతోడ
నలరుచుంటిమి నెలను వెన్నెలను బోలి.
బావ వీరపురంబున బడిని విద్య
గఱచుచుండెను గురులు నచ్చెరువుఁజెందఁ
బండితకుటుంబమునఁ బుట్టి యుండుకతన

నంతయో యింతయో శాస్త్ర మభ్యసించి
గౌరవము గన్నయట్టి మాకన్నతండ్రి
చనవు మీఱంగ నా కనుదినము వ్రాయఁ
జదువ నేర్పుచు నుండెను స్వయముగాను.
ఎలమి వారంబునకు వచ్చు సెలవుదినము
లందు మాబావ మాయింటి కరుగుదెంచి
నీటుగులుకఁడు మాపూలతోఁటలోన
గాటపుం బ్రేమ నాతోడ నాట లాడి
మరల బడి కేఁగుచుండును రాత్రి వేళ.
పదియవయేఁడు నాకు వచ్చినది మొదలు
మిగుల నుత్కంఠ మెఱయ నామేనయత్త
వచ్చి యేఁటేఁట మాఘాదిపంచకంబు
దాఁటునందాఁక నాపెండ్లిమాట యుల్ల
మలర మాతల్లిదండ్రుల నడుగుచుండు.
అపుడు మాతల్లి యామాట కడ్డు వచ్చి
పరిహాసితాస్యంబు భావగోపనము చేయ
" వదినె! యిట్టుల తొందరపడియె దమ్మ!
యెదిగిపోవుదు రే వీర లింతలోన ?
కోడలికమునఁ దనివంది కొన్నినాళ్లు
లత్తరికమును జూపింప నాన గలదొ ?

చిన్నిమనుమని నక్కునఁ జేర్చి జూపె
ముద్దులాడంగఁ దగునంత మురువు గలదొ?
జరుగఁదగుపెండ్లి యొక్క-టే కొఱఁతగాని
యన్నపూర్ణ నీకోడలే యగుచు గాదె!
పరిణయంబున కెవ రడ్డపడఁగఁగలరు ?
అంతవఱకును నెవ రెంత యాత్రపడిన
నెంత యత్నించినను లాభమేమి గలదు?
పసితనంబున డుబుడక్క వాఁడొకండు
వచ్చి మాయన్నపూర్ణ చేపట్టి చూచి
'యీమెపెండ్లి పండ్రెండవయేఁట జరుగు'
నంచు జోస్యంబు సెప్పె నే నడుగకుండ
నెవరివాక్యవిశేషమం దేమి కలదొ
యమ్మ! యీతఁడింపుదముగాక యంతదాఁక
నింత యుబలాటపడియెద వేఁటి" కంచు
నాఁడుబిడ్డను గని హాస్యమాడుచుండు.
ఇంతయును విని మాయయ్య యేమి యనఁగ
నోపఁగాలేక మాటాడ కూరకుండు.
ఇట్లు నాపెండ్లిమాట లేఁటేఁట జరిగి
సన్న మగుచుండుఁ గోకిలస్వరములట్లు.

హృదయము లవేద్యములు గాన నెవరికైన
సమయమధురంబు లైనవాక్యములఁబట్టి
యభినయవిశేషములఁబట్టి యన్యజనుల
భావగతుల నిరూపింప వశముగాదు.

---

శ్రీరామ రామ రామా
శ్రీరామా రామ రామ శ్రీరఘురామా
శ్రీరామ రామ రామా
శ్రీరామా రామ రామ సీతారామా?

---

కలిమిలేములు సుఖములుఁ గష్టములును
జననమరణంబులును దన కనులయెదుట
జరగుచున్నఁ జూడనియట్లు జరగుకాల
మూర కిటు లేగుచుండఁగా నొక్కనాఁడు
బాల్యమున యౌవనచ్ఛాయ పడనినాఁడు
పరువ మంగకముల బయల్పడనినాఁడు
పదియురెండేడు లింకఁ బైఁబడనినాఁడు
పావడకుఁ బైఁట సవరింపఁ బడనినాఁడు
శాంతమయ మైనప్రత్యూష సమయమందు
రమ్యతర మైనమందిరా రామమందు

దివ్యతమ మైనకాసార తీరమందు
మంజులం బైనదాక్షానికుంజమందుఁ
గోరికలు మీఱ హాయిగాఁ గూరుచుండి
యుదయరాగప్రభలతోడ నుల్లసిల్లి
హృదయరాగంబు లుప్పొంగి పొదలుచుండ
బావయును నేనుఁ బ్రకృతివైభవముఁ గనుచుఁ
గుతుక మలరార నొకచోటఁ గూరుచుండి
సంతసిల్లుచు నుంటిమి కొంత సేపు.
ఇట్లు గూర్చుండి యున్నమాయెట్టయెదుట
వికసనోన్ముఖములు దరవికసితములు
వికచములు విస్ఫుటంబులౌ విమలకమల
కుసుమములతోడ నిండినకొల నొకండు
కనులపండువు సేయ మా యనుఁగుబావ
నన్నుఁ గని యిట్టు లనియె "నోయన్నపూర్ణ!
యెట్లు వికసిల్లెనో చూడు మీసుమములు
పరిమళంబులఁ జిమ్మునీపంకజములఁ
గొలనిలో దిగి నేఁ గోసికొనుచుఁ బోయి
యందినకొలంది దెచ్చి నీయంతికమునఁ
జేర్చుచుండెద హారంబుఁ గూర్చుకొనుము"
అని వచించి నేనప్పు 'డూఁ' యనకమున్నె

చెంగు జాల్వాఱఁ గట్టిన యంగవస్త్రు
మించుకంత బిగించి పై కెగయఁ గట్టి
కంచుకకరంబులను సవరించి మలపి
సరవి దండలవలె కెగసనఁగఁ ద్రోసి
కొలనిలోఁ జొచ్చి యందినకొలఁదిఁ గమల
కుసుమములఁ గోసి తెచ్చి నాకొసఁగుచుండె.
అతిముదముతోడ వాని నే నందికొనుచుఁ
గోమరుమీఱంగ హారంబు గ్రుచ్చుచుంటి.
చేతి కందెడుపూవులు చెల్లిపోయె
నిట్టలంబుగ నాయొడి నిండిపోయె
నళినినాదంబు కడుదూరమగుచుఁ బోయె
నాస యింకను బావకు నధిక మాయె
నపుడు ననుఁ జూచి "పూర్ణ! యీహారమునకు
నాయకసుమంబుగాఁ గూర్పు సేయఁదగిన
వికసితం బగుశతపత్ర మొకటి యుండె
నదిగో! చూచితివే కమలాకరమునఁ ;
గోసి తెచ్చెద నిదె చూచికొను" మటంచుఁ
గంచుకము విచ్చి గట్టుపైనుంచి వడిగ
వలదు వల దింక ననుచు నేఁ బలుకుచుండఁ
గొలనిలోఁ జొచ్చి చేయూఁచికొనుచుఁ బోయె.

అప్పుడు నాగుండె దడదడ లాడుచుండఁ
నంగకము లెల్ల గడగడ లాడుచుండఁ
గట్టుచుండినహారంబు నెట్టివైచి
యలరు లన్నిటి నొడినుండి దులిపివైచి
తత్తరంబున మతిలేని దానిఁబోలె
నేమి చేయుచు నుంటినో యెఱుఁగకుండ
నతిభయంబున "నాయనా! యమ్మ!" యనుచుఁ
గేకలిడుచును జని కమలాకరమునఁ
జొచ్చితిని ముందు వెనుకయుఁ జూడకుండ.
బావ యింతలోననె శతపత్రసుమము
నందికొని కోసి సంతోష మతిశయింప
సరభసంబున వెనుకకు మరలునప్పుడు
పంకమునఁ గాలు జారి నవ్వలికి జోగి
ఘనగభీరజలంబుల మునిఁగిపోయె;
నప్పుడొకసారి చలిపిడు గడఁచినట్టు
లూరుపులు కట్టువడ నిల్వ నీరు గాఁగఁ
గనులు చీకటి గ్రమ్మ నెమ్మనము చెదర
స్మృతి యెగసిపోవ మూర్ఛ ముంచికొనిపోవఁ
గూలఁబడిపోయితిని తమ్మికొలనిలోన.
తల్లిదండ్రులు నాదునార్తస్వరంబు

నాలకించుట తడవుగా నరుగుదెంచి
యొడ్డునం గూలఁబడిపోయి యున్న నన్ను
మునిఁగి తేలుచునుండిన యనుఁగుబావఁ
బట్టి కంపితకరములఁ బైకిఁ దీసి
చిటుకుచిటుకునఁ గన్నీరు చిలుకుచుండఁ
జేసిరుపచారములు కొంతసేపుదాఁక.
అంత మేనిర్వ్వరముఁ దెల్విఁనందుటయును
సుస్సరని నాదుజనని నిట్టూర్పు విడిచి
సన్నగిల్లిన గద్గదస్వరముతోడ
ననియె నీరీతి నాప్రియజనకుతోడఁ
"గూర్మిమేనల్లుఁడనుచుఁ బొంగుటయె కాని
మీరొకింత యెఱుంగరు మీఁదితెఱఁగుఁ
గన్నదాదిగఁ గన్నులఁ గప్పుకొనుచుఁ
బెంచికొనుచున్న యీముద్దుబిడ్డకంటె
నింక నీలోకమున మనకేమి గలదు?
చిన్నతనమాది నీచంద్రశేఖరుండు
దుడుకుఁదనముల కలవాటుపడినవాఁడు
కఠినమైన యీసేనటికంపుఁబెండ్లి
యక్కటా! యెట్లు విడిపోవునాయటంచుఁ
గోటిదైవంబులకు మొక్కుకొనుచు నుంటి

నాఁడుబిడ్డతోఁ బోరాట మాడలేక
మంచిమాటలతోనె తప్పించుకొంటి
నామె నిక్కంబుగా మనయున్న ప్రాప్త
పుణ్యమా యని పరలోకమునకు నరిగె
నింక నీతనిసంబంధ మేల మనకు
నితనితోఁగూడి మనబిడ్డ యెట్లు లెప్పు
డేమి యై పోవునో యని యేడ్చుచుంటి
మంచి దిప్పుడు మనబిడ్డ మనకుఁ దక్కె
నిప్పుడేనియు నీతని నిల్లువెడలఁ
గొట్టి మనబిడ్డ బ్రతికించుకొనఁగ రాదె
అనెడు నిల్లాలివచనంబు లాలకించి
యట్టె నాజనకుండు కొయ్యవడిపోయె
నిలువుఁజూపులతో నేను నిలిచియుంటి
మానఘనుఁ డైననామేనమామ యపుడు
జలజమాలికకడకొక్కసారి చూచి
వేఁడినిట్టూర్పు విడిచి మాటాడకుండ
నను నొకించుక గని గిరుక్కునను మరలి
పీఠికాపట్టణమునకు వెడలిపోయె.

ఒరులకష్టసుఖంబుల నెఱుఁగకుండఁ
దమయభిమతంబె తీర్చికోఁదలఁచికొనుచుఁ
దఱి మెఱింగి పూరుషులస్వాంతములు గరఁగ
మాట లాడుచు నుందురు మానవతులు.

---

ఎల్లఋతువులు గ్రీష్మంబులేయనంగ
నధికదుస్సహములు గాఁగ నంతనంత
నేమి చెప్పుదు నటు లొక్కయేఁడు గడచె
బావ యెన్నఁడు నాకంటఁ బడుట లేదు
బావపల్కులు నాచెవిఁ బడుటలేదు.
బాల్యయౌవనములకు సంబంధ మయ్యె
భావకుసుమంబు రేకెత్తి పరిమళించె
సోయగంబు నొయారంబు చూఱగొనియెఁ
జఱుకుఁజూపులలో వింతమెఱుఁగు మెఱసెఁ
జిఱునగవు తేటమాటలఁ జేరికొనియెఁ
జిన్నతనమేఁగి పొడచూపెఁ గన్నెతనము
పొరుగువారలు నాయొడ్డుపొడవుఁ గాంచి
"పిల్ల చూపట్టె బిడ్డల తల్లిలాగు
తల్లిదండ్రుల కింతటి ధైర్య మేమొ
యీడువచ్చిన యీబిడ్డ కింతదాఁక

బరిణయము సేయకుంటుట పాడిగాదు"
అనుచుఁ దమలోనఁ గుజగుజలాడికొనుచు
నాసికను దర్జనిం జేర్చి నవ్వికొనిరి.
చైత్రవైశాఖమాసముల్ చెల్లిపోయె
నవ్వు డొకనాఁటిరాత్రి మాయయ్యకడకుఁ
జేరిమఱింగ మామేనమామ వచ్చి
బావ! మనయన్నపూర్ణ కీవత్సరమున
వేడుకలుమీఱఁ బెండ్లి గావింపవలయు
విజయనగరంబునం గల వేదవేత్త
సోమయాజుల వేంకట సోమయాజి
నెఱుఁగుదువు కాదె మీకు స్నేహితులె కారె
అతనికిఁ దనూజుఁ డైనజనార్దనునకు
నిచ్చెద నటంచు నే మాట యిచ్చినాఁడఁ
బ్రియముతో మీరు నంగీకరింపవలయు"
ననిన మాయమ్మ "వా రగ్రహారఘనులు
భాగ్యవంతులు వారిసంబంధ మెంత
దొరలినను మనబోంట్లకు దొరకఁ గలదె
నచ్చె నిఁక నిన్నియాలోచనంబులేల?
పెండ్లి యీమాసముననె గావింపవలయు
నన్న? నీ వన్న నీబావ యన్నయట్లు

కాదె ? యీమాట తిరిగిపోరాదు మనకు "
ననిన మాతండ్రి మాఱుమాటాడఁడాయె
నాక్షణమునందె నాదీప మారిపోయె
నంతరంగంబు దడదడ లాడిపోయె
నుడుకుఁగన్నీటిచేఁ బైఁట తడిసిపోయె
నాశలన్నియు నపు డడుగంటిపోయె
నమ్మ యొకనాఁడు మంచిముహూర్తమ్ముఁ జూచి
మోదకప్రియునకు మాట మీఁదుగట్టి
వేగ నాపెండ్లిపనులు గావింపఁ బూనె
బహుళపంచమినాఁడు నాపరిణయంబు
జరుపఁదలఁచినయట్లు లుత్తరము వచ్చె
జరుగవలసినదంతయు జరగిపోయె
నింక నాయాశ కాధార మేమి గలదు ?
చిత్తము గలంగ నున్మాద మెత్తినట్లు
లేఁ దిరుగుచుంటి దివసంబు లెన్నొ కొనుచు
వచ్చియును రానియలరుజవ్వనపుమిసిమి
నిమిషనిమిషంబున నొకింత గములుచుండె
నప్పుడప్పుడు నాచిన్నియత్త నన్నుఁ
గౌఁగిటఁ గదించి కన్నీరు కాల్వఁగట్టఁ
జిన్ననాఁటికథలు చెప్పిచెప్పి వగచి

వగచి దైవంబు దూఱి సన్నగిలుచుండె.
పెండిలిదినంబు దా సమీపించుకొలఁది
నెడమగుచునుండె మది జీవితేచ్ఛ నాకు.
అపరిమితమైనకాలాన కానవాలు
చూపుఱెప్పల మాపులఁ జూచి చూచి
యహితునింబోలె హితుఁడయ్యు నైన దాసు
లందుఁ గానిది కంచాలయందుఁ బెట్టఁ
దలఁచు దైవంబు సేఁతలఁ దలఁచి తలఁచి
ప్రకృతియందును బహునందు భవమునందు
నఖిలకారణముల ననహ్యాస జనింపఁ
బ్రాయమున నుండియును బహుబాలపరిచె
బెంగచేతఁ గ్రమంబుగాఁ గ్రుంగుచుంటి
నన్నిపనులును దీఱె మాయమ్మకోర్కె
నిండెఁ జుట్టాలతో నిల్లు నిండిపోయెఁ
బెద్దముత్తైదువులు జేపు పెండ్లి యనుచు
వేడ్కతోఁ బెండ్లికూఁతుఁ గావించి నన్నుఁ
గెలని పెద్దలకెల్ల మ్రొక్కించువేళ
నడుగు తడఁబడుచుండ మాయయ్య వచ్చి
"వరుఁడు చెన్నపురమునుండి వచ్చెనంట
యన్నపూర్ణను బెండ్లాడవనియె నంట

యేమి యన్నఁ బ్రత్యుత్తర మీయఁ డంట
యెంత బ్రతిమాలినను దల యెత్తఁ డంట
వలవ దీపెండ్లి యని తండ్రివార్త వచ్చె
నేమిచేయుదుమో తుద కిట్టు లయ్యె"
అని వచింపంగ నచ్చటి యమ్మలక్క
లెల్ల ముక్కున వ్రేలిడి తెల్లపోయి
మదిగలఁగ నల్వురును నాల్గుమాట లనిరి.
అపుడు మాతల్లిదండ్రుల యంతరంగ
మేపగిది నుండెనో దైవమే యెఱుంగు
మానసోత్సాహపరిభంగ మైనకతనఁ
దల్లిదండ్రులు మదిలోనఁ దల్లడిల్లి
యేమి యోచించుకొనిరో నే నెఱుఁగఁ గాని
తండ్రి పీఠాపురికి వేగఁ దరలిపోయె
మ్లానవదనంబుతోడ నామామఁ గాంచి
"బావ! మన్నించి నావిన్నపంబు వినుము
జరగిపోయిన దంతయు మఱచి పొమ్ము
మొన్న సోదరి నాస్వప్నమునను దోఁచి
కనుల దుఃఖాశ్రుపూరంబు గ్రమ్మ దేర
'నకట సోదర! నీమేనయల్లుఁ డుండఁ
దనయ నితరుల కొసఁగుట తప్పుగాదె?

చచ్చిపోయిననాయాత్మ శాంతికొఱకు
సత్యపరుఁడైననీమన శ్శాంతికొఱకు
నాత్మబంధులలో మరియాదకొఱకు
గురుజనులలోనఁ దలయెత్తికొనెడునీకు
జగము మెచ్చెడునట్లుగా జరుపఁదగదె'
యని వచించి యంత గ్లానిత మైనయట్టు
లగపడుటఁజేసి నీకడ కరుగుదెంచి
కోరికొనుచుంటి వినుము నాకూఁతు నిచ్చి
చంద్రశేఖరునకుఁ బెండ్లి సలుపువాఁడ
నిందులకు నీవు ననుమతిఁ జెందవలయు."
అనిన నామామ కోపంబు నణఁచివైచి
"బావ! సమయజ్ఞుఁడగునీదు పలుకులెల్ల
మెచ్చికొనఁదగినవియె కావచ్చుఁ గాని
నాదుకలలోనఁ గనుపట్టి నీదుభగిని
యిట్టిమాటలు వచియించినట్టులైన
నపుడు నీముద్దుతనయ నాయాత్మజునకుఁ
జిత్తమలరఁగఁ బెండిలి చేసికొందు
నపుడు నీకడకే వార్త పంపికొందు
నిప్పటికిఁ జాలు నీమాటలేఁగు" మనియె
చండశాసనుఁ డగుతండ్రిచాయఁ దెలిసి

బావ యేమియు మఱుమాట పలుకఁ డయ్యె
జనకునకు నాశయంతయు సమసిపోయె
నట్లుగుటఁ జేసి నాపెండ్లి యాఁగిపోయె
నంత మాబావ తనచిత్త మాఁపలేక
కలఁగి పీఠపురంబున నిలువలేక
యెవుడో రెండవకంటివా రెఱుఁగకుండ
జనియెఁ దా నొక్కఁడును విదేశములఁ బట్టి
యేమి చేయుదు నాబ్రదు కిట్టులయ్యె
నంత ప్రేమానుబంధంబు నింత యయ్యె
నాఁడు వారలమాటల నాలకింపఁ
గలుగుసిలుగుల మాతండ్రి తెలిసికొనియె.

---

ఎఱుఁగకయె చేసి తరువాత నెఱిఁగి యెఱిఁగి
తప్పులకుఁ గాంచుచుందురు తగినశిక్ష
కడఁగుటకు మున్నె యోజనగాని వెనుక
నెంతతపియించినను ఫల మేమి గలదు ?

---

అట్లు నాపెండ్లి యాయేఁటి కాఁగిపోయెఁ
గాని, దినము లెప్పటియట్లె కడచుచుండెఁ
బ్రకృతి యప్పుడుఁ దనయిచ్చవచ్చినట్లు

కాలగతిచేతఁ బరిణతిఁ గాంచుచుండెఁ
గోకిలంబు లోకింత కన్గొలుపకుండ
నెలమిఁ గొమ్మలు చిగురాకు లెత్తుచుండెఁ
గొదమతుమ్మెదగము లీలకొట్టకుండఁ
జిన్నికోరకములు వికసించుచుండెఁ
జిలుకముక్కులగిలిగింత లొలయకుండఁ
బసరుకాయలు పరువంబుఁ బడయుచుండె
నిరతపరిణామశీల మా నిఖిలవస్తు
సంచయంబును ననునిమిషంబునందు
నొకరికోరికకొలఁకుఁ గాకున్నఁ దనకుఁ
దానె సమయోచితాకృతిఁ దాల్చుచుండె—
హృదయవేదనతోడ నేనిట్లులుండ
నక్కటా! యేమి చెప్పుదు నొక్కనాఁడు
పూర్వదిగ్భాగమునఁ బొద్దు పొడుచువేళ
శయ్యపై లేచియున్న నా చాయఁ జూచి
మేనెఱుంగక నాచిన్నమేనయత్త
వాకిటం బడి పొరలుచు వాయిమొత్తి
"అక్కటా! మచ్చలేనిమాయన్వయమున
కింతయపకీర్తిఁ దెచ్చితివే విధాత!
అన్నమును బున్నె మెఱుఁగని చిన్నబిడ్డ

నేమి సేయంగఁ దలఁచితివో మహాత్మ!
కటకటా! యిట్టియిక్కట్టు గలుగుననుచు
ననుకొనుచు నుంటి నట్టులే యయ్యెనమ్మ!
కులములోపలఁ దల యెత్తికొనుటయెట్లొ?
తగవు పెద్దవారలకుఁ జెప్పఁదగినయట్టి
యన్నగారికి దారి యేమున్న దింక?
నయ్యయో! మాకుటుంబ మీయార్తిజలధిఁ
బడి సమూలంబు సమసి పోవలసినదియె?
నవ్వఁదలఁచినవారలు నవ్వుచుండ
నేడ్చుచుండెదుమాకు దిక్కెవ్వరయ్యొ!"
అనుచు నీరీతి గుండెల నడఁచికొనుచు
గోలుగోలున విలపింప, నాలకించి
యిరుగుపొరుగులఁ గలవార లేఁగుదెంచి
సంభ్రమాశ్చర్యములు మది సందడింప
నూఱడింపఁదొడంగిరి వేఱువేఱ
నేమిచెప్పుదు నంతలో నింతలోనె
"యన్నపూర్ణ రజస్వలయయ్యె" ననుచుఁ
బలుకుభంగులచే నిట్టె తెలిసిపోయె
మాకులాచారసంపత్తి మాసిపోయె
నెమ్మదిగ నూర నీవార్త నిండిపోయె

దాచిపెట్టనుపాయంబు తప్పిపోయె
నపుడు మాయగ్రహారధర్మాధికారు
లగుమహాపురవరు లొక్కయెడఁ గూడి
బ్రహ్మపరిషత్తుఁ గావించి బహువిధములఁ
జలుపఁదొడఁగిరి వింతగా శాస్త్రచర్చ
ఘనులలోఁగొంద ఱార్షవాక్యములఁ దఱచి
యనువదించుచుఁ బరిణయంబునకుఁ బూర్వ
సమయములఁ గల్గునట్టిరజస్వలలకు
రాగజాదిభేదంబులఁ బరిష్కరించి
కఱపియున్నప్రాయశ్చిత్తగతులుసూపి
తెలిపి దీనికి నిష్కృతి కలుగు ననిరి.
మున్నొకప్డు విదేశంబు చన్నయట్టి
విప్రు నొకనిఁ బతితుఁ గావించునట్టి
ధర్మమెఱిఁగినయట్టి నాతండ్రి కొంత
దెలిపి వల దిది యంచు వారించుకతన
నట్టితఱిఁ బూర్వపక్షులై నట్టివార
లిట్టె తల లూపి తగ దిది యేటిమాట
"కాలజం బిది దీనికి గతులు లేవు
పతితమైనట్టి యీకుటుంబము చావ
వలయునే గాని నిష్కృతి కలుగఁబోదు"

అనుచుఁ దమపూర్వవైరంబులను దలంచి
ధర్మశాస్త్రంబుఁ ద్యజియించి దయను వీడి
మానుషత్వంబుఁ ద్రోసి సన్మతము ద్రోసి
మమ్ము వెలిఁబెట్టి రార్యకులమ్మునందు.
అదిమొదలుగాఁగ మాపాట్లు హరి యెఱుంగు
నేమి చెప్పుదు మాకష్ట మిట్టిదనుచు
నుత్తరీయంబు చాకెత యుదుకదయ్యెఁ
బదములొత్తిన మంగలి పలుకఁ డయ్యె
గవ్వచేయనిదానికిఁ గానునిడిన
సరిగ బచ్చింట వెచ్చంబు దొరకదయ్యె
నాత్మబంధుప్రజల రాక లాఁగిపోయె
నెలమిగలవారు పిలిచినఁ బలుకరైరి
దయయెఱుంగక ధర్మశాస్త్రములవిడిచి
ప్రచలితాన్యోన్య వైరభావములతోడఁ
జిత్తములువచ్చునట్లు శాసించునట్టి
బ్రహ్మపుత్త్రులఁ గానంగఁ బడసినట్టి
కఠినతరమైన యిక్కలికాలమందు
భయద మగుఁగాదె వెలిఁబడ్డ వారిబ్రదుకు!
కడకు మాతండ్రి యిటు దుఃఖపడఁగలేక
యగ్రహారంబు విడిచి మాన్యములు విడిచి

భీతి గదురంగ సుబ్బమ్మపేటయనెడు
పల్లెపల్లెకు దరినున్న బయలునందు
నాకుటీరంబు నిర్మించి యందులోనఁ
దనకుటుంబముతో నుండె వనట మిగుల.
మొదటినెలతోనైనఁ గడచని పోవకుండఁ
బ్రాఁకిపోయినయపవాద భయముచేతఁ
గడుపు దరిగాని కాల్చుశోకంబుచేత
హృదయ ముడుకంగ నుడుకంగ బ్రదుకునందు
నేవ జనియింపఁగాఁ గృశియించి తుదకు
నాదుజననియు జనకుండు నన్ను విడిచి
కష్టదశలను విడిచి లోకంబు విడిచి
మేను విడనాడి పోవ నామేనయత్త
వారికొఱ కేడ్చి యేడ్చి నోరారిపోవ
నాపయిం గన్ను లుంచి ప్రాణములు విడిచె.
ఆత్మబంధులు నను విడనాడిపోవ
దిక్కుమాలినపక్షినై తిరుగునన్ను
సిగ్గుమాలినప్రాణముల్ చిక్కువెట్టి
పనికిమాలిననామేను బడలఁజేసె
విడిచియును నాశచేఁ బట్టు విడువకుండ
నిట్లు వేధించుచుండె నింకెందుకొఱకొ?

చెట్టు వడిపోవఁ గడపటి చిగు
రనుదినము వాడి నే వరుగఁగ
నమ్మలార! నాయనలార! మీ
కరుణపుట్టదె? మీమది కరఁగ
వండితాన్యోన్య వైరభావము
సాధులు కుటుంబసహితులై
తల్లిదండ్రులు చేసిన తప్పుకో
గోమరుపాయంపుజవరాలు కై
పాపమతులై చరించెను పరుఁ
నచ్చుపుంబ్రేమ నాశన మందె
శాస్త్రసముదయమందు నాచా
ప్రజలచిత్తంబులందు దైవవి
గఠినతర మైననాయభాగ్యంపు
మీఁద నిష్కృతి యనుమాట
పుట్టకయ ముండు నెమ్మదిఁ బ
ప్రణయములతోడఁ బెరుగుచు
గలసికొనుభాగ్య మిఁక ముందె
ప్రేమతోఁ బుట్టి ప్రేమతోఁ పె
ప్రేమమయజీవితంబును బ్రేమ

బలిమిమై బలి సేయంగ వలయునేమొ ?:—

*    *    *    *

---

తలఁప గతవర్తమానసందర్భములకు
నొలయుచిఱునవ్వు మసలునిట్టూర్పు కాని
భావిగర్భస్థమైనప్రబంధమందు
నెట్టికథ లెట్లు వచ్చునో యెవ్వఁ డెఱుఁగు ?
నెట్టిగతు లెట్టు లీడ్చునో యెవ్వఁ డెఱుఁగు?
నెట్టివిధు లెట్లు మార్చునో యెవ్వఁ డెఱుఁగు?
(10-9-1915.)

# 41 ప్రేమాంజలి.

ఏవిశుద్ధతత్త్వంబున నీజగంబు
పుట్టిలయమొంది క్రిమ్మఱఁ బుట్టిగిట్టు
నట్టికట్టడి కనయంబుఁ గట్టువడెనొ ?
యావిశుద్ధైకతత్త్వంబు నాశ్రయింతు.

విన్నపము.

"భూమిపాలక ! యొకయబలామతల్లి
కా దనాథ యనాథమై కాలవశత
నొక్కవిన్నపమును బంపుచున్న దిపుడు
దీని దయతోడఁ గాంచి యీదీనురాలి
ప్రార్థనం బాలకింపుమీ ! పార్థివేంద్ర !
పాంచభౌతికమైన ప్రపంచమందుఁ
బార్థివశరీరమును దాల్చి ప్రకృతిగెల్చి
జగతినుండరె యెవరైన శాశ్వతముగ ?
శాశ్వతంబుఁగోర, రాజ్యమును గోర,
ధనము ధాన్యంబుతో నిమిత్తంబు లేదు
చంచలము లస్థిరంబులై జరగువానిఁ
గొనుట కిసుమంతయును బ్రయోజనముగానఁ

గావున ననంతమైన లోకమానుషపిండి
యొకనిమేషంబులోఁ బోవనున్ననాకు
వసుమతీశ్వర ! యేమిగావలసియుండు !
నిహముతోడి సంబంధ మింకేమియుండు ?
నై నగరుణించి దీనితో నంపికొన్న
కడకునాకిదే కోరికగాఁగనున్న
యట్టిప్రేమాంజలిని దయయుట్టిపడఁగఁ
బ్రాణనాథుని పదములపాలి కనిపి
భూతలేశ్వర ! పుణ్యంబుఁ గట్టుకొనుము —
మొగమెఱుంగనిలేమ మోమోటమెడలి
నాకు నీపనిచెప్పుట న్యాయమగునె ?
తనకు నాకంతరంబును గనఁగవలదె ?
యనుచు నన్యథాభావింపఁ జనదు నీకు;
ధరణిపతి ప్రజలకెల్లను దండ్రిగాన
నేను నీప్రజయందలిదానఁ గాన
నామరూపంబు లెఱిఁగినయనాథఁ గాన
నామొఱాలించుటయె నీకు న్యాయమగును,
నన్ను మన్నించుటయె నీకు న్యాయమగును,
నాదుతుదికోర్కి తీర్చుటే న్యాయమగును,
ధరణి ప్రజలకు నీకంటె దైవమెవరు ?

దైవమే దీనులను బ్రోవఁదలఁపకున్న
నక్కటా ! వారికిఁక శరణ్యంబు గలదె?—
కానఁబడకుండఁ జనిన యీకాంతకొఱకు
నేను శ్రమపడవలసిననియతియేమి ?
యెన్నియో రాజకార్యంబు లున్న నేను
కన్ను పెట్టంగఁగలనె యీచిన్ని పనికి ?
నిదియె జ్ఞాపకముగ నుండు పెట్టులనుచు
భూతలేశ ! యుదాసీనబుద్ధి దాల్చి
నాదువిన్నప మఱచేయఁగాదు నీకు ;
ఒకయనాథ, జగతి వీడియున్న యబల,
దయితునిపవిత్ర పాదపద్మములయందుఁ
జిత్తమిడి చన్నక్రొత్తడి, జీవనములు
విభుని ప్రేమాంజలికి ధారవిడిచి చనిన
యట్టియిల్లాలు కోరినయట్టికోర్కి—
చిన్నికోరిక నీవంటి క్షితిపునకును
దీర్పకుండుట ధర్మంబు నేర్పె యనుచు,
నహరహంబును నీయంత రాత్మ నిన్ను
నోర్మితోడఁ బ్రబోధించుచుండుఁ గాన
నాదువిన్నపమును దీర్పఁగాదటంచు
నీవు నపేక్షింతువనుచు నేనెంచఁబోను—

* * * * *

లోకపాలక! నామొఱ నాకళించి
నీ జగత్పాలకత్వసన్నియతి నెంచి
పుణ్యతత్పర మగుధర్మబుద్ధి నించి
చిరతరైశ్వర్య భోగసంసిద్ధిఁ గాంచి
శాశ్వతంబగుకీర్తి నెసంగుమయ్య!"

---

ప్రేమాంజలి.

---

(మంజరి)

"నామనోనాయక! నాప్రాణధనమ!
నాజీవితేశ్వర! నాతపఃఫలమ!
మగువలకుండు సామాన్యపులజ్జ
యనయంబు నామీఁద నధికారవృత్తి
నెఱపుచునుండంగ నృపశిఖామణికి
నామనోనాయక! నాప్రాణధనమ!
నీయునికి, నీమనికి, నీస్వరూపంబు,
నీనామవృత్తులు నీవిలాసములు,
చిడిముడిపాటునఁ జెప్పలేనైతి;

అటు చెప్పకుండినయంత నేమాయె
ప్రాణనాయక! నీదుపావననామ
మనయంబు నాహృదయాంబుజమందు
శతసహస్రాధిక సముద్రాళులట్లు
విరతినెఱుంగక విహరించుచుండె,
నీయునికి, నీమునికి, నీస్వరూపమున
నీనామవృత్తుల నీవిలాసముల
నైక్యానుభావంబు నందిననేను
విరహతాపమునకు విస్మృతి నొసఁగి
యతులితానందరసాంబుధిలోన
నీఁదులాడుచునుందు నేమియుఁ గనక—
అది మనఃకల్పన మగునంతె కాని
నిజముగా నను గూడి నీవుండలేదు
నను విడనాడితే నానాథ యనుచు
నంతరంగసమాధి నవ్వలఁ బెట్టి
కనుదోయి విచ్చి నేఁ గనుఁగొనునంత
హృదయంబునకు సత్య మేర్పడఁదోఁచు,
నది తోఁచినంతనే యక్కటా! నాథ!
వివరింపఁగారాని విరహార్తిగుంది
నీకయి వెదకుదు; నిన్నుఁ గన్గొనక

చెలువలకుండిన సిగ్గునువీడి
హానాథ! హానాథ! హానాథ! యనుచు,
నను వీడిపోయితే నానాథ! యనుచుఁ
"ప్రాణనాయక! నన్నుఁ బాసిన నేను
నిమిషార్థమైనను నిలువంగఁగలనె?
నానాథ వేగమే నామొఱాలించి
నాప్రాణవాయువుల్ ననుఁబాయువేళ
దగ్గఱెఁ గావునఁ దడయంగఁబోక
తలఁపులు మాని చింతాసముద్రమున
మునుఁగకమున్నె నామోములను నిలిచి
నీప్రాణములలోన నిలుపుమువీనిఁ
గడసారి యిదె నిన్నుఁ గాంక్షించుచుంటి"
నని తలపోయుదు నావేళలందు—
ఒకమొగంబునఁ గన్నులున్నపోలికను
నొకగుత్తిలోఁ బూవు లున్నపోలికను
నంటువాయక తిరుగాడెడు మనల
నేవిధి యీవిధి నెడఁబాపనోపె?
అక్కటా! యిదియేమి యనుతాప మయ్యెఁ
గంటికిఁ గంటికిఁ గడుదూర మయ్యెఁ
బూవులు గడు వాడిపోవఁగనయ్యెఁ

జిత్తానుసంధులు చెదరఁగనయ్యె
భావాబ్ధి యీగాలివానకుఁ బొంగి
యధికసంక్షోభంబు నందఁగనయ్యె
భూవభోంతరములఁ బొలుపైన తేజ
మాకస్మికంబుగా నడఁగంగనయ్యె
నక్షులుండియును గాఢాంధకారమున
దిక్కేది యూరక తిరుగంగనయ్యె
హృదయేశ ! హృదయేశ ! యిరుపురిమధ్య
నీచిమ్మచీకటి యెందుండి వచ్చె !
నీమహాంభోనిధి యెందుండి వచ్చె
నీప్రభంజనవేగ మెందుండి వచ్చె
'నంధకారాంబుధి నాపెనుగాలి
నదియేమొ యొకబడబాగ్ని జనించె
నీబడబానలం బెందుండివచ్చె ?
హానాథ ! నాగుండె లదరుచునుండె
నిదియేమి ప్రళయమో యెఱుఁగంగనేర
నేమి గానుంటినో యెఱుఁగంగనేర
వీవెందు డాఁగితో యెఱుఁగంగనేర
నీప్రళయానల మేమైననేమి ?
యీజగమంతయు నేమైననేమి ?

యీజన్మమందు నేనేమైననేమి ?
నాజీవితేశ్వర ! నాప్రాణధనమ !
నిశ్చలమూర్తివై నీవుండఁగోరి
నిఖిలదైవములకు నేమ్రొక్కుదాన ;
అక్కటా ! యిదియేమి యన్యాయమయ్యొ
హృదయేశ ! నీకంటె నీజగమందు
దైవము నాకొండు తానేమిగలదు ?
చిత్తవిక్షోభంబుఁ జెందిననాకు
భ్రాంతిమై నీరీతిఁ బలుకుటగాక—
అడుగుఁ దమ్ములకింది యవనీతలమ్ము
సకలేశ ! యిదియేమొ ! జాఱినట్లుండె,
నంతరాళములోని యమృతసరస్సు
హృదయేశ ! యిదియేమొ యింకినట్లుండె.
నాహ్లాదకరమైన యత్నులతేజ
మాత్మేశ ! యిదియేమొ యడఁగినట్లుండె,
ముకుపుటంబుల నున్న మునిమునియూర్పు
లధిప ! యిదేమొ ! నేఁ డాఁగునట్లుండె,
నాఁదలపై నున్నయామిన్ను గూలి
ప్రాణేశ ! నామీఁదఁ బడినట్టులుండె
నఖిల మీయెడ నేకమైనట్టులుండె

నఖిలమ్ము నను హరించునట్లుగా నుండె
నట్టి యీవేళ నిన్నర్థించునేను
అవసానకాలంబు నందిననేను
నాథ ! నావిలయంబునకు విచారింపఁ
గాని యవ్వల నేమి గలదో యటంచుఁ
దోఁపక యీరీతి దుఃఖించుచుంటి,
నెచటఁ బుట్టిననేమి ? యెట్లున్న నేమి ?
భవదీయపాదసేవాభాగ్యమున్న
విభువరా ! యదె పదివేలగు నాకు;
అట్టిసౌభాగ్యంబు నందుటకొఱకు
ఈమహాశుజ్ఞ నీవిచ్చుటకొఱకు
నంజలిపట్టి ని న్నర్థించుచుంటి.
నామనోనాయక ! నాతపఃఫలము !
యట్టిదీవనల నాకమరంగనిమ్ము,
కడసారి సెలవును గైకొనుదాన—"

## శాంతిగీతము.

"కాంత ! నీ వేస్నపాలశేఖరున కిపుడు
కమ్మలిఖియించితో యట్టి ఘోర్మాశలేశుఁ

డట్టి నీప్రియుఁ డొకస్థాణువట్లు లిపుకు
విజనవనసీమ విజ్ఞానవికలుఁ డగుచుఁ
బడి కదలకుండెఁ దా నొకజడునిభంగి,
నక్కటా ! శక్తిఁ బాసిన యట్టివాఁడు
చెలువ ! యేకాకి తా నేమిసేయఁగలఁడు ?
ప్రాణనాయిక ! నిను విడనాడినపుడె
నీవు నాకంటఁబడకుండ నిలిచినపుడె
మామకమహాధికారసంపదల కెల్లఁ
జిటికలోననె యిటు స్వస్తి చెప్పుటయ్యె
అస్మదీయమహాలక్ష్మివైన నిన్ను
నస్మదీయరాజ్యేందిరవైననిన్ను
నస్మదీయమహాశక్తివైననిన్ను
నస్మదీయమనోభీష్టమైన నిన్ను
నస్మదీయమనోధనమైననిన్ను
నస్మదీయైకజీవనమైననిన్ను
వీడినప్పుడె లోకంబు వీడుటయ్యె
నట్టియవతారమును వీడినట్టినేను
అట్టియుత్సాహమును వీడినట్టినేను
అట్టిక్రీడల విడనాడినట్టినేను
అట్టిభాగ్యంబు పోయినయట్టినేను

ప్రేయసీ! లోకపాలకబిరుదమునకు
నెట్లు అర్హతగలవాఁడ నింకమీఁద?—
అతివ! నీదు ప్రేమాంజలి యందుకతన
నంతరాళంబు కరఁగి నీరైనకతన
నకట! యొకభావ మీహృదయాంబుజమునఁ
బుట్టి సాగరమట్లు లుప్పొంగుచుండె—
కాంత! చెదరిన నామనశ్శాంతికొఱకు
దృఢతరంబైనయట్టి నీప్రేమకొఱకు
వేఱుపడి కానఁబడకున్న విశ్వరూప
మోహనంబగు నీదివ్యమూర్తికొఱకు
సర్వమయి యగు నామహాశక్తికొఱకు
దృఢతరంబగు సంకల్పదృష్టితోడ
నీవునేనుగ మఱి నేనునీవుగాఁగ
నద్వయానందసుఖముల నందుదాఁక
చిత్తమున నిట్లు కోరియాశీర్వదింతు—
"రమ్యతరమైనశుభ్రాంబరంబుఁదాల్చి
పొలుపుమీఱెడు సూర్యచంద్రులను దాల్చి
ప్రవిలములైన తారహారములఁదాల్చి
సౌరభంబుల నొసఁగుపుష్పములఁ దాల్చి
భువనవిఖ్యాతకంకణములను దాల్చి

కడువిమోహాన మగునలంకార మెసఁగ
మానితంబైన నునుమించుమేనితోడఁ
గలుములీనెడు నవ్వువెన్నెలలతోడ
రాజితంబైన కలకంఠరవముతోడ
నాదరంబున నెప్పటియట్ల వచ్చి
భవదనుపమాన పరికృతి ప్రభావకలన
భవదనంతకృపాపాంగపాశములను
నన్ను బంధించి సామేన నన్నుఁ జేర్చి
జన్మజన్మంబు నిల్లె నాసకియువగుచు
మదవతీ! శాంతిసుఖము నందెదవుగాక!"
(16-9-15.)

# 42 గోగీతము.

పులి యావుపైఁ బడఁబోవుట.

ఆ. అనఁగ ననఁగ నొక్కయావుండె నొకయూర;
నంతచక్కనైన యావులేదు;
గుల్లపొదుఁగు వాలుకుచ్చుతోఁ కయుఁ గల్గి
కనులకెంతొ యింపుగాఁగ నుండె.

గీ. ఒక్కనాఁ డది మేఁతకై యూరువెడలి
కొండప్రక్కను మేయుచు నుండఁగాను,
నొక్కదుముకునఁ జనుదెంచి హుంకరించి
పులియొకటి దానిపైఁబడఁ బోయె నకట!
అట్లు పడనున్న పులిఁ జూచి యావొకింత
యైనబెదరక నిల్చి "యోవ్యాఘ్రరాజ!
నిమిషమాత్ర మోపికపట్టి నిలిచి నాదు
విన్నపము నీవు పూర్తిగా వినఁగదయ్య!"
అనెడు నాయావు పలుకుల నాలకించి
పులి నిలిచిపోయె గోడపై బొమ్మవోలె,
నదరుబెదరును లేకుండ నాడినట్టి
పలుకులం దెంత శక్తియో తలఁపవశమె?.

ఆవు పులిని బ్రార్థించుట.

'ఓయి పులిఱేఁడ! కలఁడు నాకొక్కకొమరుఁడు,
కంటి నాతనిఁ దొలిచూలి కానుపునను,
నేఁటి కాతని కేడవనాఁటిపురుడు,
పూరిమేయు టెఱుంగఁడు పురిటిపాప.
చనుగుడిపి వచ్చియుంటిఁ బొద్దునను లేచి,
యకట! యాపాలు గ్రుక్కఁడు నఱిగిపోవఁ
బే! యనుచు నాపయిని గన్ను పెట్టుకొనుచు
నాఁకటను జాల నకనకలాడుచుండు.
చంటిబిడ్డకుఁ గడుపారఁ జన్నుగుడిపి
తిరిగివచ్చి నీయాఁకలి దీర్చుదాన,
ననుఁ ద్వరగ నింటికేఁగి రమ్మనుము దయను
బులివయిన నేమి? దయ నీకుఁ బుట్టకున్నె?'
అనుచుఁ గన్నుల నీరొల్క నావు వల్క,
వెఱ్ఱినవ్వను నవ్వుచు గుఱ్ఱుమనుచుఁ
దలను బంకించి యొడలట్టె దులిపి యావు
నట్టె యీక్షించి శార్దూలమనియె నిట్లు.

పులి యావునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట.

"ఏమి? బిడ్డకుఁ బాలిచ్చి యిటకుఁ దిరిగి
వత్తువో? యేఁటిమాటలు వల్కెదీవు?

నన్ను మఱపించి పోఁజూచు చున్నదాన;
వైన నామాత్ర మెఱుఁగనిదానఁ గాను.
నోటఁబడనున్న నావు నెచ్చోటనైన
విడిచెఁ బులియంచు నెప్పుడైన వింటివా? కా?
విడిచెనో, యెన్నఁడైనను వేగ తిరిగి
వచ్చి యాయావు పులినోటఁ బడియెనో? కా?
మహితవిజ్ఞానులైనట్టి మనుజులైన
నెట్లు పలికిరొ యట్లు వర్తింపలేరు;
నిత్యమును గడ్డి దినుచుండు నిన్నుఁబోలు
నెడ్డెపశువులమాట వేఱెన్న నేల ?.
ఆత్మసంరక్షకంబె నేప్రాణికైన,
నురుతరంబైన కోరిక యొండులేదు,
నిన్నుఁ దినకుండ విడుచుట నీతికాదు,
నీవు మరలవచ్చుటయును నీతికాదు.

పులిని గోవు తిరుగఁ బ్రార్థించుట.

ద్విపద. అని పులి వల్కిన నాగోవు కలఁగి,
తలవంచికొని కంటఁ దడి పెట్టుకొనుచు
"ఓ పెద్దపులిరాజ! యొకమాట నన్నుఁ
బశువులన్నిటివలె భావింపకయ్య!
సత్యంబుతోఁ బోల్పఁజాలినయట్టి

యుత్తమధర్మ మింకొకటి లేదయ్య!
సత్యవిహీనులు చనుచుండు గతికిఁ
బోయెదనయ్య నేఁ బోయిరాకున్న,
నతివల విడలేని యతులేఁగు గతికి,
నిష్టమిత్రద్రోహు లేఁగెడు గతికిఁ,
బరదార నాశించు పాపుల గతికిఁ
బరధనంబుల దోఁచు పాపాత్ము గతికిఁ,
దల్లిదండ్రుల దూఱు తనయుల గతికిఁ,
బోయెదనయ్య నేఁ బోయిరాకున్న.
పూర్వదత్తముల దోఁపుడు వెట్టువాఁడు
నతిథుల నలరింప కదలించువాఁడు
కన్నెను ముసలికిఁ గట్టెడువాఁడు
పెద్దల దూషించి పేరెడువాఁడు
తప్పకపోవంగఁ దగినదుర్గతికిఁ
బోయెదనయ్య నేఁ బోయిరాకున్న.
నామాట నమ్ముమీ నాయన్న! నీవు
నాబిడ్డ నొకసారి నాకుఁ జూపించి
పుణ్యంపుఁ ద్రోవను బోవంగదన్న!
కడుపారఁ జన్నిచ్చి కడసారి నాదు
కనులార నాబిడ్డఁ గని వచ్చి నీదు

కడుపు మండించునాఁకలి దీర్తునన్న!
పోయి రమ్మొకసారి పొమ్మను మన్న."

గీ. మోమునందును సత్యంబు మొలకలెత్త
నావు చేసిన శపథంబు లాలకించి
కరుణపెల్లున హృదయంబు కరఁగి పోవఁ
బులి ప్రసన్నాస్య మగుచును బలికె నిట్లు.

పులి గోవునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట.

"కడుపుతీపిచే నీ విట్లు పడెడు బాధ
కడుపుమంటనుఁ నేఁ బడు గాసికంటె
నెక్కువగఁ దోఁచెఁ గావున నీవు వేగ
వెడలి రాఁగదవమ్మ యోవెఱ్ఱిగోవ!
వనధిలోఁ తెంతొ చెప్పఁగాఁ దరము గాదు
తల్లిదయలోఁతు చెప్పఁగాఁ దరము గాదు
తల్లిదయ యన్నిదయల నుత్తమము గాన
వెడలి రాఁగదవమ్మ యోవెఱ్ఱిగోవ!"

ఆవు తనయింటికిఁ బోవుట.

అనినఁ బులికిఁ బ్రదక్షిణ మాచరించి
కన్ను లానందరసమునఁ గడలుకొనఁగ
నొక్కపరుగున జివ్వున నూఁచపగిదిఁ
బోయి యిలుసేరె నంత నంబా! యటంచు.

అమృతమయమైన యంబాస్వరం బాలకించి
బే! యనుచు నొక్కపరుగున డాయఁబోయి
పొంగఁజేఁపిన తనతల్లి పొదుఁగుఁ జేరి
గుప్పుగుప్పున లేఁగ, పాల్గుడిచికొనియె,
అతఁడు తనపాలు ద్రావుచున్నంత సేపు
నావు కదలక మెదలక యట్టె నిలిచెఁ,
పిదప నాయింటియిల్లాలు వేగ వచ్చి
వెచ్చవెచ్చనిపాలను పిదికికొనియె.
అంతఁ గడుపారఁ బాల్ద్రావి యట్టు లిట్టు
కన్నబిడ్డఁడు పరువెత్తఁ గాంచి కాంచి
కంటికొలుకుల బాష్పముల్ గ్రమ్ముకొనఁగఁ
గొడుకుతో మెల్లగా నిట్లు గోవు పలికె.

గోవు, దూడకు బుద్ధులు చెప్పుట.

“ ఏను నీ కిన్నినాళ్లు చన్నిచ్చి పెంచి
కొంటి, ఋణలేశమును దీర్చుకొన్నదానఁ;
దండ్రి! యిఁకమీఁద నామాట తలఁపకయ్య,
పొలమునం దొంటి చరియింపఁ బోకుమయ్య,
ప్రొద్దు చనుదాఁక మసలఁగాఁ బోకుమయ్య,
పోటువసరాలచెంతకుఁ బోకుమయ్య.
గుఱ్ఱములు గాడిదలు నేనుఁగులును దఱచు

నడచు త్రోవల కడ్డంబు పడకుమయ్య.
బావులకుఁ జెంత గోతుల పరిక్కలందు
నెట్టికస వున్న మేయుట కేఁగకయ్య.
పాలపేదతనంబునఁ దూలితూలి
దుడుకుటావుల పొదుఁగులఁ బొడువకయ్య.
కడుమధురమైన చెంగలి గడ్డియైన
మూరుకొనకుండ మేయఁగాఁ బోకుమయ్య.
కొడుక ! నేనున్నయపుడె నీ కులుకుగాని
యవల నిన్నెవ్వరును ముద్దులాడరయ్య.
పెండుకంటె బూరుగుదూది పింజకంటెఁ
బుష్పధూళికంటెను నూలుపోఁగుకంటెఁ
జుల్కనైనట్టి యన్నివస్తువులకంటెఁ
జుల్కనగు దల్లిలేనట్టి సుతుఁడు భువిని.
ఎవరు నిన్నేమి యన్నను నెదురుకొనక
యందఱకుఁ దలలోనాల్కయట్లు మెలఁగి
ధర్మమార్గంబు దేవునిదయయె నీకు
మాఁతగాఁ, జిరంజీవివై యుండు మయ్య!"

దూడ యావుతోఁ బలుకుట.

తల్లి యిటు పల్కఁగా, లేఁగ దద్దఱిల్లి
" యమ్మ యిటువంటిమాటల నాడె దేల?

కనుల నీరేల? పెదవులఁ గంపమేల?
యింతవంతకుఁ గారణ మేమి చెపుము?
నీవు లేకుండ నేనెట్లు నిలువఁగలను?
అమ్మ! యెవ రింక నను ముద్దులాడువారు?
నాల్కతో నింక నెవరు నన్ నాకువారు?
ఎవరు జల్లున నాకుఁ జన్నిచ్చువారు?
ఎచ్చటికి నీవు పోవఁగా నెంచినావొ
యచ్చటికి నన్నుఁ గొనిపోఁగదమ్మ! దయను.
నన్ను విడనాడి పోవుట న్యాయమౌనె
గోవుతోఁడిదె గాదొకో కోడె?" యనిన;

ఆవు పులిని జేరఁబోవుట.

కడుపు ఱంపపుఁగోఁతచే గాసిఁ జెందఁ
గన్నబిడ్డను గడుపునఁ గదియఁజేర్చి
పులి కొసంగిన బాసను బూర్ణముగను
గోవు వినిపించె నప్పుడు కొడుకునకును.
తల్లిమాటలు వినఁగానె తనయుఁ డకట!
"అమ్మ! అమ్మా!" యటంచును నార్చియార్చి
బడలికను జెంది కొంతసేపటికిఁ దల్లి
కుటుఁగటను నిద్రపోయెను గుఱక లిడుచు.
అంత నాగోవు సత్యవాక్యంబుఁ దలఁచి

యతిథిసత్కారరూపపుణ్యంబుఁ దలఁచి
పుత్త్రిమోహంబు దవ్వులఁ బోవఁ దఱిమి
పెద్దపులినోరఁ బడుటకై వెడలిపోయె.

పులి చింతించుట.

పాడి యున్నదె యెంతైనఁ బసరమునకు?
దక్కిన నిధానమును గాలఁ దన్నుకొంటి,
బుద్ధిహీనుఁడనై మోసపోయినాఁడ
నింత తలకాయ యుండియు నేమిఫలము?
ఆఁకలి దహింపఁగాఁ బ్రేవు లాఱిపోవఁ
జిక్కి గాసిల్లి నేనె చచ్చెదను గాని,
ముద్దులాడుచు బిడ్డతో మురిసిమురిసి
తనివి దీరక పడియుండు దాని కేమి?

ఆవు పులియెదుటకు వచ్చుట.

"చాలఁగాఁ దడవయ్యెఁ గాఁబోలునయ్య
కడుపు మండంగ నెంతటికష్టమునకు
నోర్చికొనియుంటివో యయ్య! యుత్తముఁడవు
నాకు బిడ్డను జూపించినావు దయను.
ఎన్నిజన్మంబులకునైన నీవు చేసి
నట్టిపుణ్యంబు మఱవనోయయ్య! యిపుడె
నన్ను భక్షింపుమయ్య! నాయన్న! యింక,

నాఁకటను నీవు నిలువలేవయ్యొ యక్కట !"

పులి గోవుతోఁ బలుకుట.

గోవుమాటలు విని పులి కొయ్య యగుచుఁ
గొంతవడికిని దెలిసి "యోగోవ! వినుము
యేను బుట్టినదాదిగా నింతదాఁక
నింతధర్మస్వరూపను నెఱుఁగనమ్మ.
ఎంతపాపాత్ముఁడనొ నేను నింతవఱకు
నెన్ని యావులఁ దింటినో యెఱుఁగరాదు
చాలు నింకను జాలును చాలు, నీకు
మ్రొక్కెదను నాదుపాపముల్ పోవునట్లు."

గోవు తిరిగి పులితోఁ జెప్పుట.

అనినఁ బులిఁగాంచి "యిది న్యాయమామహాత్మ!
యీశరీరంబు మున్నె నీకిచ్చియుంటి
నన్నుఁ గృతకృత్యఁ జేయుమోయన్న వేగ,
యాలసింపకు మాఁకటి కాఁగలేవు"
అనుచు నాగోవు గంగడోలట్టె బిగియ
నట్టు పైకెత్తి దాపున కరుగుదెంచి
యెంతవేఁడిన, దయ యన నెఱుఁగనట్టి
పులియు, నప్పుడు పిల్లియైపోయె నహహా!
"తినుముతినుమయ్య!తినుమన్న!"యనుచుగోవు

"తినను దిననమ్మ తిననమ్మ!" యనుచుఁబులియు
నట్లు చాలఁగఁ బంతంబు లాడియాడి
యెవరిదారిని వా రప్పుడేఁగినారు.
అమలసత్యంబె వ్రతమైన యావునకును
నట్టిసత్యంబు గని సాధువైనపులికి
నీశ్వరుఁడు శాశ్వతసుఖంబులిచ్చెను, గథ
యేఁగెఁ గంచెకు మన మింటి కేఁగవలయు.

☛ ఇది బడిపిల్లలకొఱకు వ్రాయఁబడి యానంద
వాచకపుస్తకమునఁ జేరియున్నది.

(1913-1914.)

# 43 లక్ష్మీవిలాసము.



గీ. సత్యము దయాగుణంబు శౌచంబు ధర్మ
నిష్ఠ యెచ్చోట నిలుచు నానెలవుఁజూచి
యలరి తనయంతఁ జనుదెంచి యాశ్రయించు
నమ్మహాదేవి శ్రీదేవి నాశ్రయింతు.

(నాంద్యంతమున సూత్రధారుఁడు పుష్పాంజలివిడిచి)

సభాసదులగు నీసరసుల హృదయకమలములు లక్ష్మీవిలాసభవనములై వికసించియున్నవి. ఇఁక నే నీలక్ష్మీవిలాసరూపక ప్రదర్శనమునకై త్వరపడవలయును.

(తెరలో)

గీ. ప్రకృతమున వచ్చె శుకవారంపుఁబొద్దు,
తెల్లవాఱిన దాదిగాఁ దిరిగితిరిగి
యాత్మకానందనిలయమైనట్టిచోటి
నెన్నికొనలేక వేసరుచున్నదాన.

సూత్ర—(ఆలకించి) అదిగో! ఉచితజ్ఞురాలగు నటి యప్పుడే లక్ష్మీభూమికం దాల్చి వచ్చుచున్నది. ఇఁక ననంతర కరణీయముల నిర్వర్తింప నేఁ

బోయెదను. (అని నిష్క్రమించును.)

పరిదేశము—సిరిపల్లెలోని వీథి.

ప్రవేశము— పేదరాలివేషముతో లక్ష్మీదేవి.

లక్ష్మి—"ప్రకృతమునవచ్చె" అను పద్యమును జదువుచుఁ బ్రవేశించి యొక యింటిగుమ్మముకడ నిలిచి లోపలికిఁ జూచి ఏమది!

గీ. ఇల్లు వాకిలియును లోన నెవరులేని
పగిదిఁ బాడుఁబడుచుండ నీపాఁచియింటఁ
జలిదికంచాల వ్రాల్చి బిడ్డలకుఁ దాను
దినుచుఁ దినిపించుచున్న దీదేబెపడుచు.

నాచూపులు తిరిగిపోవుచున్నవి. నాపాదము లిచ్చట నిలుచుటలేవు. ఆమందిరముకడకుఁబోయి చూచెదను. (అట్లు చేసి లోనికిఁ జూచి ముక్కుపై వ్రేలుంచుకొని) ఛీ! ఛీ!

గీ. మురికిచేతను దుర్గంధపూర్ణమైన
వసనములతోడఁ బిడ్డలు మసలుచుండఁ,
గురుల సంపఁగినూనియ మెఱుఁగువెట్టి
దిద్దుకొనుచున్న దీతరితీపులాఁడి.

నామేను జలదరించుచున్నది. నేనిట నిలువజాలను. (ప్రక్కయింటికిఁ జూపులునిగిడించి) ఈమె

సౌభాగ్యము మఱియు మెచ్చుకొనఁ దగియున్నది.

గీ. పక్కపై లేచి మలినంపుఁ బావిచియింటి
గడపఁ గూర్చుండి చినిఁగిన కంబళమును
బ్రాఁతబ్రహ్మసూత్రంబు దబ్బనపుసూదిఁ
గూర్చి కుట్టుచునున్న దీక్షాంచెకత్తె.

ఈయిల్లు మాయక్క నివసించుటకుఁ దగియున్నది. నేనుండుటకుఁ దగదు. (పరిక్రమించి చూచి) అదిగో! ఆయింటియామె యీమె కక్కయో చెల్లెలో కావచ్చును.

గీ. ఎండఁ గని లేచి వెలుఁగుచునుండుదీప
మూఁదియూఁటిచి పుక్కిటనున్నవిడెము
మరల నమలుచు వీథిగుమ్మంబుఁ జేరి
తూఁగులాడుచునున్న దాజోగురాలు.

ఇట్టియిల్లాండ్రతోఁ దల్లడపడుచు మఱుఁగుఁబెరళ్లతోఁ దులతూఁగుచుండు నీమలినమందిరములకడ నేనొక్కగడియయైన నిలువఁజాలను.

సీ. బెడిదంపుసోమరిపడుచు లుండెడునింటఁ,
బరిశుద్ధిలేని వెంబరలయింట,
మైలమొగంబుల మగువలు గలయింట,
మలమూత్రములబిడ్డలాలయునింట

నెంగిలాకులమీఁద నీఁగ లాడెడునింటఁ,
జీరలఁ జీడపేల్జాఁబునింట,
నాత్మీయధర్మంబు లడుగంటిచెడునింట,
ననదలు సాయంబుఁ గననియింటఁ,
గలిమి లేమిగ సుఖము దుఃఖంబుగాఁగ
మార్పఁగలయెబ్బెరాసులు మలయునింట
నిలువఁగాఁజాల నేనొక్కనిమిషమైన
నిలువఁజాల! నిలువఁజాల! నిలువఁజాల!

మఱియును.

సీ. ఉన్నది తినలేక యొరుల కీయఁగలేక
యుండెడిచోట నే నుండఁజాల,
ముదుకగోనెలఁ గ్రుక్కి మూలఁ బాఁతలువెట్టు
చుండెడిచోట నే నుండఁజాలఁ,
గల్లుకుండలకు నై యిల్లు గుల్లఁగజేయు
చుండెడిచోట నే నుండఁజాలఁ,
బరిశుద్ధి యెఱుఁగక ప్రాలుమాలికఁ జూపు
చుండెడిచోట నే నుండఁజాలఁ,
గలిగియుండియు గతిలేనికరణి మెలఁగు
యువతు లుండెడుచోట నే నుండఁజాల,
ఘనదురాచారములు దుర్వ్యసనము లెచట

నుండు నచ్చోటఁ గూడ నే నుండఁజాల.

ఈవీథి యిండ్లన్నియు నొకదాని కొకటి తీసిపో వుటలేదు. ఇందలి యిల్లాండ్రిందఱు నొక్కయా కునే చదివినట్లున్నారు.

గీ. పూర్వగిరిఁ బొ్రద్దు పొడువకమును పె లేచి
కాలికములగు విధులు చక్కఁగను నెఱపి
శుచిత నిలు దీర్చుకొను నొక్కసుదతియైనఁ
గంటఁ బడదయ్యె నకట! యేయింటనైన.

గీ. స్వాంత మలరించు నిట్టిప్రభాతమందుఁ,
గలకలవెలుంగు కుంకుమ కాంతులందుఁ,
జెలువమున నేత్రపర్వంబు చేయునట్టు
లలికి ముగ్గించు నొక్కయిల్లైన లేదు.

ఎంతవెదకినను నాకెచ్చటను దగినవసతి దొరకు
ట లేదు. ప్రొద్దెక్కిపోవుచున్నది. ఎండైన నావి
శ్రాంతికిఁ దగినతావు చూచుకొనవలయును. మఱి
యొక వీథికిఁబోయి చూచెదఁగాక.

(అని నిష్క్రమించును.)

---

ప్రదేశము—మఱియొకవీథి.
ప్రవేశము—భోగశీల, ధర్మశీల.

భోగ—అక్కా! మనకోరిక యెప్పుడు ఫలించునో కదా!

ధర్మ—మనమిరువుర మేకీభవించి సంకల్పించినచోఁ దీరనికోరిక లుండునా?

భోగ—నీకెప్పుడు నొక్కటే ధైర్యము. ఇట్లెంతకాలము కనుపెట్టుకొని యుండఁగలము? మననెచ్చెలి యగుసిరికింకను మనప్రార్థనము వినఁబడుట లేదు. ఆదంపతులు శ్రీమంతులగునట్లు మనకు శాంతియెక్కడిది? వారి నాశ్రయించిన మనకే యింతకష్టముగ నుండఁగా నిరంతరదారిద్ర్యమున నల్లాడు నాదంపతుల కెంతకష్టముగ నుండునోకదా!

ధర్మ—సోదరీ! మృదులహృదయ వగునీ విట్లనుచుంటివి గాని నిరంతరశాంతస్వభావులగువారలకుఁ గష్టమగును మాటయే యుండదుసుమా!

భోగ—నాకంత వేదాంతము తెలియదు. ఈయుదయమునఁ జూడలేదా? బయటికి భిక్షకుఁ బోవుటకు భర్తకు బట్టలేకుండుటచే సార్థకనామయగు

మనశాంతమ్మ తనచీర సగముచించి కట్టఁబెట్టి పంపినది. అది యెంతవిచారకరమగువిషయము!

గీ. బట్టయును లేదని దినంతుకొట్టి బిట్టు
రేఁగి పోరాడి మగని వర్జింపకుండఁ,
గట్టుచీర సగము చించి కట్టఁబెట్టి
పంపుమగనాలిఁ గని జాలిపడఁగవలదె?

ధర్మ—ఓసి వెఱ్ఱిదానా! సతీధర్మ మట్టిదేకదా! స్వధర్మనిర్వహణము గావించి యానందించుచున్న యామెనుగాంచి సంతోషించుటకు బదులుగ జాలిపడుటెందులకు?

భోగ—అక్కా! సరేకాని, వారు సంపన్నులైనచో నిట్టిచిక్కు లుండవుగదా! వారి కావిచారమే లేదు. ఇంతేకాక వారు కష్టములే కోరుదురని తోఁచుచున్నది. అట్లుకానిచోఁ బిడికెఁడు పిడికెఁడుచొప్పునఁ దెచ్చుకొన్న భిక్షమును వండుకొని తినక యందులో నతిథిపూజలు చేయుట కెవ్వ రభిలషింతురు?

ధర్మ—సాధులస్వభావము లట్లే యుండును. అనుభవజ్ఞులకే యాపన్నుల కష్టములు బాగుగ బోధపడును. కన్నతల్లికే తెలియును గాని బిడ్డబాధ

గొడ్రాలి కెట్లు తెలియును ?

భోగ—అట్టి సాధుస్వభావులను సంపన్నులఁ జేయక పరమేశ్వరుఁడు భాగ్యహీనులఁ జేయుటెందులకు ?

ధర్మ—జీవితపద్ధతులు కర్మసూత్రముంబట్టి పోవుచుండును. ప్రాప్తికాలము వచ్చినప్పుడుగాని భాగ్యము లభింపదు.

గీ. ఎరువు కొఱఁతలేక యెద్దడి నలయక
మేపు చెడకయుండ నెదుగుచున్న,
వరవసంతకాల మరుగుదెంచినదాఁకఁ
దావి నందఁగలదె పూవుఁదోఁట ?

భోగ—అట్టి శుభసమయముకొఱకు నామనసు వేగిరపడుచున్నది.

ధర్మ—నేఁడు శుక్రివాసరము. ఇది శ్రీదేవికిఁ బ్రియకరమగుదినము. ఆసాధుదంపతులకు సంపత్ప్రాప్తికై యాదేవి నింకొకసారి యీదినమున నిశ్చలహృదయముతోఁ బ్రార్థింతము రమ్ము.

భోగ—అట్లే పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

## రెండవరంగము.

ప్రదేశము—బ్రాహ్మణగృహము.

ప్రవేశము—అరుఁగుపై బ్రాహ్మణబాలుఁడు.

బాలు—నాయనగారు సెలవిచ్చినట్లు శ్రీసూక్తము చింతన చేసికొంటిని. ఆయన వచ్చువఱకును లక్ష్మీస్తవము చేసికొనుచుందును.

"పద్మాసనే పద్మకరే సర్వలోకైకపూజితే
నారాయణప్రియే దేవి సుప్రీతాభవ సర్వదా."

(అని స్తుతించుచుండఁగా లక్ష్మీదేవి ప్రవేశించును)

లక్ష్మి—(తనలో) ఆహా! ఇచ్చటికి వచ్చుసరికి నా శరీరాయాసము తీఱిపోయినది. నాకన్నులు చల్లఁబడినవి. నాహృదయ మానందతరంగిత మగుచున్నది. గులకఱాలలోఁ గురువిందమణి వలె నీయిండ్లనడుమ నీమందిర మెంత కలకల లాడుచున్నది! (పరిక్రమించి) ఔరా! ముద్దుల మూటయగు నీబాలకుఁ డెంత మనోహరముగ నున్నాఁడు!

గీ. అలికి ముగ్గులు వెట్టిన యరుఁగుమీఁదఁ
జారుకృష్ణాజినంబుపైఁ గూరుచుండి

వడుగురూపుఁ దాల్చిన వేదవల్లిఁబోలె
నలరుచున్నాఁడు మ్రోల నీయర్భకుండు.

(అని నిట్టూర్పు విడిచి యాయాసము నభినయించు
చు నరుఁగుపైఁ గూరుచుండును.)

బాలు—అమ్మా! మీ రెవ్వరు?

లక్ష్మి—మా గ్రామాసవుుచే నలసిన యొక పేదరా
లను. ఆఁకటికిఁ దాళలేకున్నదానను. పట్టెఁడ
న్నముఁ బెట్టించి పుణ్యము గట్టుకొనుము.

బాలు—అమ్మా! నీకష్టముచూచి నాగుండె నీరగు
చున్నది. భిక్షార్థము మానాయనగారు పోయి
యున్నారు. వచ్చువేళ్లైనది. ఆయన తెచ్చిన
తోడనే వండి మాయమ్మ నీకు వడ్డింపఁగలదు.
కొంచెము నే పోర్చుకొని యుండుము.

లక్ష్మి—(తనలో) ఆహా! ఏమి యీతని యమృత
వాక్కులు! (ప్రకాశముగా) నాయనా! నేనొ
క్క నిమిషమైన క్షుద్బాధ నోర్వఁజాలను. లో
నికిఁ బోయి మీయమ్మనే ప్రార్థింతును.

బాలు—అమ్మా! మాయమ్మ యర్ధవసనయై యు
న్నది. ఎప్పటివలె నర్థులు లోనికి రావలనువడ
కుండుటచేఁ దలు పోరచేసి నేను వారికొఱకే

యరుఁగుపైఁ గూరుచుంటిని. నూనాయన వచ్చువఱకును లోని కితరు లెవ్వరును బోవలను గాదు.

లక్ష్మి—బ్రాహ్మణిని, ఆఁడుదానను. నేను బోవుట కభ్యంతర మేమి యుండును ?

బాలు—(ఇంచుక యాలోచించి) సరే! పోయి రమ్మా !

లక్ష్మి—(వీధితలుపు తెఱచి లోపలికిఁ బోయి చావపైఁ గూరుచుండి) అమ్మా! (అనిపిలుచును.)

(శాంతమ్మ పడమటింటి తలుపుచాటున మొగముగపడునట్లు నిలిచి) ఏమితల్లీ ! (అని పలుకరించును.)

లక్ష్మి—ఆఁకలి దహించివేయుచున్నది. పట్టెఁడన్నము పెట్టవలయును.

శాంత—(నిట్టూర్పు విడిచి) అమ్మా! వండినయన్నము లేదు. కొంఁదిసేపటిలో బియ్యము తెచ్చెదరు. తెచ్చినవెంటనే నిమిషములో వంట చేసిపెట్టెదను.

లక్ష్మి—నే నంతవఱ కాఁగఁజాలను. ఎచ్చటనైన నప్పుఁ దెచ్చియైనఁ బెట్టుము.

శాంత—కలిగినదానితోఁ గడుపుకొనుటయే కాని

నే నెన్నఁడును జేట తీసికొని చేరెఁడు బియ్య మునకైనఁ బొరుగింటి కప్పానకుఁ బోయి యె ఱుఁగను.

లక్ష్మి—క్షమియించి యీదినమున నానిమిత్త మించుక శ్రమపడవలయును.

శాంత—(సందేహించును.)

లక్ష్మి—అమ్మా! ఏమట్లు సంశయించుచున్నావు?

శాంత—(దీనస్వరముతో) తల్లీ! నాయొడలినిండ వసనమైన లేదు. ఆఁడుదానను. వీథిఁబడి పోవుట యెట్లు?

లక్ష్మి—ఆసందేహ మక్కఱలేదు నాచీర చాలఁ బెద్దది. ఇందు సగము చించి నీకిచ్చెదను. ఇదిగో! అందుకొనుము.

(అని చెప్పినట్లు చేయుచున్నది.)

(శాంతమ్మ చీరఁగట్టుకొని చేట చేతఁబట్టుకొని ప్రవేశించి) అబ్బాయీ! (అని పిలుచును.)

బాలు—(ప్రవేశించి) అమ్మా! ఏమి సెలవు?

శాంత—నే నిప్పుడే వచ్చెదను. అంతవఱకీవీవనతో విసరుచు నీమెను భద్రముగఁ గాపాడుచుండుము. అమ్మా! పోయివచ్చెదను. (అని పోవును.)

(బాలుఁడు నిలువఁబడి విసరుచుండును.)

లక్ష్మి—అబ్బాయీ! నీపేరేమి?

బాలు—ఆనందుఁడు.

లక్ష్మి—మీతండ్రిపేరు?

బాలు—బ్రహ్మ సోమయాజి.

లక్ష్మి—నాయనా! నీయుపచారములచే నాకుఁ జాల సుఖముగ నున్నది.

బాలు—లోన నాఁకలి యగుచుండఁగాఁ బైయుపచారము లెన్ని చేసిన నేమి? అమ్మ కప్పుడైదొరకెనో లేదో!

(కావటివానితో శాంతమ్మ ప్రవేశము.)

లక్ష్మి—అమ్మా! ఇవి యన్నియు నెక్కడదొరకినవి?

శాంత—తల్లీ! నీవు వచ్చినవేళ మంచిది. అప్పుడన కుఁ బోవనక్కఱ లేకుండఁగనే పెద్దకోమటి యీస్వయంపాకము పంపినాఁడు. ఇతఁడు నాకెదురుపడుటచే నిట్టే వచ్చితిని. నీ వించుక సేపు విశ్రమింపుము. నిమిషములో నన్నము పెట్టెదను. (అని కావటివానిఁబంపి శాంతమ్మ పరికరములఁ దీసికొని లోనికిఁ బోవును.)

బాలు—(లక్ష్మిఁజూచి) అమ్మా! ఒక్కనిమిషము

చాఁపపైఁ బరుండెదవా!

లక్ష్మి—అక్కఱలేదు నాయనా! అన్నముపేరు వి
న్నతోడనే యాఁకలి సగము తగ్గిపోయినది.

బాలు—అట్లయినచో నమ్మ వంట చేయునంతలో
నీవు స్నానము చేసికొందువా?

లక్ష్మి—మీనాయనగారు వచ్చి స్నానము చేసిన
తరువాతఁ జేయుదును.

బాలు—ఆయనకు నాకు నుదయముననే స్నానసం
ధ్యావందనము లైనవి. మాధ్యాహ్నికసంధ్యా
సమయ మగుచున్నది. ఏమోకాని మానాయ
నగా రింకను వచ్చుటలేదు.

లక్ష్మి—తొందరలేదు. మీతండ్రి బిడ్డలభోజనము
లైన తరువాతనే నేనును మీయమ్మయు భుజి
యింతుము.

శాంత—(లోపలనుండి) అమ్మా! వంటమైనది.
స్నానమునకు లెమ్మా. వేఁడినీళ్లు పెట్టితిని.

లక్ష్మి—నీనాథుఁడుగూడ రానిమ్మా.

(అప్పుడు భిక్షాపాత్రము చేతఁబూని బ్రహ్మసోమ
యాజి ప్రవేశించును.)

బాలు—నాయనగారూ! వందనములు.(అనితండ్రి

తెచ్చినవానిని లోనికిఁ దీసికొనిపోవును).

బ్రహ్మ—(లక్ష్మివంకఁజూచి) అమ్మా! నామూలము న నీకాలస్యమైనది కాఁబోలును. తల్లీ! కల వారముకాము. భిక్షుకులము గదా!

లక్ష్మి—అయ్యా! మీయాదరణ మన్నముకంటె నాకు బలకరమైనది. ఆర్తజనశరణ్య మగుమీ యాశ్రమముఁ జేరినప్పుడే నాయాయాసము తీ ఱిపోయినది. మీబాలుని యుపచారములచే మఱియు నానందమైనది.

బాలు—(ప్రవేశించి) నాయనగారూ! వంటమైనది లెండు.

బ్రహ్మ—(ఆశ్చర్యముతో) అప్పుడే వంటమైనదా? ఎట్లు?

బాలు—స్నానము చేయుచుండ మనవి చేసెదను. ఆమెకుఁ బొర్లిదైనది. శీఘ్రముగ లెండు. అమ్మా! నీవును లెమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ప్రదేశము—దేవాలయపరిసరము.

ప్రవేశము—భోగశీల, ధర్మశీల.

ధర్మ—సోదరీ! నీయభీష్టము సిద్ధించినదా?

భోగ—సంపూర్ణముగ నాకు మనశ్శాంతి కలిగినది.
నాఁడుమొదలుగ నానిఱుపేదదంపతుల నిలయ
ము సంపన్నుల నిలయమగుచున్నది.

సీ. రాజు పంపె నటంచు రజతఖండంబులు,
రడ్డి పంపె నటంచు రాజనాలు,
రాణి పంపె నటంచు అవికలుఁ జీరలు,
సాలె పంపె నటంచు సాలువులును
వైశ్యుఁ డంపె నటంచు వలసిన వస్తువుల్,
కరణమంపె నటంచుఁ బెరుఁగునేయి
కాఁపు పంపె నటంచుఁ గాయగూరలుఁబండ్లు,
దొరలు పంపి రటంచు దోవతులును,
గీ. దినదినంబును బట్టించుకొనుచు వచ్చి
యర్పణము చేసి పోయెదు నట్టివారి
యనుపమోత్సాహరవము మిన్నంటిపోవ
నలరుచున్నది పేదబ్రాహ్మణు గృహంబు.

ఆపేదరాలానాఁటియర్ధరాత్రమున నదృశ్యయై
పోవుటచే నాదంపతులామెకొఱకే పరితపించిపోవు
చున్నారు ఆమెఋల్లనిపాదములఁ దలఁచుకొని త
ల్లడపడుచున్నారు. పాప! మామె శ్రీమహాలక్ష్మి
యని వారి కెట్లు తెలియును?

ధర్మ—ఆనందతన్మయత్వమున నీవన్నియును మఱచిపోవుచున్నావు. ఆదేవి నిన్నటిరాత్రి వారికి స్వప్నమునఁ బ్రత్యక్షమై నేను శ్రీమహాలక్ష్మి నని చెప్పినట్లు నీవు వినలేదా? నేఁడు వారు శుక్రవారవ్రతము చేయఁగడఁగుట యాహె యానతినే కాదా!

భోగ—ఔను. ఈవిధముగాఁ బ్రతిశుక్రవారము నైదుసంవత్సరములు చేయవలయునఁటకాదా?

ధర్మ—అయిదుగురు ముత్తైదువలకుఁ దలలంటిపోసి చీరల రవికల నొసంగి మృష్టాన్నముల భుజియింపఁజేసి యథేచ్ఛముగ దక్షిణతాంబూలములచే సంతుష్టిపఱచుచుండవలయును.

భోగ—లక్ష్మీకటాక్షమునఁ గృతార్థులగు నాదంపతుల కిదియొక లెక్కలోనిది కాదు.

గీ. సంపద లొసంగు శుక్రవారంపునోము
నోఁచునది; నోముమన్న దానుతగుణాఢ్య,
పంకజాలయ, శ్రీదేవి, భక్తిపూర్ణ
హృదయు లాదంపతులు, వారికేమికొదవ?

ధర్మ—అదిగోఁ బుణ్యసతీ పరివృతులై యాదంపతులు పుత్త్రిసహితముగ దేవీసందర్శనమునకు

దేవళమునకు వచ్చుచున్నారు. మన మచ్చటి మహోత్సవముల నదృశ్యులమై యాలోకించి యానందితము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ప్రదేశము—దేవాలయాంతర్భాగము.

ప్రవేశము—బ్రహ్మసోమయాజి, శాంతమ్మ, ఆనందుఁడు, మఱికొందఱు పుణ్యస్త్రీలు.

(సోమయాజియు శాంతమ్మయు దేవికి హారతిఁ బట్టియుండఁగా నానందుఁడు ఘంటానాదముచేయుచుండును.)

(అందఱు)

గీ. మంగళము సర్వలోక సమ్మాననీయ !
మంగళము సర్వశక్తి సంపత్ప్రకాశ !
మంగళము కరుణాంచితాపాంగ పూర !
మంగళము విష్ణుభామ ! రామాలలామ !

జయము ! మహాలక్ష్మి ! జయము ! (అనివిజయధ్వనులు చేయుదురు.)

(అనంతరము దేవీమూర్తినుండి)

ఓ పుణ్యదంపతులారా ! పుత్త్రిసహితులగు మీకు శుభ మగుఁగాక !

సీ. ఆర్తస్వరంబులో నమృతసంగీతంబు
నాలకించిన పుణ్యులయ్య మీరు!
నిఱుపేదతనములో నిధినాయకత్వంబు
చూఱలాడిన మహీసురులు మీరు!
ప్రాఁతపేలికలలోఁ బసిఁడిచేలంబుల
తళుకుఁ గాంచినమహాత్ములుమీరు!
అతికష్టజలధిలో నానందరమతోడ
మాటలాడిన మహామహులు మీరు!

తే. అతిథులందు ననదలందు నార్తులందు
నాత్మసాదృశ్యముం గాంచు ననఘులీరు!
ధన్యతములార! మీకు మీతనయునకును
నాయురారోగ్య విభవంబు లగునుగాక!
ఇంకను మీకేమి కావలయును?

బ్రహ్మ—
శాంత— } (చేతులు జోడించుకొని) తల్లీ!

గీ. సత్యశౌచదయాధర్మ శమదమాది
సద్గుణసముద్రు లగుభక్తసత్తములకు
నందఁగారాని నీకృపాపాంగదృష్టి
బడయఁగల్గితి, మిం కేమి వలయునమ్మ!

బ్రహ్మ—అమ్మా! అయిన నిట్లగుఁగాక!

గీ. ధరణి యీతిబాధలు లేక తనరుఁగాక!
ప్రజల యన్యోన్యవైరముల్ పాయుఁగాక!
కవిత, రాజపోషణమునఁ గ్రాలుఁగాక!
నీతిపాలనమున రాజు నెగడుఁగాక!

శాంత—

గీ. కాంతలకు భూషణంబులకంటె నీప్సి
తార్థములకంటె భోగభాగ్యములకంటె
నిండుప్రాణంబుకంటె నన్నింటికంటె
మగనియానతియే ప్రియంబగునుగాక!

(దేవిమూర్తినుండి) తథాస్తు! తథాస్తు! తథాస్తు!

అందఱును—తథాస్తు! తథాస్తు! తథాస్తు!

(అందఱు నిష్క్రమింతురు.)

☞ ఇది బడిపిల్లలకొఱకు వ్రాయఁబడి యానంద వాచకమునఁ జేరియున్నది. (1913-14.)

---

ప్రథమభాగము సంపూర్ణము.

